


ఆగస్ట్ 'చతుర'లో ప్రచురితమైన కొలవల్లి ఈశ్వరరావు, ఎం ఐ. కిషన్‌ల సంయుక్త రచన 'హరిశ్చంద్రుడు అబద్ధం ఆడితే' నవలపై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## సరికొత్త ప్రేమకథ

(ప్రథమ బహుమతి రు.100/- పొందిన సమీక్ష)

'కడుపుబ్బ నవ్విస్తూ, ఆద్యంతం ఆసక్తికరంగా చదివించే నవల అని మీరు పరిచయంలో రాసిన మాటలు అక్షరాలా నిజం. ఈ నవల చదివి నవ్వని వాళ్లెవరయినా ఉంటే వాళ్లకు సెన్సాఫ్ హ్యూమర్ లేనట్టేలెక్క.

నిజ జీవితంలో అన్నివేళలా సత్యహరిశ్చంద్రుడిలా బతకడం అసాధ్యం - అన్న సత్యాన్ని ఇతివృత్తంగా తీసికొని ఈ నవల రాశారు. అలా సర్వకాల సర్వావస్థలయందూ నిజమే చెబితే ఏర్పడే చేదు పరిణామాలను చాలా విపులంగా హాస్యభరితంగా చిత్రీకరించారు.

ఇది హాస్య నవలకాబట్టి చివరకు హీరో హీరోయిన్ కలుసుకొని కథ సుఖాంతమవుతుందని ముందు నుంచీ అనిపించినా, ఏ విధంగా సుఖాంతమవుతుందో ఊహించలేకపోయాం. అది నిజంగా ఊహించని ముగింపు. ఆ ముగింపు మానవత్వపు విలువలను ఎత్తి చూపుతుంది. ఆ మానవత్వమే రాఘవయ్యలాంటి పిసినారిని 'అవసరమైతే హరిశ్చంద్ర వాళ్లనాన్న ఎంత కట్నమడిగితే అంతా ఇచ్చి అయినా సరే అతన్ని అల్లుడిగా చేసుకొని తీరాలి' అనుకొనేలా చేసింది. ఎదుటి వ్యక్తి ప్రాణాన్ని కాపాడ్డంకోసం ప్రాణాధికంగా ప్రేమించిన ప్రియురాల్ని సహితం ఒదులుకోవడానికి వెనుకాడని అతని వ్యక్తిత్వమే లాహిరిని ఆకర్షించింది. అతని వ్యక్తిత్వం ముందు కార్లు, మేడలు, ఆరడుగుల అందగాళ్లు సూర్యుడి ముందు దివిటీల్లా వెలవెలపోయారు.

కొసమెరుపు కూడా బాగుంది. లాహిరి మనసు మారి హరిశ్చంద్రని ప్రేమించడం మొదలుపెట్టినా కూడా అతన్ని ఏప్రెల్‌ఫూల్ చేయడానికి 'బండరాయి' లానే నటించడం వలన కథ ముగింపు ఊహించలేకపోతాం. మొత్తానికి ఇదొక వెరయిటీ ప్రేమకథ. కథలో కథనంలో కూడా నూతనత్వముంది.

— పి.వి.సుధాకరరావు, నెల్లూరు.

# హాస్యవల్లరి

(ద్వితీయ బహుమతి రు.75/- పొందిన సమీక్ష)

ప్రేమ ముఖ్య విషయంగా ఉన్న ఈనవలలోని కథాంశం - హరిశ్చంద్ర లాహిరిపెట్టిన ప్రేమ పరీక్షలో అనేక కష్టాలు పడి ఓడి గెలవటం. హరిశ్చంద్రుడి ప్రేమపరీక్ష, అతడి కష్టాలు, లాహిరి ఊహాగానాలు, 'కాస్త మెంటల్ వాడైనా ఫర్వాలేదు కట్నం ఇవ్వక్కర్లేద'నుకొనే రాఘవయ్య పిసినారితనం, బంటూ ముదురు మాటలు నవలలో హాస్యాన్ని పండించాయి.

నవలలోని పాత్రలన్నీ మంచివి కావటం విశేషం. హరిశ్చంద్ర ప్రేమమైకం నుండి బయటపడి 'బంతరాయి' ని గుర్తించడం, లాహిరి 'ఆఫ్టరాల్ మారుతికారైనా లేని హరిశ్చంద్ర' మంచితనాన్ని గుర్తించడం, కట్నంఇవ్వైనా హరిశ్చంద్రను అల్లుడిగా చేసుకోవాలని పిసినారి రాఘవయ్య నిర్ణయించుకోవడం, 'నా ప్రాణదాత, అంటూ హరిశ్చంద్రను బంటూ గౌరవించడం, అంతగా పట్టుబడితే వాడికిష్టమైన అమ్మాయినే చేద్దాం' అని అచ్యుతరామయ్య చెప్పడం, ఆ పాత్రలలో క్రమంగా వచ్చిన పరిణతిని సూచిస్తాయి.

నవలలో 'పాలకు బదులు పెట్రోలుతాగి ఉంటాడు', 'పమిట చెంగు నములడం మీ హాబీనా' 'ఉమ్మెత్తకాయలు తినడం మీహాబీనా', 'హైటయినా ఆరడుగులు ఉండి చచ్చిందా అంటే లేదు మహా అయితే అయిదడుగుల పదకొండు అంగుళాలు ఉంటాడేమో - లాంటి సంభాషణలు; నర్మద హరిశ్చంద్రను పరీక్షించే దృశ్యం, సిల్క్‌స్మిత సన్నివేశం పాఠకుల్ని నవ్వుల్లో ముంచెత్తుతాయి.

కొన్ని సందర్భాల్లో రచయితలు హాస్యంకోసం చేసిన ప్రయత్నాలు అతిగానూ, అసహజంగానూ ఉన్నాయి. ఉదాహరణకు హరిశ్చంద్ర బనీనులో వంకాయవేసుకోవడం, నోట్లోవేలు వేసుకోవడం, చంకలుగుద్దుకోవడం, వంటివి లేకుండా కూడా నవల రక్తికట్టే నవలలో కొన్ని చోట్ల నేటి హాస్యచిత్రాలను గుర్తుకుతెచ్చే సన్నివేశాలు ఉన్నా ఫూల్స్‌డే రోజున ముగిసే ఈనవల పాఠకుల్ని నవ్వుల్లో ముంచెత్తుతుంది. ప్రేమ పరీక్షలో హాస్యాన్ని సృష్టించిన రచయితలు ఈశ్వర రావు. కిషన్‌లు అభినందనీయులు.

— టి.చిరంజీవి. తిరుపతి.

# అభినందనీయం

(తృతీయ బహుమతి రు.50/- పొందిన సమీక్ష

కోలపల్లిగారు. కిషన్‌గారు సంయుక్తంగా రచనచేసిన ఈనవల హాస్య, వ్యంగ్య సంభాషణలతో, నేటి యువతకు సందేశాన్ని అందించే చక్కటి ప్రేమకథ. ప్రత్యేక తరహాలో అమాయక యువకునిగా హరిశ్చంద్రనూ, అతని చుట్టూ బంటూ, లాహిరి, వామన్రావు, రాఘవయ్యలతో చక్కటి హాస్యాన్ని అందించారు.

'కట్నం ఎవరికి కావాలి బోడికట్నం? నేనేమన్నా సంతలో అమ్ముడుబోయే పశువుననుకున్నావా' అనే మాటల ద్వారా వరకట్నంపై ఒక వ్యంగ్య బాణాన్ని సంధించారు. "లక్కీగా మీ కులం మాకులం కూడా ఒకటే కాబట్టి నువ్వు ప్రొసీడ్ అయిపోవచ్చు, అనేమాట నేడు సమాజంలో కులం ప్రభావం ఎంతగా ఉన్నదో గుర్తుచేస్తుంది. 'కలలో తప్ప ఇలలో ఎవ్వరిదగ్గరా ఎటువంటి పరిస్థితిలోనూ అబద్ధం ఆడకూడదు, అంటూ హరిశ్చంద్రకు ప్రేమ పరీక్ష పెట్టిన కుసుమకోమల సుందరాంగి లాహిరిలో నవలాంతంలో వచ్చే మార్పు నేటి నవలా సాహిత్య ప్రభావంతో ఊహాలోకాల్లో విహరించే యువతులకు చక్కటిసందేశం.

నవల మొదట్లో పదేపదే పిచ్చి అనే పదాన్ని వాడి బోర్ కొట్టించారు. 'ముండాకాన' ఆడద్రాక్ష్యలా, పళ్లదయ్యం. నరుకుతానొరేయ్- లాంటి మాటలు కాస్త ఎబ్బెట్టుగా ఉన్నా నవలను చివరివరకూ ఆసక్తిగా చదివేటట్లు తీర్చిదిద్దారు. దానికితోడు చక్కని ముఖచిత్రంతో 'చతుర' కొత్త అందాల్ని సంతరించుకొంది. రచయితలు, చిత్రకారుడు అభినందనీయులు.

— వై.రాజేంద్రప్రసాద్. కడప

# ఇతివృత్తం పాతదే

(రు.25/- బహుమతి పొందిన సమీక్ష)

మామూలుగా అయితే 'అలుగుటయే ఎరుంగని... అజాత శత్రువే అలిగిన నాడు, ఏమి జరిగేదో. హరిశ్చంద్రుడు అబద్ధం ఆడితే కూడా అదే జరగాలి. కానీ ఇది హాస్య నవల కాబట్టి కథ సుఖాంతం అవుతుంది. ఎవరయినా సరే అడపాదడపా అబద్ధం ఆడకపోతే ఏరికోరి ప్రమాదాల్లో చిక్కుకోవడం ఖాయం. పరిస్థితులను బట్టి కాలానుగుణమైన సర్దుబాటు ఎల్లవేళలా ఆమోదయోగ్యమే కాదు అవసరం కూడా! 'అశ్వత్థామ హత: కుంజర:' అని ధర్మరాజు అని ఉండకపోతే కురుక్షేత్ర సంగ్రామం ఎలా ఉండేదో ఊహించలేం.

వీటన్నిటిని పక్కనబెట్టి విషయానికి వస్తే పరిపూర్ణమైన హాస్యం, శృంగారం మేళవించిన నవల ఇది. ప్రేమ ఫలించి కథ సుఖాంతం కావడం, అంతకన్నా ఎక్కువగా నవ్వించే సన్నివేశాలతో నవల చివరి వరకూ పాఠకులను ఆకట్టుకోగలిగింది.

కథారంభంలో గులాబి మొక్క సింబాలిజం బాగుంది. గులాబీలను కోరుకొనేటప్పుడు దాని చుట్టూ ఉండే ముళ్లను కూడా భరించగలిగే ఓర్పు ఉండాలి.

ఇదే ఇతివృత్తంతో పాతిక ముప్పై సంవత్సరాల క్రితం 'గులాబీ ముళ్లు' అనే పేరుతో ఒక ప్రముఖ వారపత్రికలో సీరియల్ నవలగా వచ్చింది. అందులో హీరో కూడా బ్యాంక్ గుమాస్తాయే. ప్రేయసి లక్ష రూపాయల ఆస్తిని సంపాదించమంటుంది. ఆ డబ్బు ఇవ్వడానికి అతని తాతగారు విధించిన షరతు అబద్ధం ఆడకూడదని. ఏడాది గడువులో ఇలాంటి ఇబ్బందులే ఎదురవుతాయి. అయితే సన్నివేశాలు ఈనాటి పరిస్థితులకి అనుగుణంగా మార్చారు. కథ సుఖాంతమే! ఏదియేమైనా ఈతరం పాఠకులకు ఈ ఇతివృత్తం కొత్తదే. అంత వరకూ అది రచయితల విజయమే!

—పంతుల బాలసుబ్రహ్మణ్యశర్మ, బొబ్బిలి

# సినిమా చూసినట్టుంది

(రు.25/- బహుమతి పొందిన సమీక్ష)

నవల చదువుతున్నంతసేపు ఓ హాస్య ప్రధానమైన సినిమా చూస్తున్న అనుభూతి కలిగింది. రచయితలు ఓ చిన్న పాయింట్‌ను తీసుకుని ఇంత పెద్ద నవలను తయారుచేసి మమ్మల్ని కడుపుబ్బా నవ్వించారు. హాయిగా నవ్వితే ఆయుష్షు పెరుగుతుందంటారు. అందువల్ల మమ్మల్ని ఓ రెండుగంటలు హాయిగా నవ్వించిన రచయితలు ఈశ్వరరావు, కిషన్‌గార్లకు కృతజ్ఞతలు.

సర్వకాల సర్వావస్థల యందు సత్యమునే పలకడం ఎంత కష్టమో, మరెంత నష్టమో చక్కగా విశదపరచారు. మనసులో అనుకున్న మాటల్ని సైతం సత్యాన్నే చెప్పాలన్న నిబంధన ప్రకారం హరిశ్చంద్రతో బయటకు చెప్పించి అతన్ని కష్టాల పాల్జేయడం కొంత విడ్డూరం అనిపించినా, ఆ సంఘటనలకు హాస్యాన్ని మేళవించి, ఎబ్బెట్టుగా కనిపించకుండా చేశారు రచయితలు. చక్కని ముగింపును కూడా కూర్చారు.

లాహిరి లాంటి బండ మనిషి కోసం సత్యాన్నే పలికి ఓ మనిషికి ప్రాణాపాయం కలిగించడం ఇష్టంలేక తన ప్రేమవ్రతాన్ని వదులుకొని మానవత్వం మూర్తీభవించిన మనిషిగా హరిశ్చంద్రను నిలబెట్టి ఉన్నత విలువలను చాటిచెప్పారు.

ఓడిపోయి లాహిరి హృదయంలో ప్రియమైన, గౌరవమైన స్థానాన్ని సంపాదించుకొన్న హరిశ్చంద్ర మా హృదయాల్ని కూడా ఆక్రమించుకొని ఇప్పుడప్పుడే వెళ్లనంటున్నాడు. ఇంత మంచి హాస్య నవలను అందించిన 'చతుర' సంపాదకులు అభినందనీయులు.

— శ్రీనివాస్, ఆలూరు

ముఖచిత్రం: పినిశెట్టి

# నవ్వుల నావ

*(రు.25/- బహుమతి పొందిన సమీక్ష)*

ఈ నవలొక నవ్వుల నావ! ప్రయాణాద్యంతమూ హాయిగా నవ్వుకోవాలనుకునే హాస్యప్రియులు ఒక్కసారి ఇందులో అడుగుపెట్టి తీరాల్సిందే! ఓస్! ఒట్టి నవ్వులేగా! అనుకొంటే మాత్రం పప్పులో కాలేసినట్లే. ఇందులో అంతర్లీనంగా చక్కని సందేశం సునిశితమైన విమర్శకూడా ఉన్నాయి.

సత్యం కోసం ఆలిని అమ్మిన హరిశ్చంద్రుడిని షట్చక్రవర్తులలో ఒకరుగా మన్నించారు ఆనాటి ప్రజలు. కాబోయే ఆలికోసం సత్యమునే పలికెదనన్న ఈనాటి హరిశ్చంద్రుడిని 'క్రాక్ మాస్టర్' అంటూ గేలిచేస్తారు ఈనాటి ప్రజలు.

'అబద్ధం' ఈనాటి మన జీవితాల్లో ఎంతగా అల్లుకుపోయిందో గిలిగింతల మధ్య చెప్పారు జంట రచయితలు. చక్కిలిగింతలో కూడా ఆలోచనలను రేపిన ఈ అల్లరి అక్షరాల కూర్పును మెచ్చుకోకుండా ఉండలేం.

ముఖ్యంగా ముగింపు బాగుంది. పిచ్చివాడని లోకమంతా పరిహసించినా ప్రేమకోసం ఎల్లప్పుడూ సత్యాన్నే పలికిన హరిశ్చంద్రుడు ఒక ప్రాణాన్ని రక్షించడం కోసం అబద్ధం చెబుతాడు. ప్రేమకన్నా త్యాగం గొప్పది అని చెప్పే ఆ చివరి సంఘటనతో అంతవరకూ సాధారణంగా కనిపించిన హరిశ్చంద్ర పాత్ర హిమాలయాలంత ఎత్తుకు ఎదిగిపోతుంది. కారున్న ఆరడుగుల అందగాడికోసం కలలుగన్న లాహిరి అతని వ్యక్తిత్వం ముందు తల వంచి 'నీ వేడి నన్నే గెలిచీ, ఈ గెలుపు మనదని తెలిసీ' అంటూ అతని గుండెలపై వాలిపోతే బాగుండేదేమో! కానీ, నావను నడిపిన సరంగులు ఎంతయినా కార్టునిష్టులు కాబట్టి ఏప్రిల్ ఫస్ట్ ప్రహసనంతో నవ్వుల నావను తీరాన్ని చేర్చారు.

మొత్తానికి 'చతుర' నవ నవలా వేదికలో తప్పక ఉండాల్సిన చతురమైన నవల ఇది.

—సుంకరి రామప్రసాద్, చిట్టవలస



చతుర
సంపుటి: 12 అక్టోబర్: 1989 సంచిక: 9

తొలి యవ్వనపు పొంగులో తెలిసీ తెలియని వయసులో యువతీ యువకులు తమ మధ్య ఉండే సహజమైన ఆకర్షణనే, పరస్పర అభిమానాన్నే 'ప్రేమ'గా భ్రమపడతారా...? అలాంటి స్థితిలో చుట్టూ వున్న వాళ్ళూ, సన్నిహితులూ వారిని కంగారు పెట్టి 'ప్రేమ' 'మోహం' అంటూ గొడవ చేసి ఇక జరుగవలసింది పెళ్ళేనని తీర్మానించేస్తే ఏమవుతుంది?

కాలక్రమంలో ఆ....

# భ్రాంతి

నుండి బయటపడి 'ప్రేమ' అంటే కేవలం ఒకరిపట్ల మరొకరికి ఆకర్షణ ఉండటం మాత్రమే కాదనుకుందామె. జీవితాన్నీ, తమనీ అర్థం చేసుకొని తాము కోరుకునే గమ్యం చేరుకోవడానికి సహజీవనం సాగించగలగాలని అర్థం చేసుకుంది. పరిణిత మనస్కులయిన ఇద్దరు స్త్రీ, పురుషుల మధ్య ఏర్పడే పరస్పర అవగాహనే, స్నేహమే 'ప్రేమ' అని కూడా తెలుసుకొందామె. అలాంటి స్త్రీ తన జీవితాన్ని తాను కోరుకున్న విధంగా తీర్చిదిద్దుకోవడమే కాకుండా 'తన కలల రాకుమారుడు' అని భ్రమపడ్డ వ్యక్తిని ఓ స్నేహితునిగా ఆదరించి, ఏ విధంగా అతని వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుతుందో హృద్యంగా వర్ణించే జయు రచన భ్రాంతి ఈనెల 'చతుర' సమగ్ర నవల.

నీరెండపడి చెరువులో నీళ్ళు తళతళ మెరుస్తున్నాయి. గులాబీరంగులో అరవిచ్చిన తామరలు - చెరువు మధ్యలో నీరు అలలుగా కదిలినప్పుడు హుందాగా కదులుతున్నాయి.

శాలినికి తామరలంటే ప్రాణం. శాలిని అందమైన, నిర్మలమైన కళ్ళకి ఆ 'పువ్వు' అద్భుత దృశ్యం. కొనదేలిన ఆమె చక్కదనాల ముక్కుకి చిన్నగా మత్తెక్కించే గమ్మత్తైన ఆ వాసన ఇష్టం. ఆమె గులాబీరంగు చెక్కిళ్ళకి మృదువుగా సోకే ఆ రేకులస్పర్శ అంటే ప్రేమ. ఆమె చిరులేత గులాబీరంగు పెదవులకి ఆ పువ్వుని సుతారంగా ముద్దుపెట్టుకోవడమంటే అభిమానం.

కానీ చెరువు మధ్యనున్న తామరలని అరచేతుల్లో పొదువుకుని ఆప్యాయంగా గుండెలకి అదుముకోవడం అంత తేలిగ్గా సాధ్యమయ్యే పని కాదు. చాలా లోతైన వూబి వున్న జారుడు చెరువు అది. పశువుల్ని అందులో నీళ్ళు తాగడానికి కూడా అటు తోలరు పాలెగాళ్ళు. శాలిని రోజులాగానే కాలేజీనుంచి ఇంటికి వెళ్ళి రిఫ్రెష్ అయ్యి - పిల్లల పార్కుకు వచ్చింది. పార్కు లైబ్రరీలో కాసేపు పత్రికలు తిరగేసి బయటకు వచ్చింది. పశ్చిమాద్రిన క్రుంకుతున్న సూరీడుని, సాయంసంధ్యలో చెట్ల గుబురుల మీద, గుంపుగాచేరి గోలగోలగా అరుస్తున్న పక్షుల్ని చూస్తూ మెల్లగా నడిచింది. చుట్టూ వున్న పూలమొక్కలని, ఉయ్యాల బల్లమీద వూగుతూ కేరింతల కేకలు వేస్తున్న చిన్నారులని చూస్తూ - వెళ్ళి పార్కు వెనుక వున్న చెరువు దగ్గర నల్లరాయి మీద కూర్చుంది. తామరల అందాల్ని ఆనందంగా ఆస్వాదిస్తోంది.

ఆ నిశ్చల నిశ్శబ్ద వాతావరణాన్ని కదిలిస్తూ - బలంగా దృఢంగా అడుగులు వేసుకుంటూ, ఒక యువకుడు వచ్చి శాలిని ముందు నిల్చున్నాడు. ఆమె ఆశ్చర్యంగా, ప్రశ్నార్థకంగా అతని వంక చూసింది. కోరమీసం చాటునుంచి చిన్నగా తొంగిచూస్తున్న చిరునవ్వుని ఆప్యాయంగా అదిమిపట్టుకున్న పెదాలతో - విల్లువొంపులో గర్వంగా విరుచుకున్న కనుబొమ్మలకింద, అరటి దొప్పల్లాంటి విశాలమైన కనురెప్పల చాటునుంచి సూటిగా చూస్తూ - మాట్లాడే కళ్ళతో అతను - "మీకు తామరలంటే ఇష్టమా" అన్నాడు.

అతని కళ్ళల్లో చిక్కుకున్న తన చూపుల్ని విడిపించుకుంటూ అయోమయంగా చూసింది శాలిని. అతను వెనక్కుదిరిగి, చెరువు గట్టున నిల్చుని షర్టువిప్పాడు. నేలన గుబురుగా పెరిగిన పచ్చికపై ఆ షర్టువడేసి - చెరువులోకి విల్లునుంచి సాగిన బాణంలా దబ్బున దూకాడు.

శాలిని కంగారుగా లేచి నిల్చుని "వద్దు - ప్రమాదం - జాగ్రత్త" అంది కలగాపులగంగా. కాని అతని ఈత శబ్దంలో ఆమె సన్నటి మాటలు కల్సిపోయాయి.

అతను చెరువుమధ్యకు సునాయాసంగా ఈది, ఆరేడు తామరలని తూడులతోసహా పెరికి, మెడచుట్టూ వాటిని చుట్టుకుని ఈదుకుంటూ గట్టుకు వచ్చాడు.

ఆచ్ఛాదనలేని గుండెల మీదుగా కాలిగోటి వరకు నీళ్ళు కారుతుంటే - ఆ తడిపై చెట్ల గుబురు ఆకుల చాటునుంచి తప్పించుకు వచ్చిన నీరెండ కిరణాలు అర్ద్రంగా మెరుస్తున్నాయి. అతని బలమైన మెడని కావలించుకున్న లేతపచ్చటి తూడులతో - అరవిచ్చిన తామరలు వేలాడుతున్నాయి. ఆ స్థితిలో గొప్పగా ఓ అపురూప దృశ్యంలా కనిపించాడు శాలినికి.

అతను తామరలని మెడనుంచి విడదీస్తూ - ఆమెవైపుగా నడుస్తున్నాడు. అతని ప్రతి అడుగుకి అడుగుకి మధ్య సమయం శాలినికి ఒక యుగకాలంలా అన్పిస్తోంది.

అతను ఆమెకి ఓ అడుగుదూరంలో నిలిచి - తన మెడలో నుంచి విడదీసిన తామరలని అందించి కళ్ళతో నవ్వాడు. ఆ నవ్వులో చిక్కుకున్న తన దృష్టిని ఎలా విడదీసుకోవాలో - అతని సమక్షంలో తనెలా ప్రవర్తించాలో అర్థంకాక వెలవెలపోతూ పూలు అందుకుంది శాలిని.

అతను మౌనంగా వెనుదిరిగి షర్టు తీసుకుని భుజం మీదే అలా అలవోకగా వేసుకుని వెళ్ళిపోయాడు.

* * *

అన్ని తామరలు తన చేతుల్లో అలా వది లంగా పట్టుకోగలననీ, తన కల నిజమవు తుందనీ ఏనాడూ వూహించలేదు శాలిని.

కేవలం తామరలంటే తనకిష్టమని అలా ప్రమాదకరమైన చెరువులోకి సర్వసాధార ణంగా దూకి, ఆ పూలు తనకు తెచ్చిఇచ్చి తననుంచి కనీసం 'థాంక్స్' అనే పదం కూడా ఆశించకుండా వెళ్ళిపోయిన అతని గురించి ఆలోచించింది శాలిని.

అతను తనకు అపరిచయస్తుడేగానీ కొత్తవా డుకాదు. ఎవరో మాత్రం తెలీదు. అతడ్ని ఇలా ప్రత్యేకంగా కాక చాలామంది కాలేజీ స్టూ డెంట్స్ మధ్య ఒక నీడలా, ఛాయలా అస్ప ష్టంగా చాలాసార్లు చూసింది. కాలేజీ మాగజై నులో ఫుట్‌బాల్ టీము ఫొటోలో కూడా చూసిన గుర్తు లీలగా- అంతే!

★ ★ ★

నుదుటిమీద పడుతున్న తడి వెంట్రుకల్ని మునివ్రేళ్ళతో, పైకి ఎగదోసుకుంటూ, తొడుక్కు న్న చొక్కాకి గుండీలు పెట్టుకుంటూ, హృద యాన్ని చల్లగా మంచుతెరలా నిర్మలంగా నునువెచ్చగా కప్పినట్టున్న అనుభూతిని సంతో షంగా అనుభవిస్తూ నడుస్తున్నాడు శరత్ హు షారుగా.

మనకి ఇష్టమైన అమ్మాయికి, ఆ అమ్మాయి కి ఇష్టమైన వాటిని ఇస్తే ఇంత ఆనందం కలుగుతుందా అని ఆశ్చెరువొందుతున్నాడు. ఈ అనుభూతి ముందే అనుభవం అయ్యి వుంటే- ఇంత ఆలస్యం చేసివుండేవాడిని కాదు అనుకున్నాడు.

ఆ సమయంలో ప్రపంచమంతా ఆనందపు మత్తుని విదుల్చుకుంటూ తమాషాగా నవ్వుతు న్నట్టు కనిపిస్తోంది శరత్ కళ్ళకి. అరె! ఇవాళ ఇది ఇంత బావుందేవిటి అనుకున్నాడు వింత పడుతూ-

వేకువకి విరిసే నందివర్ధనంలా, విశాల మైన కనురెప్పల్ని విప్పార్చి ఎంత ముగ్ధంగా చూసింది! ఆ అమాయకమైన కళ్ళని, తన పెదాలతో మంచు సుమబాలలపై, బిందువు ల్లా ఒద్దిగ్గా కూర్చున్నంత మృదువుగా— ఒత్తా లన్పించింది.

ఆ ఆలోచన రాగానే- నడుస్తున్న వాడల్లా ఆగిపోయాడు. ఆలోచనే ఇంత అద్భుతంగా మనసులో థ్రిల్‌ని కలిగిస్తుంటే- అది అనుభవ మై అనుభూతిని అందించినపుడు—

★ ★ ★

తామరలని అలాగే అల్లారుముద్దుగా చూ సుకుంటూ, గేటు తీసుకుని లోపలికి వస్తున్న కూతురు శాలినిని చూశాడు రుక్మిణీనాథరావు- వీధరుగు మీద కూర్చొని, నస్యం డబ్బా చేతిలో పట్టుకున్న- హిస్టరీ మాస్టారు- రుక్మిణీనాథ రావు- "ఏం పూలవి?" అనడిగాడు తెలి సికూడా- "తామరలు నాన్నగారు- పార్కు పక్క చెరువులోవి-" అంది శాలిని.

ఆయన సావకాశంగా నస్యం పీల్చి వరసగా మూడుతుమ్ములు తుమ్మి- తడిదగ్గు ఒకటి దగ్గి- "ఎక్కడివి?" అనడిగాడు.

ఆయన ప్రశ్నవెయ్యడమేగాని సాధార ణంగా జవాబు పట్టించుకోడు. పట్టించుకునే మనిషయితే- మళ్ళీ ఈ ప్రశ్న వెయ్యడు. కొంతమంది అంతే- తమ ధోరణిలోతాము సాగిపోతూ వుంటారు. అవతలివాళ్ళ రెస్పాన్సు వాళ్ళకి అవసరంలేదు.

శాలినికి తండ్రి ధోరణి అనుభవమే. అందు కే ఆయన ప్రశ్నకు పెదవి కదపలేదు.

అయినా రుక్మిణీనాథరావుకి కావల్సింది సమాధానం కాదు— తన ప్రశ్నలే!

"ఇపుడు పూలెందుకు? పొద్దున్న అయితే శివార్చనకు పనికి వచ్చేవి" అన్నాడు.

పూలు దేవతార్చనకే కాదు- చూసి ఆనందించడానికీ, ఆస్వాదించడానికీ, ప్రే మించడానికీ పనికివచ్చే వస్తువులు కూడా అని చెబితే- ఆయనకు వెర్రెక్కిపోతుంది. అందుకే శాలిని సమాధానం ఇవ్వకుండా లోపలికి వెళ్ళి పోయింది.

సరస్వతమ్మ- కూతుర్ని చూస్తూనే- "వయసొ చ్చిన ఆడపిల్లవి- పార్కులమ్మటా, వీధుల మ్మటా తిరిగితే- నలుగురూ నాలుగు రకాలుగా అనుకుంటారని చెప్పినా నీకు బుర్రకెక్కిచావ దేమే? వయసొచ్చిందిగాని బుద్ధిజ్ఞానం రాలే దు నీకు" అని విసుక్కుంది.

శాలిని మాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళి పోయింది.

రుక్మిణీనాథరావు, సరస్వతమ్మలకు 'శాలిని' ఒక్కత్తే కూతురు. దాంతో రుక్మిణీనాథరావు ధోరణికి, సరస్వతమ్మ విసుగుకి శాలిని 'టార్గెట్' అయిపోయింది.

★ ★ ★

శాలినిని తాను గత రెండున్నర సంవత్సరాలుగా చూస్తున్నాడు. ప్రస్తుతం తాను ఫైనల్ ఇయర్ బి.ఎ ఎకనామిక్స్. ఆమె ఫైనల్ బి.ఎ ఇంగ్లీషు లిటరేచర్. డిపార్టుమెంట్లు వేరుకావడం వలన తరచుగా కనిపించదు. కానీ ఎంతోమంది అమ్మాయిల మధ్య క్యాజువల్‌గా చూపులకి ఆనడం గుర్తే. తెలివైన అమ్మాయి కాబోల్ను ఎక్కువగా- ఫంక్షన్స్‌లో ఎస్సే రైటింగ్, డిబేట్స్, క్లాస్‌టెస్ట్‌లలో ఫస్ట్‌లంటూ బహుమతులు తీసుకోవడానికి మాత్రం- స్టేజీ మీదకు వస్తుంటుంది. అలా వచ్చి ఇచ్చే బహుమతిని అందుకుని- వెళ్ళిపోతూ ఓ నాలుగు క్షణాలు కనిపించేది... అంతే!

అంతేకానీ ఏనాడూ తనని ఆకట్టుకోలేదు ప్రత్యేకంగా.

రోజూ సాయంత్రం కాలేజీ గ్రౌండ్స్‌లో వాలీబాల్ ఆడి- ఈ టైముకి పార్కుకి వచ్చి రిలాక్స్ అయ్యే అలవాటు తనది. ఆ సమయంలో- ఒంటరిగా, చెరువులోని తామరలని ఆస్వాదిస్తూ- ఆ రాతిబండమీద కావ్యనాయికలా— ప్రకృతి కన్యలా కూర్చునే ఈ అమ్మాయి తనని విపరీతంగా ఆకర్షిస్తోంది.

ఆ అమ్మాయి అనుభవిస్తున్న ఒంటరితనం- తను ఫీల్ అవుతున్న ఒంటరితనం ఒకటే అనిపించేది. దగ్గరగా వెళ్ళి ఆ ఒంటరితనం లోంచి, కలల నుంచి శాలినిని లాగి- తన హృదయానికి హత్తుకుని తన ఒంటరితనం- డిప్రెషన్ తరిమివెయ్యాలనిపించేది.

"కానీ...?" నవ్వొచ్చింది. అది సాధ్యంకాదు.

తన స్నేహితులతో- ముందుహాల్లో చతురప్రపారాయణం సాగిస్తున్న వెంకట్రామయ్య- తడిసిన ఫాంటుతో- లోపలికి వస్తున్న కొడుకుని చూసి- ఎక్కణ్ణించిరా?" అని హూంకరించాడు.

ఆయన ఎప్పుడూ అంతే- స్నేహితులతో సరసంగా మాట్లాడుతూ, జోకులేస్తూ హైలాపచ్చీసుగా వుండే మనిషి- ఇంట్లో కొడుకు దగ్గర ఎప్పుడూ శ్రావ్యంగా సవ్యంగా మాట్లాడడు. హూంకరించడం, కేకలు వెయ్యడం తప్పించి. "అన్నం తిన్నావా?" అనే ప్రశ్న కూడా రంకవేసినట్టుగా అడుగుతాడు.

చిన్నప్పుడు తండ్రి హూంకరింపులకి, రంకెలకి, కేకలకి భయపడినా- పెద్దయ్యాక వాటికి అలవాటుపడి లెక్కచెయ్యడం మానేశాడు శరత్.

అందుకే- కనీసం తండ్రివంకైనా కూడా చూడకుండా లోపలికి వెళుతూ- "చాలాచోట్ల నుంచి-" అన్నాడు.

వెంకట్రామయ్యకి,తనని అలా నిర్లక్ష్యపరిచి వెళ్ళిపోతున్న కొడుకుని చూడగానే- చిర్రెత్తుకొచ్చింది. పేక కిందపడేసి గభాలున లేచి కొడుకు వెనక లోపలికి వెళ్ళాడు.

"ఏరా... నీకు రోజురోజుకీ తలపొగరు ఎక్కువవుతోందేం... ఏం చూసుకుని?"

"అమ్మా... టీ పెట్టు—" అనే కేకవేసి— తండ్రివంక మౌనంగా చూసి టవల్‌తో తల తుడుచుకోవడంలో నిమగ్నమయ్యాడు శరత్. అతను తండ్రితో అనవసరంగా గొడవపడి తన మంచి మూడ్‌ని పాడుచేసుకోదల్చుకోలేదు.

"నిన్నేరా... మాట్లాడవే?" హూంకరించాడు.

"ఎందుకు నాన్నా అనవసరంగా ఆయాసపడతారు. అలా పేకాట మధ్యలో వదిలేసి రావచ్చునా? మీ స్నేహితులు ఏమనుకుంటారు. పేకాడి రండి తర్వాత మాట్లాడుకుందాం" అన్నాడు సౌమ్యంగా.

వెంకట్రామయ్యకు కొడుకు మీద తన కోపం మాటల్లో ఎలా తిప్పికొట్టాలో అర్థంకాక అప్పుడే 'టీ' తీసుకువచ్చిన భార్యమీద పడ్డాడు- "వీడికి టీ ఒకటి తక్కువయింది?" అని టీ కప్పులాక్కుని తను తాగి ఖాళీ కప్పు అక్కడ పడేసి పోయాడు.

శకుంతల మారుమాట్లాడకుండా ఖాళీకప్పు పట్టుకు వెళ్ళి— కొడుక్కి మళ్ళీ టీ తెచ్చిపెట్టింది.

శకుంతల సహజంగా మితభాషి. భర్తకే



కాదు అసలు ఎవరికీ ఎదురుచెప్పడం తెలీని మనిషి. కొడుకు టీ సిప్‌చేస్తుంటే- ఏదో చెప్పాలని— అది ఎలా చెప్పాలో తెలీక తటపటాయిస్తున్న తల్లిని చూసి "ఏమ్మా..." అన్నాడు.

"సాయంత్రాలు ఫరవాలేదుగాని మరీ చీకటిపడ్డాక చెరువుల్లోకి, కాలవకి ఈతకు వెళ్ళకురా ప్రమాదం... జలుబు చేస్తుంది కూడా" అంది మెత్తగా.

శరత్ నవ్వాడు. నవ్వి సౌమ్యంగా— "అలాగేలేమ్మా—" అన్నాడు.

★ ★ ★

"శాలినీ"— అప్పటికి రేఖ వేసిన మూడో కేక అది.

"వస్తున్నా" లోపల గబగబ పుస్తకాలు సర్దుకుని— చెప్పుల్లో పాదాలు దూర్చుతూ— శాలిని సమాధానం ఇచ్చింది.

సరస్వతమ్మ— "ప్రతిరోజూ ఆలస్యమే. తొందరగా తెమిలి, పోదామని వుండదు" అని చిన్నగా విసుక్కుంది.

ఆ విసుగు వినికూడా— చిర్నవ్వుతో— "వస్తానమ్మా" అని సమాధానం చెప్పి బయటపడింది.

శాలినిని చూడగానే— "నేనే ఆలస్యమనుకుంటే నువ్వు మరో పదినిముషాలు ఆలస్యం చేశావుకదే" అంది రేఖ.

"పది నిముషాలు లేటయినంతమాత్రాన కొంప మునిగిపోదులే"

"నీకేం?! క్లాసు మొదలయ్యాక ఎక్స్క్యూజ్ మి అంటూ లెక్చరర్‌ని లెసన్ మధ్యలో డిస్టర్బ్ చేస్తూ క్లాసులోకి వెళ్ళడం అంటే నాకు బావుండదు".

"అబ్బే... నువ్ లాభంలేదు రేఖా! ఫస్టియర్‌లో ఇలా భయపడినా అందం, అర్థం ఉన్నాయి. కానీ ఫైనల్‌కి వచ్చినా ఇంకా భయపడుతున్నావంటే— డామ్‌షేమ్" అంది లైట్‌గా.

ఓసారి వెనక్కి చూసి "వెధవలు, బయల్దేరారు" అంది రేఖ శాలిని మాటలు పట్టించుకోకుండా గొణుగుతున్నట్లు.



అప్పుడు గమనించింది శాలిని. రోజూ కాలేజీకి వెళుతుంటే తమ వెనకపడే— దవడలు లోపలికిపోయి అట్లకాడలా మొహం వుండేవాడు. పీకిపారేసిన మామిడి టెంకలా జుట్టు వేసుకుని కళాకాంతులు లేని పేడిమొకం వాడు ఇంకొకడు— రెండు మొహాలూ ఇకిలించుకుంటూ ఫాలో అవుతున్నాయి.

"వెధవ మొహాలు- కళాకాంతీ ఉండదు. మన వెనకపడేవాళ్ళు కాస్త స్మార్ట్‌గా, నాటీగా, హుందాగానైనా వుండకూడదూ"

"నామొహం... అలాంటివాళ్ళు ఎవరివెనుకా పడరు" అంది రేఖ.

శాలిని నవ్వింది.

"ముత్యాలు రాలాయిరా! ఏరుకుందాం పట్టు-" అట్లకాడ కామెంట్.

"పాతజోకులతో దేకిస్తున్నారు. వెధవలకి రూపం లేకపోతేమానీ- కాస్త సెన్సాఫ్ హ్యూమర్‌వున్నా బావుండేది. వీళ్ళనిచూస్తే జాలేస్తోంది రేఖా- కనీసం అమ్మాయిలని ఆకట్టుకునేలా స్మార్ట్‌గా సైట్‌కొట్టడం కూడా తెలీదు. వీళ్ళిక జీవితంలో దేనికి పనికివస్తారు చెప్పు!"

"తొందరగా కాలేజీ వచ్చేస్తే బావుణ్ను వెధవనంత రేఖా"

"అసలు అమ్మాయి అనబడే పదార్థం కనిపించగానే- కాటికి సిద్ధంగావున్న ముసలాడు కూడా ఎగిరి చక్కాగంతేసి- వీధిలోకివచ్చి వెంటపడుతున్నాడు. అమ్మాయిల వెనకాలపడటం అంటే అంత అషామాషీ అయిపోయింది. దానికికూడా కొన్ని క్వాలిఫికేషన్స్- టెస్టులు పెట్టి- అవిపాస్ అయితే అప్పుడు అమ్మాయిల వెనకపడొచ్చు అనేరూల్ ఒకటి మనగవర్నమెంట్ పాస్‌చేస్తే ఎలా వుంటుంది".

"ఏం క్వాలిఫికేషన్స్, టెస్టులు" కుతూహలంగా అడిగింది రేఖ.

"నిండైన రూపం, అరుదైన పలుకు! తీరైన నడక, సెన్సాఫ్ హ్యూమర్, భావుకత- ఇలా కొన్ని గుణాలు. అవి వున్నాయా లేవా అనే టెస్టులు-"

ఈలోగా వెనుకనుంచి- "ఒసే ఒయ్యారి రంగీ-" అంటూ పాటెత్తుకున్నాడు మామిడి టెంక.

"అబ్బ... పాటల్లో కూడా ఇంత పాలపింత కాయ వచ్చునా?!"

"ఏం చెస్తాం! గతజన్మలో ఎన్నో మహాపాపాలుచేసి వుంటాం. లేకపోతే ఇంత వద్యుగాళ్ళు మన వెనకపడటం ఏమిటి?"

రేఖ మాటలు పూర్తికాకుండానే సరసన ముగ్గురు సైకిళ్ళువచ్చి వాళ్ళపక్కన ఆగాయి.

శాలిని వులిక్కిపడి చూసింది. రేఖ బెదిరిపోయింది.

"అతను! ఒకకాలు పెడల్‌మీద మరోకాలు నేలమీద ఆన్చి- తనతోవచ్చిన స్నేహితులకు సైగచేశాడు. వాళ్ళు సైకిళ్ళని రోడ్డుమధ్యలోనే అలా స్టాండ్వేసి-

అల్లకాడకి, మామిడిపెంకకి అటుఇటు నిల్చుని- వాళ్ళ కాలర్లు పడేసి పట్టుకున్నారు.

ఇంకా అయోమయంగా చూస్తున్న శాలిని, రేఖలని వుద్దేశించి- "మీరెళ్ళండి" అన్నాడు శరత్- అతనిమొహం గంభీరంగావున్నా- మాటమృదువుగా వుంది.

వాళ్ళు కదిలారు. వెనుకనుంచి రెండు పిడిగుద్దులు- ఆ వెంటనే- "అమ్మో" అనే కేకలు విన్పించాయి. కాని వాళ్ళు వెనక్కి తిరిగి చూడలేదు. ఏం చూడవల్సివస్తుందో అని భయం.

★ ★ ★

మరునటిరోజు నుంచి- అల్లకాడ, మామిడిపెంక వాళ్ళకళ్ళకి మరి కనిపించలేదు. వారం రోజులు సాఫీగా గడిచాక-

"ఏయ్‌శాలి! సైకిల్ రాజకుమారుడు వస్తున్నాడు వెనక" అంది రేఖ.

శాలిని నవ్వింది. నవ్వి- "అబ్బే... నా రాజకుమారుడు ఇలా రాడులే!" అని వెనక్కి చూసింది.

శరత్ నెమ్మదిగా- సైకిల్ పెడల్‌చేస్తూ వాళ్ళ వెనుకే వస్తున్నాడు.

తమ మాట[illegible] తనకి విన్పిస్తాయి అని ఆమెకి తెల్సు.

శాలినికి సహజంగా వూహాలు ఎక్కువ. ఆ వూహాలు రెక్కలు విప్పుకున్న రంగురంగు సీతాకోకచిలుకల్లా హృద్యంగా వుంటాయి. ఆ వూహాల్ని వర్ణిస్తుంటే- రంగురంగు పూలమొక్కలమధ్యన తిరుగుతున్న రసరమ్యమైన అనుభూతి. అందుకే రేఖకు శాలిని అంటే ప్రత్యేకమైన ఇష్టం. నీలో కళాకారిణికి కావల్సిన సౌందర్యమయ హృదయం, సహజమైన భావుకత వున్నాయి. నువ్వు ఏ పెయింటర్‌గానో, కవయిత్రిగానో కృషిచేస్తే ఆ రంగాల్లో అద్భుతాలు సృజించగలవు శాలీ! అంటూ వుంటుంది.

అబ్బే... అంతసృజనాత్మకత నాకు లేదులే. నావన్నీ పగటికలలు- అంతే- అని శాలిని రేఖ మాటల్ని నవ్వుతూ తీసిపారేస్తూ వుంటుంది.

"మరి నీ రాజకుమారుడు ఎలావస్తాడు" అని రేఖ రెట్టించి అడగడంతో- శాలిని- "బంగారు రంగు జిన్నువేసిన తెల్లగుర్రంమీద ఠీవిగా కూర్చుని- రత్నాలు పొదిగిన కిరీటంతో చెమ్కీలాజమన్తలతో, పొడుగాటి కరవాలంతో- నిజం రాజకుమారుడిలా వస్తాడు" అంది.

"వచ్చి—?"

"వచ్చి నా ముందు మోకరిల్లి - ఎడమచేయి కరవాలం - పిడిపై రాజసంగా వేసి, కుడిచేత్తో నాకు తామరని ఆరాధనగా అందిస్తూ - నా కనుచివరల చూపుకై నిరీక్షిస్తాడు - నా పెదవులపై పారాడే చిర్నవ్వుకై పులకరిస్తాడు. నా పెదవి దాటి వచ్చే చిన్నమాటకి తన్మయుడవుతాడు"

రేఖ నవ్వేస్తూ— "బావుంది" అంది.

లలగా, అస్పష్టంగా వినిపించిన ఈ మాటలకి శరత్ మోముపై చిరుదరహాస రేఖ అలవోకగా విరిసింది. చిరుగాలికి అలవోకగా కదిలే పూలగుత్తిలా!

★ ★ ★

ఆదివారం సాయంత్రం— నాలుగవుతోంది.

రేఖ, శాలిని బయలుదేరారు.

"వంట కాలువవైపు వెళ్తున్నారుటే! జాగ్రత్త- పురుగూపుట్రా వుంటాయి—" చెప్పింది సరస్వతమ్మ.

"అమ్మా! ఇలా బయల్దేరిన ప్రతిసారీ నువ్విలా అంటూనే వుంటావు. బోర్ కొట్టదా మ్మా— ప్రతిసారీ అదేమాట అనడానికి—"

''బావుంది తల్లీ - అదేం చోద్యమే. చీకటిపడకుండా ఇళ్ళకి తిరిగిరండి—''

పొలాలు దాటి - సుళ్ళు తిరుగుతున్న పంటకాలువ దగ్గరకు వచ్చారు.

పంట కాలువ దాటడానికి తాటిచెక్కలు రెండు వున్నాయి.

''కాలవ దాటితే - అటువైపు కంది చేను. చక్కగా లేలేత కందికాయలు కోసుకు తినొచ్చు- పోదాంపద—'' అంది శాలిని.

''హమ్మో! తాటిమట్టెలు మీద నడవడం నాకు చాతకాదు. నావల్ల కాదు''

''చేతకాదు అంటే ఎలా— నువ్ పడిపోకుండా నేను పట్టుకుంటాను పద—''

''అప్పుడు బ్యాలెన్స్ తప్పి ఇద్దరం నీళ్లల్లో పడతాం''

''పడితే పడ్డాం- చచ్చిపోంలే! నాకు ఈత వచ్చు. నిన్ను కూడా ఒడ్డుకు చేర్చగలను - పద''

''హమ్మో! నాకు భయం''

''మళ్ళీ అదేమాట''

''నువ్వెన్ని చెప్పు. నేను ఛస్తే పట్టీమీద నడవను. నడవనుకాక నడవను''.

''కొన్ని విషయాల్లో నువ్ బొత్తిగా మూర్ఖత్వం చూపిస్తావు రేఖా—'' విసుక్కుంటూ అంది.

''ఏమయినా అనుకో''

''ఇంకెందుకు ఇక్కడ? అనవసరంగా టైముపేస్టు చేసుకోవడం తప్పు. పద. మామిడి తోపులోనైనా కాసేపు కూర్చుందాం'' అంది శాలిని.

ఇద్దరూ వెనుదిరిగారు.

వాతావరణం ప్రశాంతంగా వుంది. ఆకాశంలో పసుపు, ఎరుపు, కుంకుమలు పేరజిమ్మినట్టుగా వర్ణరంజితంగా ఉంది.

రకరకాల పక్షుల కువకువలు ఆ ప్రశాంతతకి శ్రావ్యతని తెచ్చిపెట్టాయి.

చల్లటి పైరుగాలి.

శాలిని చెప్పులు తీసి చేత్తో పట్టుకుని చల్లటి నేలమీద పచ్చని గరిక మీద అచ్ఛాదన లేని



నగ్న పాదాలతో నడుస్తోంది.

''అదేవిటే చెప్పులు తీసేశావు, ముళ్ళు అవీ గుచ్చుకుంటాయి''

''గుచ్చుకోనీ! చల్లటి నేలతల్లిని స్పృశిస్తూ నడవడం ఎంత బావుంటుందో తెల్సా. వెధవ చెప్పులు అడ్డం!''

''నీవన్నీ విచిత్రమైన కోరికలు—''

''కాదు, అనుభూతులు—''

సూర్యుడు పెద్ద ఆరంజి కలర్ డిస్క్‌లా వున్నాడు.

ఆ నారింజ రంగునుంచి జన్మించినట్టుగా ఒక తెల్ల గుర్రం— దానిమీద యువకుడు లీలగా—

వాళ్ళిద్దరూ ఆశ్చర్యంగా అలా నిలబడిపోయి చూస్తుండగానే—

ఆ ఆకారం దగ్గరగా వస్తోంది. అప్పటికి తెల్సింది. శరత్— సాక్షాత్తూ శరత్తే— గుర్రం మీద స్వారీ చేస్తూ వస్తున్నాడు. శాలినికి మతిపోయింది. తనేదో హాస్యానికి అన్నమాటలు అతనిలా వాస్తవం చేస్తాడని ఆమె వూహించలేకపోయింది.

నిజంగానే తన కలలరాకుమారుడు వాస్తవ ప్రపంచంలోనే తన ముందుకి— తను కోరుకున్నట్టుగా— కేవలం తనకోసం వస్తున్నాడు.

హృదయం— అదోరకమైన కొత్త అనుభవంతో— మెత్తబడిన అనుభూతి.

శరత్— వాళ్ళ ముందుకు రాగానే గుర్రానికి కళ్ళెం వేశాడు.

రికాబుల్లోంచి కాళ్ళు తీసి కిందికి దూకాడు.

ఆమె ముందు— ఆమె వర్ణించిన విధంగానే మోకరిల్లి తామరని అందించాడు.

శాలిని తామరని అందుకుంటూ ఆయోమయంగా— శరత్ మొహం వంక ఏదో వెదుకుతున్నట్టుగా చూసింది.

శరత్ కళ్ళు చిర్నవ్వు నవ్వాయి. ఆమె పెదాలు ఆ చిర్నవ్వుని అదిమిపట్టుకున్నాయి. చెంపలు ఆ చిర్నవ్వుని కావలించుకుని ఎర్రబడ్డాయి. విశాలమైన నుదురు ఆ చిర్నవ్వుని దాచుకుని ప్రకాశించింది.

మారుమాట్లాడకుండా వెనుదిరిగి గుర్రం ఎక్కి స్వారీలో ఎంతో ప్రాక్టీసు వున్నవాడిలా—

గుర్రాన్ని దిగి తయారయ్యాడు.

ఈ 'అబ్సరిడిటీ'ని అర్థం చేసుకోలేక తికమకపడుతోంది శాలిని. తాను సరదాకి ఏదో వర్ణించింది కానీ ఆ వర్ణనకు తగ్గట్టు అబ్సర్డ్‌గా తయారయి వచ్చేస్తే ఏవిటి దానర్థం?! కిరీటం, కత్తి కఠార్లు లేవు. అంతవరకూ నయం.

ఆ సాయంత్రం శాలిని, రేఖ కాలేజీ నుంచి కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నారు. సైకిల్ బెల్ విన్పించి వెనక్కి తిరిగిచూశారు.

స్పోర్ట్స్ సైకిల్‌మీద చిర్నవ్వుతో శరత్.

వెంటనే రేఖ అదోలా సిగ్గుపడి "ఏమే... నీ రాజకుమారుడు" గునగునగా శాలినితో అంది.

శాలిని కొంచెం ఇబ్బందిగా ఫీలయ్యి మొహంలో ఎటువంటి భావాలు చూపించాలో తెలీక మొహమాటంగా నవ్వింది.

శరత్— శాలిని మొహంలోకి గమనింపుగా చూస్తూ— "నిన్న రాలేదు. ఈరోజైనా తామరలని అందుకోవడానికి వస్తారా? పాపం- అవి మీకోసం బెంగపెట్టుకున్నాయ్" అన్నాడు.

శాలిని గ్రహించింది- ఇన్‌డైరెక్టుగా తనని అక్కడ కలుసుకోమంటున్నాడని. మరేం మాట్లాకుండా ముందుకు అడుగేసింది. కానీ ఆమె మొహంలో చిన్న కదిలీ కదలని చిర్నవ్వు చూసి ఆమె వస్తుందని శరత్‌కి అర్థమయి సన్నగా ఈలపాట పాడుకుంటూ వెళ్ళిపోయాడు.

రేఖ కుతూహలంగా అంది— "ఏమే- నాకు తెలీకుండా లవ్‌స్పాట్ ఎక్కడ ఎరేంజ్ చేసుకున్నారే? పైగా కోడ్ భాషలో మాట్లాడుకుంటున్నారే— తామరలు, ఎదురుచూపులు అని—"

శాలిని చిన్నగా సిగ్గుపడింది. ఎందుకో అలా సిగ్గుపడినందుకు తనమీద తనకే నిరసన కలిగింది.

"నీమొహం!" అంది.

"నాతో చెప్పకూడదా? పోన్లేమ్మా" నిష్ఠూరం నటిస్తూ అంది రేఖ.

శాలిని కొంచెం సీరియస్‌గా— "నేనొకటి అడగనా—?" అంది.

మహాభాగ్యం... అడుగు. ఇక ముందు ముందు ఎలాగూ అడగవు"

"నేను, శరత్ - ఎన్నిసార్లు కల్సుకున్నామని నీ ఉద్దేశ్యం—"

రేఖ ఆశ్చర్యంగా చూసి—

"అదేవిటి! అలా అడుగుతున్నావు?"

"అబ్బే! లేదు... నీ ఉద్దేశ్యం ప్రకారం ఎన్నిసార్లు అని—"

"ఏమో ఎలా చెప్పగలను—"

"సరిగ్గా చెప్పనవసరంలేదు. సుమారుగా చెప్పు చూద్దాం—"

కాసేపు ఆలోచించి— "ఇరవై, ముప్పైసార్లు—" అంది.

శాలిని అదోలా నవ్వి - "అక్కడే పొరపాటు పడ్డావు—" అంది.

రేఖ ఆశ్చర్యంగా - "అంటే!?" అంది.

మరోసారి నవ్వి - "ఫస్ట్‌టైమ్ చెరువు దగ్గర - నాకు తామరలు కోసిఇచ్చాడు. సెకండ్‌టైమ్ ఆ వెధవల్ని తన్నినప్పుడు, థర్డ్‌టైమ్ ఆ రాజకుమారుడి వేషంలో - ఇది నాలుగో సారి—"

రేఖ మరింత ఆశ్చర్యపోతూ— "నిజంగా—" అంది.

"అంటే! నేను నీతో అబద్ధం ఆడుతున్నాను అనా నీ వుద్దేశ్యం?!"

"ఛ... అదికాదు"

"నీ అనుమానం నాకు అర్థం అయ్యింది - కానీ నిజం అదే—"

"నిజంగా - ఇంకా ఆశ్చర్యంగా వుంది—"

"ఆ తర్వాత రెండురోజులుగా నేను సాయంత్రం పార్కువైపు వెళ్ళలేదు. బహుశా నాకోసం ఎదురుచూసి వుండొచ్చు- అంతే!"

"రియల్లీ యూ ఆర్ లక్కీ. అంత హేండ్సమ్గై నీ వెనకాల పడుతున్నాడూ అంటే—"

"నీ మొహంలే!"

ఈలోగా శాలిని ఇల్లు వచ్చింది. శాలిని లోపలికి వెళ్ళబోతుంటే— "ఇంతకీ వెళ్తున్నావా? లేదా?" అంది రేఖ కుతూహలంగా.

"మనకి మంత్లీ టెస్టులు జరుగుతున్నాయి అని మర్చిపోయినట్టున్నావు. చదువుకోవాలి"





[illegible]

"చూడనీ! నేనేం వస్తానని చెప్పలేదుగా!"

"కానీ...!"

"సర్లే... వస్తా. రేపు తొందరగా వెళ్లిపోదాం కాలేజీకి. ముందు వచ్చేయి—" అంది గేటు తీసుకుని లోపలికి వెళ్ళిపోతూ.

★ ★ ★

శరత్ హుషారుగా ఇంటికి వెళ్లాడు. గబగబ స్నానం చేసి తనకు నచ్చిన గ్రీన్‌షర్ట్, ఎల్లో ప్యాంట్ వేసుకుని - అందంగా క్రాఫ్ దువ్వుకుని ఆరున్నరకల్లా బయల్దేరాడు! అతని వుద్దేశ్యం అప్పటికే శాలిని అక్కడికి వచ్చేసి తన కోసం ఎదురుచూస్తూ వుంటుందని.

వెళ్ళేసరికి అక్కడ ప్రశాంతమైన వాతావరణం. చల్లటి గాలి. ఆ గాలికి చిన్నగా కదులుతున్న చెట్లు. ఎటువంటి కదలికా లేకుండా చెరువు - దాని నిండుగా తామరలు.

వెళ్ళి ఎప్పుడూ శాలిని కూర్చునే బండమీద కూర్చున్నాడు- చెరువులోకి చూస్తూ. అలా ఒక పదినిముషాలు గడిచేసరికి అతనికో సందేహం వచ్చింది. బహుశా వచ్చి, తను లేడని వెళ్ళిపోయిందేమో? ఆ ఆలోచన రాగానే గబుక్కున లేచి నిల్చుని కాసేపు ఆలోచించాడు.

మళ్ళీ నిరీక్షణ. ఎప్పుడూ ఇలా గుండెల్ని అరచేతుల్లో పెట్టుకుని ఎవరికోసం ఎదురు చూడలేదేమో - ఈ అనుభవం అతనికి ఎగ్జయిటింగ్‌గా వుంది. కాసేపటికి సన్నటి విసుగు మొదలయింది. సిగరెట్ తీసి వెలిగించాడు. రెండు దమ్ములు లాగాక గబుక్కున అనిపించింది- ఒకవేళ శాలినికి సిగరెట్స్ అంటే ఇష్టంవుండదేమో. ఇష్టం లేకపోతే ఈ వాసనకి చిరాకుపడుతుందేమో - ఆ ఆలోచన రాగానే సిగరెట్ విసిరేసి - వెళ్ళి చెరువులో నీటితో నోరుశుభ్రంచేసుకున్నాడు.

మళ్ళీ మరో పదిహేను నిమిషాల నిరీక్షణ.

ఇక కూర్చోలేక, లేచి అటు ఇటు తిరగటం మొదలెట్టాడు. అరగంట గడిచింది. నిశ్శబ్దాన్ని కావలించుకుంటూ సంధ్యాచీకటి దట్టమవుతోంది.

మరో అరగంట.

ఇకరాదు అనుకున్నాడు. అలా అనుకోగానే హృదయాన్ని ఎవరో నొక్కిపెడుతున్నంత [illegible] విప్పి - బండమీద పడేసి - చెరువులోకి దూకాడు. తాను తామరలు అందిస్తున్నప్పుడు శాలిని మొహంలో కదలాడిన ఆశ్చర్యంతో, అభిమానంతో కూడుకున్న చిర్నవ్వు గుర్తుకు వచ్చి - హృదయం లయతప్పినట్టయింది. మళ్ళీ హృదయం ఆమెపట్ల ఏదో ఆప్యాయత కూడుకున్న అనుభూతితో పూర్తిగా నిండిపోయింది. తెలీని హుషారు వచ్చింది. గబగబ ఒక పెద్దతామర కోసి చెరువు బయటకు వచ్చాడు. తామరకోశాడు గానీ దాన్ని ఏం చేసుకోవాలో అర్థం కాలేదు.

చొక్కాతీసుకున్నాడు. తడిచిన పేంటుతోనే అలా కాసేపు కూర్చుని లేచి అన్యమనస్కంగా బయల్దేరాడు. రోడ్డు మీదకు రాగానే తెల్సిన ఫ్రెండ్ కన్పించాడు. "తామరబావుందిరా- ఎవరికి?" అన్నాడు.

ఏం చెప్పాలో తెలీక దాన్ని మరోసారి చూసుకున్నాడు శరత్.

"నువ్వేం చేసుకుంటావురాదాన్ని" అని రెట్టించాడు.

విసుగొచ్చి "తల్లోపెట్టుకుంటాను... చాలా?" అన్నాడు.

అతను అది హాస్యంగా తీసుకుని - "మగాళ్ళు పువ్వులు తలలో పెట్టుకోరురా -" అన్నాడు.

"పోనీ చెవులో పెట్టుకుంటాను. నీకెందుకు - " అన్నాడు ఇరిటేట్ అయిపోతూ -

శరత్ వంక ఆశ్చర్యంగా చూసి - "సర్లే! అవునూ... ఫుట్‌బాల్ గేమ్‌కి ఈ మధ్యన నువ్వు రావడంలేదేం?" అన్నాడు.

శరత్ మరేం మాట్లాడలేదు. అతను శరత్ మూడ్ బావుండలేదని గ్రహించి— "సర్లే... రేపు కలుద్దాం!" అని వెళ్ళిపోయాడు.

అలానడుచుకుంటూ శాలిని ఇంటి సందులోకి వచ్చాడు.

కాసేపు ఆమె ఇంటికి కొంచెం దూరంలో నిలబడి ఆలోచించాడు. తర్వాత ఒక నిర్ణయానికి వచ్చి- ఆ తామరను వాళ్ళింటిగేటుకు తగిలించి ఉన్న పోస్టుబాక్సు తలుపు తీసి

అందులో తోసివచ్చాడు.

కానీ, లోపలంతా ఏదో కోల్పోయినట్టు, పోగొట్టుకున్నట్టు బాధ. నిజానికి ఆ టైమ్‌కి తను- తన బృందంతో- గడియారస్థంభం దగ్గరచేరి- కిళ్ళీకొట్టు దగ్గర కూర్చుని మిరపకాయబజ్జీలు నములుతూ సోడాలు కొడుతూ, కబుర్లు చెప్పుకునే టైమ్. ఆ తర్వాత అటునుంచి సెకండ్ షోకి చెక్కేసి రాత్రి ఒంటిగంటకి ఇల్లు చేరుకునేవాడు. అలాంటిది ఇప్పుడికే ఇంటికి వచ్చిన శరత్‌ని చూసి శకుంతల ఆశ్చర్యపోయింది.

''భోంచేస్తావా? వడ్డించేయనా? నీకిష్టమని వంకాయ వేపుడు చేశాను—'' అంది.

'ఒద్దు' అని లోపలికి వెళ్ళి మడత మంచం పెరట్లో మామిడిచెట్టు కింద వేసుకుని దిండు కూడా లేకుండా అలా వెల్లకిలా పడుకుని చంద్రుణ్ణి చూస్తూ ఉండిపోయాడు.

శకుంతల కొడుకు ధోరణికి ఆశ్చర్యపోయింది! కాసేపు అలా చూసి లోపలికి వెళ్ళిపోయింది.

ఈలోగా వెంకట్రామయ్య వచ్చాడు. నూతిలో నీళ్ళు తోడుకుని ఒంటిమీద కుమ్మరించుకుంటూ— ''ఏరా... ఊళ్ళో చక్కబెట్టాల్సిన రాచకార్యాలు అప్పుడే అయిపోయాయా?'' అన్నాడు వ్యంగ్యంగా.

మామూలుగా అయితే వెంటనే రివర్స్‌లో ''నీ దయవల్ల'' అనే సమాధానం ఘాటుగా వచ్చేది. కానీ ఈసారి ఎందుకో అటునుంచి మౌనమే జవాబయింది.

వెంకట్రామయ్య ఒకసారి కొడుకు పడుకున్నతీరు గమనించి— స్నానం పూర్తిచేసి లోపలికి వచ్చాడు.

—''వాడికి ఒంట్లో బావుండలేదా?'' అన్నాడు కొంచెం నెమ్మదిగా.

''ఏమో... భోజనం కూడా చెయ్యనన్నాడు—'' అంది శకుంతల కూడా నెమ్మదిగానే.

''ఏవిటో కనుక్కో- జ్వరం అదీ అయితే ఒక టాబ్లెట్ మింగి చావమను. అంతేగానీ అలా మాటామంతీ లేకుండా పడివుంటే ఎలా?'' అని గట్టిగా విసుక్కుని లోపలికి వెళ్ళిపోయాడు.

శకుంతల కొడుకు దగ్గరకు వెళ్ళి నుదుటిమీద చెయ్యివేసింది. అప్పుడే గమనించింది. తడిపెంటుతో పడుకున్నాడని- మళ్ళీ చెరువులో ఈతకొట్టాడని ఆమె గ్రహించింది- శరత్ తల్లిస్పర్శకి కళ్ళు తెరిచి- నుదుటిమీద ఉన్న తల్లి చెయ్యి పక్కకు నెట్టాడు.

''ఒంట్లో బావుండలేదా చిన్నా—'' అంది శకుంతల ఆత్రుతగా. కొడుకుని 'చిన్నా' 'కన్నా' అని ముద్దుగా పిలుచుకుంటూ ఉంటుంది ఆవిడ.

''అబ్బా... ఊరికే విసిగించకు- వెళ్ళి నీపని చూసుకో'' అని మళ్ళీ కళ్ళుమూసుకున్నాడు.

శకుంతల ఒక క్షణం కొడుకువైపు చూసి లోపలకు వెళ్ళిపోయింది.



మరునాటి రోజు సాయంత్రం కాలేజీనుంచి రాగానే హాల్లో టీపాయ్‌మీద ఎండిపోయిన తామరపువ్వు కన్పించింది శాలినికి.

ఆశ్చర్యపడి, ఆశ్చర్యాన్ని సర్దుకుని- ''ఎక్కడిది?'' అనడిగింది తల్లిని.

సరస్వతమ్మ విసుక్కుంటూ- ''ఎవడో పోకిరీ వెధవ మన పోస్టుబాక్సులో పడేశాడు దీన్ని-'' అంది.

వెంటనే శాలినికి అర్థం అయ్యింది అది ఎవరిపనో. ఎందుకో హృదయంలో ఒక మూల గిల్టీ ఫీలింగ్. అయ్యో! పాపం తను వస్తుందని గంటల తరబడి ఎదురుచూసి వుంటాడేమో అని రెండోరోజు ప్రోజ్ క్రిటిసిజమ్స్ పెస్టు వున్నా - స్నానం చేసి, ఫ్రెష్ అయి బయల్దేరింది.

"సరిగ్గా మగరాయుడిలా ఆరు గంటలకి బయటకు వెళ్తోంది. ఈవిడగారు వెలగబెట్టాల్సిన కార్యాలు మరి ఏవి ఉంటాయో" అని సరస్వతమ్మ చిరాకు పడింది.

"లైబ్రరీకి వెళ్ళిరావాలి"

"అది పగలు వెళ్ళొచ్చుగా- అర్ధరాత్రి వావకపోతే-"

"పగలంతా కాలేజీతో సరిపోతుంది. అయినా అందరికీ కన్పించే సాయంత్రం నీకు అర్ధరాత్రిలా ఎలా కన్పిస్తుందో నాకు అర్ధంకాదు"

"ఏదన్నా మంచిమాట చెప్పబోతే - తిరగబడి మాటలు మీరడం నేర్చుకున్నావ్. ఆడపిల్లకి అంత బారుమాటలు అనర్ధంఅని గుర్తుపెట్టుకో. వూరికే చదువుకుంటే చాలదు చదువులు" చెప్పి మొహం మిటమిటలాడించుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది. శాలినికి అర్ధంకాలేదు "ఎందుకు తల్లి అంత అసందర్భంగా మాట్లాడుతోంది. అందరు తల్లులూ ఇంతేనా? లేక తన అమ్మేనా" అనుకుంటూ గేటుదాటి బయటకు వచ్చింది.

తండ్రి ఎదురుపడ్డాడు. "ఎక్కడికి?"

"పార్కు లైబ్రరీకి నాన్నా"

"అమ్మతో చెప్పావా?"

"చెప్పా-"

"తొందరగా వచ్చేయి. ఈలోగా దాని గొణుగుడుకి చెవులు చిరాకెత్తిపోతాయి. అయినా ఎందుకమ్మా ఇప్పుడు పార్కుకి-"

"పార్కుకి కాదండి... పార్కులో ఉన్న లైబ్రరీకి. రిఫరెన్స్ పుస్తకం కోసం వెళ్తున్నా"

"అయినా సరే-" అని అయిష్టంగా లోపలికి వెళ్ళాడు.

హమ్మయ్య అనుకుని బయల్దేరింది. అలా వరసగా అబద్ధాలాడినందుకు ఎందుకో మనసులో వెలితిగా అనిపించింది. అయినా తాను నిజం చెప్పినప్పుడు కూడా తనపట్ల వాళ్ళ వైఖరి ఇలాగే వుండేది. బహుశా తను ఒక్కగానొక్క కూతురు అవ్వటంవలన - వాళ్ళ ప్రేమ మాట దేవుడెరుగు ఇలా తిట్లు, చీవాట్లు మాత్రం హోల్‌గా తనకే దక్కుతున్నాయి అనుకుంటూ నడుస్తోంది.

పార్కుదాటి వెనుకనున్న చెరువు దగ్గరకు వెళ్ళింది. సాధారణంగా అటువైపు ఎవరూరారు. అందుకే ప్రశాంతంగా, ఒంటరిగా వుంటుంది అక్కడ వాతావరణం.

ఆమె వెళ్ళేసరికి - శరత్ - బండమీద కూర్చుని దీర్ఘంగా తామరలని చూస్తున్నాడు. ఆమె వచ్చిన సవ్వడి వినగ్గానే గబుక్కున తలతిప్పి శాలిని కనిపించగానే ముసిరిగొన్న ఆనందంతో లేచి - దగ్గరగా వచ్చాడు. అతని మొహంలో ఎందుకంత ఆనందమో శాలినికి అర్ధంకాలేదు. దగ్గరగా వెళ్ళాడుగానీ అతనికి ఆమెతో ఏం మాట్లాడాలో అర్ధంకాలేదు.

ఒక సెకను నిశ్శబ్దం తరువాత- "రండి కూర్చుందాం-" అన్నాడు. ఇద్దరూ ఎదురెదురు బండలమీద కూర్చున్నారు.

నిన్నెందుకు రాలేదు అని అడుగుతాడు అనుకుంది శాలిని. కానీ అతను అడగలేదు. ఎందుకో సడన్‌గా ఆమె మొహంలోకి చూసి - ఆమె చూపులు - తన చూపుల్ని కల్సుకోగానే - ఏదో తెల్సినట్టుగా నవ్వాడు. శాలిని మొహంలో కూడా చిన్న చిర్నవ్వు.

"ఈరోజు కూడా మీరు వస్తారనుకోలేదు"

"మరెందుకు ఇక్కడ కూర్చున్నారు-"

"లేదు... కానీ ఆశ-"

ఆమె నవ్వింది. నవ్వి- "రావాలనుకోలేదు కానీ మీ తామర చూసి-"

"చూశారా" ఎగ్జైటింగ్‌గా అడిగాడు.

"ఊఁ..."

కాసేపు నిశ్శబ్దం.

"మాకు క్లాసు టెస్టులు జరుగుతున్నాయి. అందుకు రాలేదు"

"లేకపోతే వచ్చేవారా?"

"ఏమో-"

"క్లాసు టెస్టులకు బాగా చదువుతారా?"

"అవును. వీక్లీ టెస్టుకి కూడా సిన్సియర్‌గా చదువుతా. ఏం?"

"నేను ఫైనల్సప్పుడే పట్టించుకోను-" అని నవ్వాడు.





"నాకు మీకు వున్నంత ధీమాలేదు"

తర్వాత కాసేపు నిశ్శబ్దం.

ఇద్దరికీ ఏం మాట్లాడాలో తెలీడంలేదు.

"వెడతాను" అని లేచింది.

శరత్ కంగారుగా "అప్పుడేనా?-" అన్నాడు.

"చదువుకోవాలి-"

"కానీ-"

"మీరు ఎదురుచూస్తుంటారని వచ్చాను"

మనసులో సంతోషం- తను ఎదురు చూస్తుంటానని పట్టించుకుని వచ్చినందుకు.

"కొంచెంసేపు"

"ఇప్పటికే ఆలస్యం అయింది. అమ్మా నాన్నా ఎదురుచూస్తుంటారు"

"ఉండండి... ఒక్క నిముషం" అని చెరువు వైపు వెళ్లబోయాడు.

"వద్దు-" అంది.

"ఏం-"

"మరో రోజు"

"ఎప్పుడు?"

"టెస్టులు పూర్తయ్యాక-"

సరే అన్నట్టుగా నవ్వాడు. శాలిని వస్తాను అన్నట్టుగా తలవూపి బయల్దేరింది.

ఆమె వెళ్ళిపోయింది. అతను అక్కడే నిల్చుండిపోయాడు. శరత్‌కి ఏమిటో అసంతృప్తిగా వుంది. ఇంతకీ అసలు తామిద్దరూ ఏం మాట్లాడుకున్నారు అని ఆలోచించుకున్నాడు. జరిగిందంతా మళ్ళీ మనసులో 'రీప్లే'వేసుకుని చూసుకుని అనుభవించాడు. ఆఫ్టరాల్ ఈ పొడిమాటలు మాట్లాడటానికా తను నిన్నంతా ఎదురుచూసింది, ఈరోజు ఇక్కడికి వచ్చింది. పోనీ! ఇవి కాకపోతే ఏం మాట్లాడుకోవాలని తన వుద్దేశం అని తరచి ఆలోచించసాగాడు- అదీ తెలియలేదు.

ఒక సెకను అసంతృప్తిగా, మరో సెకను తృప్తిగా, ఒక సెకను హృదయం పిండేసే బాధతో, మరో సెకను హృదయమంతా నిండిన ఆనందంతో, ఒక సెకను దుర్భర వేదనతో, మరో సెకను ఎగిరి గంతులు వెయ్యాలనే సంతోషంతో- ఇలా ప్రతీసెకను అనుభూతినిస్తున్న అనుభూతుల స్థాయిలు మారుతుంటే అర్థంకాక, అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ ఇంటివైపు నడిచాడు.

కానీ అతను ఒక సంగతి గమనించలేదు తామిద్దర్నీ మరో ఇద్దరు రహస్యంగా గమనించారని ...

★ ★ ★

ఆమర్నాడు కాలేజీ గోడల నిండా

'శాలినీ శరత్‌ల ప్రేమకలాపాలు వాత్సాయనుడి కామసూత్రాలకే కొంగ్రొత్త అర్థాలు' అనే రాతలు ప్రత్యక్షమయ్యాయి.

సాధారణంగా కాలేజీకి స్టూడెంట్సు తొమ్మిది అవుతుండగా రావడం మొదలవుతుంది. అప్పటివరకు శ్మశాన నిశ్శబ్దంలో మునిగి ఉన్న కాలేజీ ఆవరణలు, గదులు-వీళ్ళకేకలతో, కేరింతలతో, నవ్వులతో తుళ్ళులతో ప్రతిధ్వనిస్తూ ఉంటాయి.

ఆరోజు మాత్రం-వచ్చిన స్టూడెంట్స్ వచ్చినట్టుగా-కాలేజీ గోడల ముందు నిల్చుండిపోయారు. ఆ రాతల్ని వింతపడి చదువుతూ వక్కనున్నవాళ్ళతో కామెంట్స్ చేస్తూ-చర్చిస్తున్నారు. అక్కడ చేరిన అందరికీ శాలినీ శరత్‌లు తెలీదు. కొంతమందికి శాలిని తెలుసు- మరి కొంతమందికి శరత్ తెలుసు. ఎవరికివాళ్ళు-వాళ్ళకి తెల్సిన సంగతులకి-మరిన్ని కల్పనలు జోడించి వక్కనున్న వాళ్ళకి వర్ణించి వర్ణించి చెబుతున్నారు.

శరత్ వస్తూనే వాటిని చూశాడు. శరత్ వక్కనున్న గోపాల్ గునగునగా—"ఎవర్రా ఈ శాలిని అనే కాలేజీ కన్యామాకు తెలియని నీ కథానాయిక-" అన్నాడు.

శరత్ గోపాల్ వంక కఠినంగా చూశాడు. అతని చూపుని బట్టి ఆ విషయంపై జోకులు వెయ్యడం మంచిదికాదని మిగతా స్నేహితులు కూడా గుర్తించారు.

అప్పటికే కొంతమంది స్టూడెంట్సు ఇటు తిరిగి—"అదిగోనోయి హీరో వచ్చాడు. ఇక హీరోయిన్ రావడమే తరువాయి. ఆపైన డ్యూయెట్-" కామెంట్. వెనువెంటనే గందరగోళంగా నవ్వులు-కబుర్లు.

శరత్ గిరుక్కున వెనుదిరిగి కాలేజీ ఎదురుగా ఉన్న కాకా హొటల్‌కు వెళ్లి తన స్నేహితులు ముగ్గురితో కూర్చున్నాడు. అక్కడ్నుంచి కాలేజీ ముందు గుంపులుగా చేరిన స్టూడెంట్సు-వాళ్ళ చర్చలు కన్పిస్తున్నాయి.

సుమంత్ సీరియస్‌గా—''ఏవిట్రా ఇది. ఎవరు చేసివుంటారు ఇలా-''అన్నాడు.

అప్పటి వరకు మౌనంగా ఆలోచిస్తున్న శరత్-'సూరీ' అని కేకవేశాడు. ఖంగుమన్న ఆ కంచుకేకకి ఆ హొటల్ సర్వర్ పధ్నాలుగేళ్ళ సూరి పరిగెత్తుకు వచ్చాడు.

''నువ్వు రోజూ రాత్రి కూడా ఇక్కడే పడుకుంటావు కదూ సూరీ—''

''అవున్సార్''

''నిన్నరాత్రి కాలేజీ గోడల ముందు ఏమైనా అలికిడి విన్పించిందా-''

''అవున్సార్...రాత్రి రెండో ఆట సినిమా వదిలాక—మా 'అంజి' 'ఓ' అంటూ ఒక రకంగా మొరిగింది సార్. లేచి చూస్తే-కాలేజీ గోడముందు చీకటిలో టార్చ్ వేసి ఒకడు ఏదో రాస్తున్నాడు. రెండోవాడు ట్యూబ్‌లైట్ కింద రంగు కలుపుతున్నాడు సార్. ఎలక్షన్స్ వస్తున్నాయోమో అనుకున్నా సార్''

శరత్ జేబులోంచి పదినోటు తీసి వాడి చేతిలో పెట్టి—''వాళ్ళెవరో చూస్తే గుర్తుపట్టగలవా?''

''ట్యూబ్‌లైటు కింద నిల్చున్నవాడిని మాత్రం చెప్పగల్ను సార్-''

''సరే... బయట కూర్చుని పోతున్న వాళ్ళని, వస్తున్నవాళ్ళని చూస్తుండు. వాళ్ళు తప్పకుండా ఆ చుట్టుపక్కలే ఉంటారు. చేసిన ఘనకార్యం చూసి మురుసుకుంటూ—నేను మీ ఓనరుకి చెబ్తాలే!''

వాడు తలవూపి హుషారుగా బయట స్టూలు వేసుకుని—దానిమీద కూర్చున్నాడు. ''రాసింది ఎవరై ఉంటారా?'' అని సుమంత్, రాహుల్, గోపాల్ తమలోతాము మెల్లగా చర్చించుకుంటున్నారు. కఠినశిలలా కదులూ మెదులూ లేకుండా కాలేజీవైపే చూస్తున్నాడు శరత్. అతని తీవ్రమైన దృష్టి అందర్ని పట్టిపట్టి చూస్తున్నాయి.

శాలిని, రేఖ కాలేజీకి వస్తున్నారు. శాలిని గేటు దాటి—లోపలికి వెళ్తుండగా ఈలలు-గోల-కేకలు-గోల.

శాలినికి అర్థంగాక అలాగే నిల్చుండిపోయింది. వాళ్ళు ఏవో కామెంట్స్ చేస్తున్నారు. పాలిపోయిన మొహంతో వెర్రిగా చూస్తూ నిలువడిపోయింది గోడమీద రాతల్ని.

శరత్— అది చూసి, ఒక్క వుదుటున లేచాడు. గోపాల్ అతడ్ని ఆపాడు. ''ఇప్పుడు నువ్వేదైనా గొడవ చేస్తే— ఆ రాతలు నిజమే అనుకుంటారు. వెళ్ళొద్దు'' అన్నాడు.

అప్పుడు అక్కడకు వచ్చిన ఇద్దరు ముగ్గురు అమ్మాయిలు శాలినిని ఒక రకంగా చూసి వెళ్ళిపోయారు.

శాలినికి ఒక్కక్షణం— అసలు తన గురించేనా గోడలమీద రాసి ఉన్నది. అనిపించింది శాలిని అంటే తనపేరేనా! నమ్మశక్యం కాని ఆ వాస్తవం శాలినిని స్టన్ చేసింది.

రేఖకి భయం వేసింది. శాలిని ఆ రాతల్ని చూసి ఎంత అప్‌సెట్ అవుతుందో ఊహించుకోగలదు.

నిజానికి వాళ్ళిద్దరిలో శాలినికి మానసిక ధైర్యం ఎక్కువ. కానీ ప్రస్తుత అవాంఛనీయ అసంభవ సంఘటనని జీర్ణించుకుని స్థైర్యంగా శాలిని నిలబడగలదా అని రేఖ ఆలోచిస్తోంది.

శాలినికి అడుగు ముందుకు పడలేదు. కాలేజీ ముళ్ళ గంపల మధ్య వున్నట్టు చుట్టూ స్టూడెంట్స్ ఎఱ్ఱ చీమల్లా అనిపిస్తున్నారు.

వెనుదిరిగి— ''నేను ఇంటికి వెళతాను'' అంది.

రేఖ మరోమాట కదపకుండా శాలినిని అనుసరించింది.

శాలిని రేఖలు కాలేజీనుంచి వెనక్కి తిరిగి వెళ్ళిపోవడం గమనించాడు శరత్.

శాలినికి ఇంత మనస్తాపం, అవమానం కలిగించినవాడిని వూరికే వదలకూడదు అని కసిగా లోలోపల అనుకున్నాడు.

''సార్!'' అంటూ వుద్రేకంగా సూరి కేకవేశాడు.

ప్రతినెలా మీరు పొదుపుచేసేది మీ ఆదాయంలో అతికొద్ది భాగమేకావచ్చు. కానీ... మీ బిడ్డకు అది ఉన్నత భవితవ్యానికి మార్గంకావచ్చు. స్వతంత్రంగా నిలదొక్కుకోవటానికి అదే ఆమెకు పునాదికావచ్చు. లేదా- వైవాహిక జీవితంలో ఆత్మవిశ్వాసానికి అదే ఆసరాకావచ్చు.

మీ అవసరాలన్నిటికీ తగిన విధంగా మార్గదర్శిలో ఎన్నెన్నో పథకాలున్నాయి. మీకు తగిన పథకాన్ని ఎంచుకొని, చిన్నమొత్తాలు పొదుపుచేయండి. మీ డబ్బుకు మార్గదర్శిని మించిన భద్రతలేదు

మార్గదర్శి చిట్‌ఫండ్‌కు 25 సంవత్సరాల చరిత్ర ఉంది. సాలీనా 120 కోట్ల రూపాయల బిజినెస్ టర్నోవర్‌తో, 80 కోట్ల రూపాయల ఆక్షన్ టర్నోవర్‌తో భారతదేశంలోకెల్లా నంబర్ 1 చిట్‌ఫండ్ సంస్థగా మీముందు నిలుస్తోంది- మార్గదర్శి.

అన్నిటా అగ్రగామి అయిన మార్గదర్శితో కలిసి నడవండి. మరిన్ని వివరాలకు మా ఏజెంట్లను కలవండి లేదా మమ్మల్ని సంప్రదించండి.

**డబ్బుకోసమేనా మీ చింత?**
**మార్గదర్శి ఉన్నది మీ చెంత!**









**మార్గదర్శి**
**చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్**
రిజిస్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీస్:
అబిద్ సెంటర్, హైదరాబాద్- 500 001

# చిన్న మొత్తాలు పొదుపు చేయండి... అనన్యమైన భవిష్యత్తును ఆమెకు అందజేయండి!

KIRON/MCF/10289

నలుగురూ ఒక్క వుదుటున లేచి బయటకు వచ్చారు ఆత్రుతగా.

"అదుగోసార్! ఎర్ర చారల చొక్కా నీలం పాంటు అబ్బాయే సార్ రంగు కలిపింది.

"వాడు— ఆరోజు శాలిని, రేఖల వెనుక పడుతున్నాడని తాము నాలుగు తగిలించిన ఇద్దరిలో ఒకడు— అంటే మరొకడు— వాడి ఫ్రెండే అయ్యుంటాడు. వాళ్ళు ఆరోజు తాము తన్నినందుకు ఇలా కక్ష తీర్చుకున్నారన్న మాట. రేఖని కాక శాలిని పేరు తనతో కలపడానికి కారణం— బహుశా తాను ఆ రోజు తామర శాలినికి ఇవ్వడం చూసి వుంటారు" శరత్ ఆలోచిస్తున్నాడు.

గోపాల్, సుమంత్— వాడిని పట్టుకోవడానికి ముందుకు వురికారు.

మరునటిరోజు— ఆ ఇద్దరూ రెండు ఫ్రాక్చర్లతో హాస్పటల్ పాలయ్యారు.

గోడలమీద నల్ల రాతలు చెరిగి మల్లెపువ్వు లాంటి తెల్లని సున్నం వెలిసింది.

★ ★ ★

ఇంటికి వచ్చిందేగాని మనసంతా అదోలా చేదు తిన్నట్టుగా వుంది. సరస్వతమ్మ— "ఏమే ఏమయ్యింది. కాలేజీలేదా అప్పుడే వచ్చేశావు—" అంది.

"విసిగించకమ్మా"- అని విసుక్కుని లోపలికి వెళ్ళిపోయి పుస్తకాలు టేబిల్మీద పడేసి మంచంమీద బోర్లాపడుకుని దిండులో మొహం దాచుకోగానే— అంతవరకు ఆమె దాచిపెట్టుకున్న కన్నీరు వుబికి గోదావరి ఝరీ ప్రవాహంలా బయటకు వచ్చి ఇంకిపోతున్నాయి నిశ్శబ్దంగా.

"అంత విసుగయితే ఎలా- ఆడపిల్లకి వయసురాగానే సరికాదు మంచీ మర్యాదగా, మన్ననగా మాట్లాడటం నేర్చుకో—" అని కూతురికి బుద్ధిచెప్పి లోపలికి వెళ్ళింది సరస్వతమ్మ.

'ఎందుకిలా జరిగింది. అసలు - తను, శరత్ ఏంమాట్లాడుకున్నారని! ముఖాముఖి మూడుసార్లు కల్సుకున్నారేమో! అంతే! కానీ ఎందుకు ఇంత కక్షగా, అసహ్యంగా ఎవరు? ఎవరు రాసి వుంటారు? వాళ్ళకి తామేం అపకారం చేశారు?' ఆమె ఆలోచనలు సాగిపోతున్నాయి.

★ ★ ★

రుక్మిణీనాధరావు క్లాసులో ఐక్యరాజ్యసమితి - దాని విధులు బోధిస్తున్నాడు.

రుక్మిణీనాధరావుతో పనిచేస్తున్న ఇంగ్లీషు మాస్టారు రమణమూర్తి హడావుడిగా - క్లాసులోకి వచ్చి - "రుక్మిణీ! నీతో అర్జంటుగా మాట్లాడాలి" అన్నాడు.

"క్లాస్ అయ్యాక వస్తాను—"

"భలేవాడివే! క్లాసు ఎక్కడకూ పోదుగానీ పద—" అని రుక్మిణీనాధరావు చేతిలో వున్న సోషల్బుక్లోకి తొంగిచూస్తూ- "ఏవిటీ చెబ్తున్నావ్? ఐక్యరాజ్యసమితి, దాని విధులూనా?! అవి ఎక్కడకూ పారిపోవుగానీ - పద నీతో ఒక విషయం మాట్లాడాలి"

"అల్లరి చెయ్యకుండా కూర్చోండి. ఇప్పుడే వస్తా" అని పిల్లల్ని హెచ్చరించి రుక్మిణీనాధరావు రమణమూర్తిని అనుసరించాడు.

ఇద్దరూ రావిచెట్టు కింద దిమ్మమీద కూర్చున్నారు. చెట్టుకొమ్మల మీద కాకులు మధ్యాహ్నం అవుతున్నా గోలగోలగా అరుస్తున్నాయి.

రమణమూర్తి ఎటువంటి సంకోచం లేకుండా ఆతృతగా సంభాషణ ప్రారంభించాడు-

"నేను కాలేజీ వైపునుంచి వస్తున్నా—"

"అటేంపని?!"

"నా బొంద. నా పనికాదు ముఖ్యం ఇప్పుడు. అక్కడ కాలేజీ గోడలనిండా ఏం రాతలున్నాయో తెల్సా?!"

"అసలు కాలేజీ గోడలదగ్గర నీకేం పనోయ్—" మళ్ళీ ఆశ్చర్యం ప్రకటించాడు రుక్మిణీనాధరావు.

"అబ్బ! అసలు సంగతి విన్పించుకోవేం? వాటిమీద నీ కూతురు శాలిని, వాడెవడో శరత్ అట— వాళ్ళిద్దరి గురించి అసహ్యంగా, ఛండాలంగా రాసి వుంది—"

"ఏవిటి—? ఏమని—?!" తెల్లబోతూ అడిగాడు.





"అబ్బ! నా నోటితో చెప్పించాలని చూస్తావేం? వాళ్ళిద్దరిమధ్య 'అది' వుందని రాశారు రుక్మిణీ—"

"రమణమూర్తీ—" కోపంగా గావుకేక పెట్టాడు.

"బావుంది. నామీద నీ కోపం చూపిస్తే అయిపోయిందనుకున్నావా? ఈరోజు సాయంత్రానికల్లా - ఇక్కడ స్కూల్లో - అక్కడ వూరువూరంతటికీ తెలుస్తుంది. అప్పుడు ఎంతమంది నోర్లు మూయించగలవు కోపంతో గావుకేకలు పెట్టి"

సరిగ్గా అప్పుడే రుక్మిణీనాధరావు మీద పైనుంచి కాకి రెట్ట వేసింది. కానీ అదేదీ పట్టించుకునే స్థితిలో లేడు. దిగ్గున లేచి బయల్దేరాడు.

"ఎక్కడికి?"

"ఇంటికి!"

"ఆ పని చెయ్యి. ఇప్పటికైనా - వున్న ఆ ఒక్క కూతుర్ని అదుపులో పెట్టు. అంతేకాని వూరి మగాళ్ళమీద వదిలెయ్యకు"

రుక్మిణీనాధరావు హెడ్మాస్టర్ పర్మిషన్ తీసుకోవాలనే విషయం కూడా మర్చిపోయి తన సైకిల్ ఎక్కి ఇంటివైపు బయల్దేరాడు.

★ ★ ★

ఇంటికి వచ్చీరాగానే— "ఏదది?" అని గర్జించాడు. అతనికి కోపంలో ఒళ్ళు తెలీడంలేదు.

సరస్వతమ్మ అయోమయంగా— "ఎవరూ?!" అంది.

"ఏదది?" అంటూనే లోపలికి వెళ్ళి మంచంమీద దిండులో మొహం దాచుకుని పడుకునివున్న కూతురు జుట్టు పట్టుకుని ఒక్క వూపున లాగాడు.

"అమ్మా—" అంటూ కెవ్వున కేక పెట్టింది శాలిని.

ఆ కేకల శబ్దాల్ని నొక్కేస్తూ— పిచ్చికోపంతో ఆ చెంపా, ఈ చెంపా వాయించాడు. సరస్వతమ్మకు మతిపోయినంత పనైంది. "ఏవిటండీ?" అంది అడ్డంపడుతూ—

"నువ్వుండు. ఈ ముండని చంపేస్తే పీడా విరగడయిపోతుంది. చదువుకోమని కాలేజీకి పంపితే- ఇది అక్కడ మగాళ్ళతో తైతెక్కలాడుతోంది- ఛీ- దీని కన్నతండ్రినని చెప్పుకోవడానికే సిగ్గుగా వుంది"

నిజానిజాలు తెల్సుకోకుండా తండ్రి వేస్తున్న నిందకి ఆమె క్రుంగిపోతూ- "అదికాదు అమ్మా" అని చెప్పబోయింది.

"ఛీ- నోర్ముయ్. సిగ్గులేదూ. బయట అంత భాగోతం వెలగబెట్టి నంగనాచిలా ఏవీ ఎరగని దానిలా నటిస్తే నమ్మేస్తామనుకుంటున్నావా? ఇన్నాళ్ళు మా కళ్ళుకప్పి ఆడిన నాటకాలు చాలులే-" ఛీత్కరించింది తల్లి.

శాలిని వరసగా పిడుగులు పడుతున్నట్లు క్రుంగిపోయి వాళ్ళధోరణి చూస్తోంది.

"రేపట్నుంచి కాలేజీ పేరు చెప్పి గుమ్మందాటి బయటకి వెళ్ళావో కాళ్ళు విరిచేస్తాను- ఇంట్లోపడుండు" అన్నాడు తండ్రి.

★ ★ ★

"వెధవా అత్తెసరు మార్కులతో పాస్ అవ్వడమే కష్టంగా వుంది నీకు. ఆ అందానికితోడు ఆడపిల్ల కావల్సి వచ్చిందిరా? అంత మగాడివయ్యావా?" గర్జించాడు వెంకట్రామయ్య. శకుంతల విషయం అర్థంకాక మౌనంగా చూస్తోంది. శరత్‌కి అర్థం అయ్యింది. కాలేజీ గోడలమీద రాతలు తండ్రివరకూ చేరాయి అని.

అసలే ప్రొద్దుటినుంచీ, ఆ గొడవలతో వేడెక్కివున్న శరత్‌కి తండ్రి మాటలతో మంటెక్కింది. "అవును మగాడినయ్యాను. అయితే ఇప్పుడేవంటారు?"

"ఏవిటో నీ తలపొగరు. ఏం చూసుకుని. పది రెండుసార్లు, ఇంటర్ మూడుసార్లు ఫెయిల్ అయ్యిగానీ వాటిని గట్టెక్కించలేకపోయావు. ఈ డిగ్రీ ఎన్ని సంవత్సరాలు వెలగబెడతావో! ఇన్నాళ్ళూ ఫుట్‌బాల్ ఆటలంటూ వూరేగావు, ఇప్పుడు అమ్మాయిలు కావల్సి వచ్చారు. సిగ్గులేదూ?!"

తన బీరువాలో- ఫుట్‌బాల్ ఛాంపియన్ కప్పులు చూసుకుంటూ- "సిగ్గులేదు నరేనా?! నన్ను అనవసరంగా విసిగించకండి" అని తల్లికేసి తిరిగి- "అమ్మా తలనొప్పిగా వుంది టీ

ఇవ్వమ్మా'' అన్నాడు.

వెంకట్రామయ్య తనకోపాన్ని ఎలా వెళ్ళగ్రక్కాలో తెలీక శకుంతల తెచ్చిన టీ కప్పు నేలకేసి కొట్టి వెళ్ళిపోయాడు.

శకుంతల మారుమాట్లాడకుండా లోపలికి వెళ్ళి మళ్ళీ టీ తెచ్చి ఇచ్చింది.

టీ సిప్ చేస్తున్న కొడుకుని ''శరత్-'' అంది.

''ఏమ్మా చెప్పు'' అన్నాడు మెత్తగా. ''ఎవరా అమ్మాయి''.

''నాతోపాటు డిగ్రీ మా కాలేజీలో చదువుతోందమ్మా. అందరూ అనుకుంటున్నట్టు మాఇద్దరి మధ్యా''

''నాకు తెల్సు, నువ్ మగాడివి ఎవరేమన్నా విదిలించుకోగలవు. పాపం ఆ అమ్మాయి ఎంత వేదనపడుతోందో!'' అందా తల్లి!

★ ★ ★

తెల్లవారింది.

ఇల్లంతా శ్మశానకళ వ్యాపించి వుంది. తొమ్మిదయ్యింది. రేఖ వచ్చింది. వాతావరణం గమనించి నిన్నటి ఎఫెక్ట్ అనుకుంది. ఇంకా మంచంమీద ముడుచుకుని పడుకున్న శాలినిని చూసి- ''శాలీ! ఇంకా అలాగే పడుకున్నావా? కాలేజీకి రావూ?'' అంది. శాలిని సమాధానం చెప్పకముందే సరస్వతమ్మ కంఠం నుంచి విసురుగా సమాధానం వచ్చింది.

''అదిక కాలేజీకి రాదు. వచ్చి అక్కడ వెలగబెట్టిన తైతెక్కలు చాలు''

రేఖ బిత్తరపోయింది.

''లేదండి! అవ్వన్నీ నిజాలుకావు''

''ఏమ్మా! అలా అని అది చెప్పమందా? తోడుదొంగలు. మీసంగతి తెలీదు నాకూ! పిల్లికి ఎలక సాక్ష్యం అన్నట్టు'' అని విసురుగా అక్కడ్నించి వెళ్ళిపోయింది.

''ఏవిటే ఇది?''

శాలిని కళ్ళెత్తి బేలగా చూసింది.

ఎప్పుడూ గోదావరిలో హుషారుగా ఈదే చిన్ని చేపపిల్లలా మిలమిలలాడే శాలిని- అలా బాణం తగిలిన పావురంలా విలవిల్లాడడం భరించలేకపోయింది రేఖ.

''ఇకనుంచీ నేను కాలేజీకి రావడానికి వీలుపడదు రేఖా. ఇన్నాళ్ళూ ఫస్ట్‌క్లాసులు తెచ్చుకుని కష్టపడి చదివిన చదువంతా గాలికి వదిలెయ్యాల్సిందే! ఎమ్.ఏ చేసి పి.హెచ్.డి చెయ్యాలనే కలల్ని చెరిపేసుకోవాల్సిందే! కేవలం- కేవలం గోడలమీద రెండువాక్యాల రాతవలన నా నుదిటి రాతే మారిపోయింది చూశావా రేఖా''

''లేదు శాలినీ! అలా జరగడానికి వీల్లేదు. నీలాంటి బ్రైట్ స్టూడెంట్ చదువు మధ్యలో ఆగిపోవడానికి వీల్లేదు''

''వీల్లేదు అనుకుంటే మాత్రం వీలవుతుందా? నేను కాలేజీలో మళ్ళీ చేరగలనా? ఇంతే నా ఖర్మ!''

''శాలీ! ఖర్మవాదంతో నువ్ కోరుకున్న జీవితానికి ఫుల్‌స్టాప్ పెడుతున్నావా?'

''ఏం చెయ్యమంటావ్ మరి?''

రేఖ క్షణం ఆలోచించింది. ''ఎవరివల్లనైతే నీమీద ఈ అపవాదు పడిందో- ఆ వ్యక్తిచేతే ఈ విషయాన్ని రూపుమాపిస్తా శాలీ! అంతేగాని నువ్ చదువుమానెయ్యడం నేను సహించలేను''

★ ★ ★

''శరత్-''

స్నేహితులతో వెళుతున్న శరత్ వెనుదిరిగి చూశాడు. రేఖ కనిపించింది.

''ఒక్కసారి మీతో మాట్లాడాలి''

శరత్ స్నేహితులవైపు తిరిగి- తలవూపి- రేఖ దగ్గరకు వచ్చాడు.

''ఏమిటి ఈరోజు కూడా శాలిని కాలేజీ మానేసిందా?'' రేఖకి ఏంచెప్పాలో, ఎలా చెప్పాలో పాలుపోవడంలేదు- ఆలోచిస్తోంది.

''గోడల మీద చూశారుగా. వాటన్నిటినీ చెరిపించేసి సున్నం వేయించాను. ఇక శాలిని వాటి గురించి భయపడనవసరం లేదు''

''గోడలమీద రాతలు చెరిపించారు శరత్! నిజమే! కానీ ఈ కుళ్ళు మనుషుల అంతరంగాల్లోని నైచ్యాన్ని చెరపగలరా? శాలిని భయపడటం లేదుకానీ శాలినిని కాలేజీకి పంపడానికి ఆమె తల్లిదండ్రులు మూర్ఖంగా భయపడుతున్నారు''

పూర్తిగా అర్థంకాకపోయినా, రేఖ మాటలు కొంతవరకు అర్థం అయ్యాయి.

"ఏమిటి రేఖా ఏమయ్యింది"

"శాలిని అమ్మానాన్నా ఇకనుంచీ శాలినిని కాలేజీకి పంపరు"

శరత్ నివ్వెరపోయాడు.

"ఏంచేద్దాం"

"నాకు తెలీదు. మీరేంచేస్తారో! శాలిని ఫస్ట్ ర్యాంకు స్టూడెంటు. టెన్త్, ఇంటర్‌లలో స్టేట్ ఫస్ట్ వచ్చిన ఇంటెలిజెంట్. తనకి 'చదువు' అంటే ప్రాణం. మీరు ఏదోఒకటి చేసి శాలిని మళ్ళీ కాలేజీకి రాగలిగేలా చెయ్యండి".

"మీరు వర్రీకాకండి. ఆ సమస్య నాకు వదిలేసి నిశ్చింతగా వుండండి-" అన్నాడు ఒక నిర్ణయానికి వస్తూ.



వీధరుగు మీద కూర్చున్న రుక్మిణీనాధరావు అదే అరుగుమీద కుర్చీలో కూర్చున్న రమణ మూర్తితో- కూతురివల్ల గొడలకెక్కిన తన పరువు గురించి ఏదో చెబుతున్నాడు. గుమ్మం లోపలగా కూర్చున్న సరస్వతమ్మ వీళ్ళ సంభా షణలలో పాలువంచుకుంటోంది.

"నువ్ మరీ ఈ విషయం గురించి ఎక్కువ వర్రీగాకు. నా ఎరికలోవున్న నాలుగైదు సంబంధాలలో ఒకటి చూసి పెళ్ళి చేసేద్దాం" అన్నాడు రమణమూర్తి.

అంతవరకు మ్లానమయివున్న రుక్మిణీనాధ రావు మొహంలో కాంతి ప్రవేశించింది.

"కానీ ఇంత గొడవ జరిగిందని తెలిస్తే- ఏ అబ్బాయి ఒప్పుకుంటాడు?!" అనుమానంగా అడిగాడు.

"ఒక ఆర్నెల్లు ఆగితే- ఈ గొడవలన్నీ సర్దుకుంటాయి. గంతకు తగ్గబొంత అన్న ట్టుగా- కాస్త నోరూవాయీ లేనివాడ్ని చూసి కట్టబెట్టేద్దాం. నేను అనుకున్నది చెప్పాను నీకు ఎలాతోస్తే అలాచెయ్యి" అన్నాడు.

"నాకు ఏంతోచడంలేదు. ఈ గొడవతో మతి స్థిమితం తప్పినట్టయ్యింది. ఇటు ఏడుతరా లు అటు ఏడుతరాలుగా ఎంతో పరువు మర్యా దలతో గుట్టుగా బ్రతికిన కుటుంబం మాది. ఇలాంటి అల్లరచిల్లర తిరుగుళ్ళు తిరిగి నాకూ తురు- నన్ను నడిబజారుకి లాగుతుందని కలలో కూడా అనుకోలేదు"

"మనసు కుదుటపరుచుకో రుక్మిణీనాధ రావ్! నేనున్నానుగా. నేను చూసుకుంటా. కష్టాల్లోనే స్నేహితుల అండకావల్సింది సుఖా ల్లోకాదుగా"

"నువ్వున్నావనే ఈ మాత్రం అయినా ధై ర్యంగా వుండగలిగాను"

"అన్నయ్యగారూ! సమయానికి మీరు ఆదు కుని ఇన్ని రకాలుగా ధైర్యం చెప్పబట్టిగాని లేకపోతే మేం ఏమయిపోయేవాళ్ళం" అంది సరస్వతమ్మ- తడితేరిన కళ్ళని ఒత్తుకుంటూ.

ఈలోగా-

స్ఫురద్రూపం,

ఆరడుగుల దృఢమైన యువకుడు వీధిగేటు తీసుకుని వాళ్ళవైపు వస్తుంటే- ముగ్గురూ ప్ర శ్నార్థకంగా చూస్తూవున్నారు.

అతను దృఢంగా, హుందాగా నడుచు కుంటూ వచ్చి-

-"రుక్మిణీనాధరావుగారూ! మీతో మాట్లా డాలి" అన్నాడు.

లోపలిగదిలో, మంచంమీద కూర్చుని చే తిలో పుస్తకం పెట్టుకుని, వీళ్ళసంభాషణవ్యాద యాన్ని తూట్లు పొడుస్తుంటే మౌనంగా తనలో తను కృంగిపోతున్న శాలిని శరత్ కంఠం వినగానే దిగ్గునలేచి కిటికీదగ్గరకు వచ్చింది.

"ఎవర్నువ్వు?" రుక్మిణీనాధరావు అసహ నంగా అడిగాడు.

తన కూతురు- కన్నకూతురు- ఎవడితోనో తిరిగిందని- మరెవడో రాస్తే- అందులోని నిజా

నిజాలు ఆలోచించకుండా గుడ్డిగానమ్మి- కనీసం కూతురుతో తిరిగినవాడు అనబడుతున్న వాడి మొహంకూడా తెలీకుండా మూర్ఖత్వానికి పరాకాష్టగా నిల్చిన ఈ రుక్మిణీనాథరావుని చూశాకే శరత్‌లో నిరసన కలిగింది.

"నేను శరత్‌ని"

ముగ్గురూ తమ తలలమీద తలా ఒక బాంబుపడినంతగా బెదిరిపోయారు.

తేరుకుని- "ఎందుకొచ్చావ్? నీకు మాతో ఏంపని-" కీచుగా అడిగాడు రుక్మిణీనాథరావు.

"మీ బండారం బయటపడిందని వళ్లిగ్గానే దానితో కులకడానికి వచ్చావా?" రమణమూర్తి కవ్వింపుగా అడిగాడు.

"నోర్మూయ్... మరో అసహ్యకరమైన మాట నీ నోటినుంచి వస్తే తలపగలగొట్తా జాగ్రత్త-" రౌద్రంగా అని-

రుక్మిణీనాథరావు వైపు తిరిగి- "ఇటువంటి పనికిమాలినవాళ్ళ చెప్పుడుమాటలు విని బుద్రపాడుచేసుకోకండి. శాలినికి-నాకుమధ్య ఎటువంటి అవినీతికరమైన సంబంధంలేదు. ఆ గోడలమీద చెడురాతలు రాసినవాళ్ళ నోర్లు మూయించాను. ఇంకేం గొడవలు జరగవు. శాలిని బ్రైట్‌స్టూడెంట్. అటువంటి అమ్మాయి చదువుమధ్యలో ఆపడం అన్యాయం. దానికి నేను కారణమయినందుకు చాలా బాధపడుతున్నాను. దయచేసి రేపటినుంచి శాలినిని కాలేజీకి పంపండి"

"పంపకపోతే ఏం చేస్తావ్? అయినా నువ్వెవడివి నాకు నీతులుచెప్పడానికి? బరితెగించిన దౌర్భాగ్యుడివి! శాలిని నాకూతురు- నా ఇష్టం. అది కాలేజీకి వెళ్ళడం నాకిష్టంలేదు అంతే!"

"మీరు మూర్ఖంగా ఆలోచిస్తున్నారు. రేపు శాలిని పది గంటలకు కాలేజీలో వుండాలి... లేకపోతే-"

"లేకపోతే ఏంచేస్తావురా?"

"లేకపోతే నేనే వచ్చి శాలినిని తీసుకువెళ్తాను"

"ఎంత గుండెధైర్యంరా నీకు. ఈసారి గుమ్మందాటిలోపలికి అడుగు పెడితే- నీ బొందిలో ప్రాణాలువుండవు- జాగ్రత్త"

ఆదీ చూద్దాం" అని విసురుగా వెళ్ళిపోయాడు శరత్.

★ ★ ★

మరునాటిరోజు-

సరిగ్గా పదింబావు. శరత్ గేటుతెరుచుకుని లోపలికి వచ్చాడు. వాకిలిముందువున్న ప్రశాంత వాతావరణం అతణ్ణి ఆశ్చర్యపరిచింది. రుక్మిణీనాథరావు రమణమూర్తిలాంటి మరో ఇద్దరు ముగ్గురు పెద్దమనుషుల్ని తోడుపెట్టుకుని తనతో వాదనకు దిగుతాడని శరత్ అనుకున్నాడు. అందుకు విరుద్ధంగా ఇంటి ముందు ఎవరూ లేకపోయేసరికి అతను ఆశ్చర్యపోయాడు.

అయితే రమణమూర్తి రుక్మిణీనాథరావుకు గట్టిగాచెప్పి- శరత్‌కి బుద్ధిచెప్పడానికి ముగ్గురు పాలెగాళ్ళని కర్రలిచ్చి పంపాడనే విషయం శరత్‌కి తెలీదు.

అతను గేటువేసి ముందుకు కదలగానే ఒకడు కొబ్బరిచెట్లచాటునుంచి, మరొకడు ఇంటివెనుకనుంచి, ఇంకొకడు వసారాలోంచి ప్రత్యక్షమయ్యారు. వాళ్ళచేతుల్లో కర్రలున్నాయి. మొహాల్లో ఎటువంటి భావంలేదు. అప్పటికి శరత్‌కి ఏదో అర్థమయినట్టు అనిపించింది. కానీ వాళ్ళు తనని కొట్టడానికి ఏర్పాటుచెయ్యబడ్డ మనుషులు అని అతను నమ్మలేకపోయాడు.

వాళ్ళు చాలామామూలుగా, మెకానికల్‌గా ముందుముందుకు వస్తున్నారు. శరత్ స్థాణువులా నిల్చుండిపోయాడు. మరుక్షణం అతని తలమీద ఒకదెబ్బ- తలనుంచి రక్తం చిందుతుంటే- 'అమ్మా' అంటూ అప్రయత్నంగా కేకవేసి ముందుకి తూలిపడ్డాడు. ఆ ప్రశాంత వాతావరణం అతని కేకకి జాలిగా ప్రతిధ్వనించింది.

ఇటువంటిదేదో జరగబోతోంది అని చూచాయగా గ్రహించిన శాలిని, ఈ కేకతో నిర్వెరపోయి- దిగ్గునలేచి కిటికీ దగ్గరకు పరిగెత్తుకు వచ్చింది.

మరోదెబ్బ భుజంమీద పడగానే అతను కూలిపోయాడు. బోర్లాపడిపోతున్న అతడివీపు మీద దబ్బున మరో క్రూరమైన వెనుకదెబ్బ.

శాలినికి ఆ శబ్దాలవల్ల పూర్తిగా అర్థమయ్యింది- శరత్‌ని వాళ్ళు బాదుతున్నారని. అక్కణ్ణుంచి ఆమెకి ఏడిపించడంలేదు అమాయకమైన పచ్చటి ప్రకృతితప్ప. తలుపుబయట వేసేసి ఉంది. శాలిని తలుపులు తియ్యమని లోపల్నుంచి తలుపులమీద బాదింది. అరచేతులు పగిలి రక్తసిక్తమయ్యాయి. గొంతు బొంగురుపోయింది. కానీ బయటనుంచి ఎటువంటి అలికిడి లేదు.

స్పృహతప్పి పచ్చటి పచ్చికమీద ఎర్రబడి ఒదిగిపోయిన శరత్‌ని వాళ్ళు నిర్దాక్షిణ్యంగా రోడ్డుమీదకి లాగిపడేశారు.

మరికొంచెంసేపటికి అటుగావచ్చిన కాలేజీ కుర్రాళ్ళు- శరత్‌ని ఆ స్థితిలోచూసి కంగారుపడి హాస్పటల్లో చేర్చారు.

శాలిని అరిచి అరిచి నిస్పృహగా నిస్త్రాణగా కూలబడిపోయింది.

★ ★ ★

రుక్మిణీనాథరావు ఇదంతా ముందు హాల్‌లో నిల్చునిచూస్తూ నిల్చుండిపోయాడు. శరీరంలో చలనంపోయినట్లుగా అలాస్థాణువై నిల్చుండిపోయాడు. తర్వాత తనకళ్ళముందు జరుగుతున్నది కలకాదు పచ్చివాస్తవం అనే స్పృహవచ్చేసరికి ఒకరకమైన వణుకుపట్టుకుంది. ఆయన సహజంగా సాత్వికుడు. కోపోద్రేకంలో- అటు రమణమూర్తి ఇటు సరస్వతమ్మ గట్టిగా చెప్పడంతో- ఈ ఏర్పాటుకు ఒప్పుకున్నాడు.

రమణమూర్తి, సరస్వతమ్మ చాలాసహజంగా జరుగుతున్నది చూశారు. శరత్‌ని ఈడ్చుకువెళ్ళి బయటపడేయడంతో- "హమ్మయ్య... పీడావదిలింది" అంది సరస్వతమ్మ కసిగా.

"ముండివెధవకి సరైన పద్ధతిలో సరిగ్గా బుద్ధిచెప్పాం- " అన్నాడు రమణమూర్తి అని, రుక్మిణీనాథరావు మొహంలోకి చూసి-"ఏవిటి అలా బెదిరిపోయినట్టుంది మొహం. రిలాక్సవ్వు. రా.. ఇలాకూర్చో- " అన్నాడు.

రుక్మిణీనాథరావు కుర్చీలో కూలబడి నిట్టూర్చాడు.

"అమ్మా. కాసిని మంచినీళ్ళు పట్రామ్మ - " అన్నాడు.

ఆవిడ వెళ్ళి రెండు గ్లాసులు మంచినీళ్ళు తెచ్చి - ఇద్దరికీ అందించింది.

రుక్మిణీనాథరావు అన్యమనస్కంగా మంచినీళ్ళు తాగి, మరోసారి నిట్టూర్చాడు. అతడు మానసికంగా బాగా భయపడిపోయాడని రమణమూర్తికి అర్థమయ్యింది. "నువ్వు వూరికే ఆ విషయం గురించి ఆలోచించి వర్రీ అవ్వకు. ఏం చేసినా మనమ్మాయి మంచికోసం చేశాను-" అన్నాడు.

రుక్మిణీనాథరావు ఏంమాట్లాడలేదు. కనీసం ఆమాటల్ని పట్టించుకున్నట్టు కూడా లేడు.

రమణమూర్తి ఇలా లాభం లేదనుకుని - "ఏమ్మా మరీ ఈ కాస్తదానికే ఇలా బెంబేలు పడిపోతున్నాడు. ఇక రేపు ఎన్నెన్నో ఎదుర్కోవాలి. ఇలా అయితే ఎలా?-" అన్నాడు.

"ఆయన అంతే అన్నయ్యగారూ- వూరికే కోపం వచ్చినప్పుడు రంకెలేస్తారు కానీ మరీ భయస్థులు" చెప్పింది సరస్వతమ్మ.

"చూశావా. చెల్లెమ్మకున్న ధైర్యం కూడా నీకు లేదు. ఒకటి ఆలోచించు మనమ్మాయి వాడితో లేచిపోయి వూరంతా అల్లరయితే బావుంటుందా? చెప్పు!" అన్నాడు మెత్తగా.

అప్పటికి రుక్మిణీనాథరావులో కదలిక వచ్చింది. "నాకంఠంలో ప్రాణం వుండగా అలా జరగనివ్వను" అన్నాడు.

"శభాష్ !అ పౌరుషం వుంచుకో. దెబ్బకి దయ్యం జడుస్తుందని సామెత. ఈ దెబ్బకి వాడి బుర్ర కుదుటపడి ఇకముందు పిచ్చివేషాలు వెయ్యడు-"

"కానీ -" అని ఆగాడు రుక్మిణీనాథరావు

"చెప్పు"ప్రోత్సాహకంగా అన్నాడురమణమూర్తి.

"వాళ్ళవాళ్లు పోలీసులకు రిపోర్టుఇస్తే-"

"నీమొహం నీకు ఇటువంటి విషయాలగురించి పెద్దగా తెలీక అలా మాట్లాడుతున్నావు. ఇటువంటి విషయాల్లో ఈ కొట్టించడాలు సహజం. అంతమాత్రానికే పోలీసురిపోర్టులు ఇవ్వరు. అసలు వీడి అబ్బ - వీడికి ఈ మాత్రం శాస్తి జరిగినందుకు సంతోషిస్తాడని నా అభిప్రాయం-"

"అయితే మనం చేసింది కరక్టేనంటావు-"




రమణమూర్తి ముందు తెల్లబోయి తర్వాత నవ్వేస్తూ -"ఇంకా కరక్టేనా అని నెమ్మదిగా అంటావేం. సెంట్‌పర్శంట్ కరక్ట్. ఇక మిగిలింది - మీ పిల్ల బుర్రలో వున్న "ప్రేమ - దోమ" బూజు దులపడం అన్నాడు.

"అది నేను చూసుకుంటాలెండి" సరస్వతమ్మ భరోసాగా అంది.

"అయితే నేను వస్తా. మళ్ళీ సాయంత్రం వస్తాను" అని లేచాడు రమణమూర్తి.

"అప్పుడే వెళ్ళిపోతావా?" రుక్మిణీనాధరావు లేస్తూ అన్నాడు.

సరస్వతమ్మ - "భోజనాల సమయం అయ్యింది. భోంచేసి వెళ్తురు అన్నయ్యగారూ" అంది.

"లేదమ్మా - వెళ్ళాలి. కొన్ని పనులున్నాయి' అని కదిలాడు.

"పోనీమధ్యాహ్నం వరకూ అన్నావుండకూడదూ - " నెమ్మదిగా అడిగాడు

"బావుంది. నేను ఇక్కడ కూర్చుంటే ఎలా? అయినా నీకు నువ్వు ధైర్యం తెచ్చుకోవాలిగానీ - ఇలా అయితే లాభం లేదు -" అన్నాడు రమణమూర్తి.

"సర్లే... సర్లే" అన్నాడు సాలోచనగా రుక్మిణీనాధరావు.

రమణమూర్తి మరోసారి వెళ్లొస్తా అని చెప్పి బయల్దేరాడు.

★ ★ ★

శాలిని ఆ రోజంతా ఏమీ తినలేదు. ఎదలో వేదన, మెదడులో ఆలోచన, శరీరంలో నిస్సత్తువ- కడుపులో మంట, ఊపిరిలో వేడి, కళ్ళల్లో పొడారినతడి- ఆమె తన ఇరవైఏళ్ళ జీవితంలో కనీసం కలలో కూడా వూహించని నరకం భరిస్తోంది.

సరస్వతమ్మ కిటికీలోనుంచి చూసింది కూతురు ఏం చేస్తోందా అని-

తల్లినీడ తనమీద లీలగాపడి తలెత్తి తల్లిని చూసి- "అమ్మా- ఒక్కసారి, ఒక్కసారి శరత్‌ని చూసి వస్తానమ్మా, ఎలా ఉన్నాడో-"

కూతురి బరితెగించినతనానికి తల్లి ఆశ్చర్యపోతూ- "ఏం వొచ్చిందే నీకు ఇంత జరిగినా నీకు సిగ్గు రాలేదేమే పనికిమాలినదానా!"

"అమ్మా- నన్నెందుకు అర్థం చేసుకోవు. ఎంతసేపు మీ ధోరణిలో మీరు మాట్లాడితే... అయినా శరత్ వచ్చి అడిగినదానిలో తప్పేం ఉందని- అతడ్ని మనుషులచేత కొట్టించారు. నాకోసం వచ్చి- నాకోసం మాట్లాడి, నాకోసం రక్తం కార్చిన అతడ్ని నేను చూడాలి. చూసితీరాలి. తలుపు తియ్యమ్మా"

"ఛీ! నోర్మూసుకునిపడివుండు. ఆట్టే మాట్లాడావంటే అట్లకాడ కాల్చి ఒంటినిండా వాతలు పెడ్తా." నిరసనగా అని లోపలికి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి గడిచింది.

తెల్లారింది.

రేఖ కోటువేసుకుని లోపలికి రావడం ఆమెకి కనిపించి, ఆత్రుతంగా కిటికీ దగ్గరకు వచ్చి- చిన్నగా 'రేఖా' అని పిల్చింది. ఎర్రబడిన కళ్ళతో, రేగిన జుత్తుతో, పీక్కుపోయిన మొహంతో కనిపించిన శాలినిని చూడగానే రేఖ నిర్వెరపోయింది.

"ఏమిటే ఇలా అయిపోయావు-" అంది దుఃఖంతో పూడుకుపోయిన కంఠంతో-

"నాకేం కాలేదుకాని- శరత్ ఎలా ఉన్నాడు బాగా దెబ్బలు తగిలాయా? ఇదేవిటే అన్నీ ఇలా జరుగుతున్నాయి."

"పెద్దవాళ్ళ మూర్ఖత్వానికి రుజువులు ఇవి శాలీ -"

"రేఖా! నాకు శరత్‌ని చూడాలని ఉంది. చూస్తేగాని మనసు కుదుటపడదు."

రేఖ మారుమాట్లాడకుండా తలుపు తీసింది. ఇద్దరూ రిక్షాలో హాస్పటల్‌కి వెళ్ళారు.

రేఖ- "నేను ఇక్కడే ఉంటాను. నువ్వు తొందరగా వెళ్ళి చూసివచ్చెయ్యి-" అంది.

శాలిని లోపలికివచ్చి- మేడపైన 11వ రూములో శరత్ ఉన్నాడని తెల్సుకుని గబగబ మెట్లెక్కి పైకివెళ్ళింది. పై మెట్టుమీద నిల్చున్న వెంకట్రామయ్యని- తప్పించుకుని వెళ్ళబోతుంటే-" ఎందుకొచ్చావు నువ్వు?" అన్నాడు కఠినంగా. ఆయన అంతకుముందు శాలినిని

చూసి ఉన్నాడు.

"శరత్ ఎలా ఉన్నాడో చూసివెళదామని-" కంపిస్తున్న గొంతుని తన అధీనంలోకి తెచ్చుకుంటూ అంది.

"చేసింది చాలు. ఇంకా చూసి ఏం చేస్తావ్! వెళ్ళు."

"లేదండి ఒక్కసారి శరత్‌ని చూడనివ్వండి. చూడగానే వెళ్ళిపోతాను" అంటూ ముందుకు అడుగువెయ్యబోయింది.

ఒళ్ళు తెలియని కోపంతో శాలిని భుజంపట్టి వెనక్కి తోశాడు వెంకట్రామయ్య.

అసలే నీర్సంగా ఉన్న శాలిని పట్టులేక- మెట్లమీదనుంచి క్రిందకు దొర్లుకుంటూపడి- మెట్లక్రింద ఉన్న తొట్టికి తల తగిలి- నుదుటి భాగం నిలువునా చీరుకుపోయి రక్తం ధారకట్టింది.

ఇలా జరుగుతుందని వూహించని వెంకట్రామయ్య తెల్లబోయి చూస్తూ ఉండిపోయాడు. అమాయకమైన శాలిని మొహం అలా చూసేసరికి ఆయనలో పశ్చాత్తాపం కలిగింది. తన ధోరణి తప్పేమో అనే ఆలోచన కలిగింది.

అప్పుడే లోపల్నుంచి కొడుకు దగ్గర్నుంచి వచ్చిన శకుంతల ఇదంతా చూసి, "ఏంటండీ" అంది కంగారుగా.

వెంకట్రామయ్య మరేం మాట్లాడలేక అలాగే నిలబడిపోయాడు.

శకుంతల గబగబ మెట్లుదిగి- స్పృహతప్పి పడిపోయిన శాలిని తలని తన ఒళ్ళో పెట్టుకుని- నుదుటి గాయంనుంచి కారుతున్న రక్తాన్ని చీరకొంగుతో అదిమిపెట్టింది. ఈలోగా అక్కడకు వచ్చిన నర్సు- "అయ్యో ఏమయ్యింది-" అని గబగబ నాడిచూసి- "బలహీనతవల్ల, షాక్ వల్ల స్పృహతప్పింది. జ్వరం కూడా వుంది" అంది.

ఈలోగా మరో నర్సు చల్లటి నీళ్ళు తీసుకురావడంతో శకుంతల శాలిని మొహాన్ని చల్లటి నీటితో అద్దింది. శాలిని- నెమ్మదిగా కళ్ళు తెరిచింది. తనెక్కడుందో స్పృహలేదు. చుట్టూ అయోమయంగా చూసి, కళ్ళు మూసుకుంది.

"కన్సల్టింగ్ రూంలోకి తీసుకువెళ్దాం రండి" అంది నర్సు శాలినిని లేపుతూ. శకుంతల నర్సు కలిసి శాలినిని జాగ్రత్తగా నడిపించుకుంటూ వెళ్తుంటే వెంకట్రామయ్య నిశ్శబ్దంగా వాళ్లని అనుసరించాడు.

డాక్టరు శాలినిని టెస్టుచేసి టెంపరేచర్ చూసి, కనురెప్పలు లాగిచూసి, చిరాకుపడుతూ వెంకట్రామయ్యవైపు చూశాడు.

"104 టెంపరేచర్ వుంది. ఏం చేస్తున్నారు-" అన్నాడు

వెంకట్రామయ్యకు ఏం చెప్పాలో తోచలేదు.

"అమ్మాయిలో అసలు రక్తంలేదు. చాలా బలహీనంగా వుంది. పరిస్థితి ఇంతవరకు వచ్చే వరకు మీరు చూస్తూకూర్చున్నారా? అబ్సర్డ్" అని మరింత చిరాకుపడుతూ ప్రిస్క్రిప్షన్ రాయసాగాడు.

"పిల్లల్ని కనేసి, వాళ్ల పాటికి వాళ్లని వదిలేయడం కాదు. కాస్త వాళ్ల ఆరోగ్యాన్ని కూడా పట్టించుకుంటూ వుండాలి- జ్వరానికి టాబ్లెట్స్ రాశాను. అవిగో అవి- రోజుకు మూడు వాడాలి. ఇక బలానికి టానిక్స్ అవీ రాశాను. బాగా పళ్ళూ అవీ పెట్టండి-"అని ఆగి శకుంతల వైపు చూసి- "జాగ్రత్తగా చూసుకోకపోతే- అమ్మాయి జ్వరం తిరగబెట్టి టైఫాయిడ్‌లోకి దింపే ప్రమాదం వుంది-" అన్నాడు.

కళ్ళు మూసుకుని, బలహీనంగా కుర్చీలో ఒక మూలకి ఒదిగిపోయి వున్న శాలినిని చూస్తే శకుంతల హృదయం కలిచివేసింది. అప్రయత్నంగా ఆవిడ కళ్లల్లో కన్నీరు తిరిగింది.

అప్పటివరకూగిల్టీగా ఫీలవుతున్న వెంకట్రామయ్య హృదయం జాలితో నిండిపోయింది. ముక్కుపచ్చలారని ఆడపిల్లని, ఏ హక్కు వుందని తామంతా రాక్షసుల్లా ఇలా చిత్రహింసలు పెడుతున్నారు"అనిపించింది.

నుదుటి, మోచేతి గాయాలు కడిగి, ఆయింట్‌మెంట్ వేసి కట్టుకట్టింది నర్సు.

డాక్టరు ఇక తీసుకువెళ్ళొచ్చు అన్నట్టుగా చూశాడు. శకుంతల శాలినిని నడిపించుకుంటూ బయటకు వచ్చింది. వెంకట్రామయ్యకు శాలినిని ఎక్కడకు తీసుకెళ్ళాలో అర్థంకాలేదు.

శకుంతల దుఃఖంనిండిన గొంతుతో-

"ఏమండీ?!" ఇదంతా?" అంది.

వెంకట్రామయ్య మరేం మాట్లాడలేకపోయాడు.

గంట గడిచినా శాలిని రాకపోయేసరికి రేఖకి ఏదో అనుమానం వచ్చి, కంగారుగా లోపలికి వచ్చింది. లోపలికి రాగానే శాలిని నుదుటికి, మోచేతికి కట్టుచూసి బెదిరిపోతూ " శాలీ, ఏమయ్యిందే" అని పరిగెత్తుకుంటూ దగ్గరకు వచ్చింది.

వెంకట్రామయ్య రేఖను చూసి— "ఈ అమ్మాయి స్నేహితురాలివా?" అన్నాడు.

"అవునండి... మా శాలినికి ఏమయింది?" అంది ఏడుపుని ఆపుకుంటూ.

వెంకట్రామయ్యకు ఏంచెప్పాలో అర్థంకాలేదు. తను మెట్లమీద నుంచి తోసేశాడనే నిజం చెప్పగలడా?

శకుంతల నెమ్మదిగా— "మెట్లెక్కుతూ స్పృహ తప్పి కిందకు పడిపోయింది" అంది.

"అయ్యో... ఇప్పుడెలాగండి" అని కంగారు పడి - మరోసారి శకుంతల్ని వెంకట్రామయ్యని చూసి- "మీరు...?" అని ప్రశ్నార్థకంగా ఆగిపోయింది.

వెంకట్రామయ్యకు మళ్ళీ ఏంజవాబు చెప్పాలో అర్థంకాలేదు. శకుంతల అంది— "శరత్ మా అబ్బాయి—"

రేఖ మరింత ముడుచుకుపోయి - "థాంక్సండీ - వస్తాం—" అని శాలిని భుజాలచుట్టూ చేతులు వేసింది. శాలిని ట్రాన్స్‌లో వున్నట్లు వుంది. ఈ ప్రపంచంతో తనకేం సంబంధంలేనట్టు.

వెంకట్రామయ్య అప్పటికి కదిలి— "అదేమిటి... ఎలా తీసుకువెళ్లావు?" అన్నాడు.

"బయట రిక్షా వుందండి—"

కాసేపు ఆలోచించి— "పదమ్మా - నేనూ వస్తాను" అన్నాడు.

రేఖ తటపటాయిస్తూ— "ఇప్పటికే శాలిని అమ్మానాన్నలు - శాలిని ఎక్కడికి వెళ్ళిందని గ్రహించి గొడవ చేస్తూవుంటారు. మీరు వస్తే—" అంది.

వెంకట్రామయ్యకు మరోసారి గిల్టీనెస్ హృదయాన్ని పొడిచినట్టయింది. ఇంట్లో తెలియకుండా ఎంతో రిస్క్‌చేసి శరత్‌ని చూడటానికి వస్తే, తనేం చేశాడు.

ఇప్పుడు ఇంటికి వెళ్తే ఆ అమ్మాయిని - వాళ్ళు ఎలా హింసిస్తారో, శరత్‌ని కొట్టించినవాళ్లు ఎంతకైనా తెగిస్తారు అన్పించింది. ఒక నిర్ణయానికి వచ్చి - "అమ్మా... నువ్వు ఇక ఇంటికి వెళ్లిపో. శాలినిని నేను వాళ్ళింట్లో దింపి వాళ్ళ అమ్మానాన్నలకు సర్దిచెబుతా—" చెప్పాడు.

ఆ మాటలకి రేఖ మొహంలో రిలీఫ్ వచ్చింది "థాంక్సండీ" అంది.

శకుంతల— "అవును... అలా చేస్తేనే మంచిది. డాక్టరు చెప్పినమాటలు కూడా చెప్పిరండి—" అంది.

వెంకట్రామయ్య తల వూపి శాలినిని జాగ్రత్తగా రిక్షా ఎక్కించి తను పక్కన కూర్చున్నాడు. తన భుజం మీద తలవాల్చి - అమాయకంగా బాహ్యజ్ఞానం కోల్పోయి, బలహీనపడిపోయిన ఈ అమ్మాయిని ఇలా చూడగానే వెంకట్రామయ్య మనసు సాఫ్ట్ అయిపోయింది. దారిలో మెడికల్ స్టోర్స్‌వద్ద రిక్షా ఆపించి— రిక్షావాడికి ప్రిస్క్రిప్షన్ - డబ్బులు ఇచ్చి టాబ్లెట్స్, టానిక్కు తెప్పించాడు. దారిలో పళ్ళు కూడా కొన్నాడు.

శాలిని ఇంటిముందు రిక్షా ఆగింది. అప్పటికే రుక్మిణీనాథరావు, సరస్వతమ్మ శాలిని లేకపోవడంతో ఏంచెయ్యాలా అని గందరగోళపడుతున్నారు. రుక్మిణీనాథరావు నోటికొచ్చినట్లు తిడుతుంటే— సరస్వతమ్మ అంతకంటే రెట్టింపుగా కూతుర్ని తిడుతోంది.

ఇంటిముందు ఆగిన రిక్షాలోంచి వెంకట్రామయ్య ముందు దిగి - శాలినిని జాగ్రత్తగా దింపి - లోపలకు నడిపించుకువచ్చాడు.

శాలిని వున్న పరిస్థితికన్నా - వెంకట్రామయ్యను చూసి రుక్మిణీనాథరావు అదిరిపోయాడు. ఆయనెవరో తెలీని సరస్వతమ్మ అయోమయంగా చూస్తోంది. "శాలినికి 104 జ్వరం. చాలా బలహీనంగా వుంది. సరిగ్గా చూసుకోకపోతే టైఫాయిడ్ వచ్చే ప్రమాదం వుంది అన్నాడు డాక్టర్—" అన్నాడు.




రుక్మిణీనాథరావుకు ఏం మాట్లాడాలో పాలు పోలేదు.

సరస్వతమ్మ దురుసుగా— "మీరెవరు అసలు?" అంది.

"శరత్ తండ్రిని" కామ్‌గా అన్నాడు. ఆ మాటకి సరస్వతమ్మ అదిరిపోయి నిలబడిపోయింది.

"శాలినిని తీసుకువెళ్ళి పడుకోబెట్టండి. అమ్మాయి పరిస్థితి ఏం బావుండలేదు" అన్నాడు.

సరస్వతమ్మ మరోమాట లేకుండా శాలినిని లోపలికి తీసుకువెళ్ళిపోయింది.

ఈలోగా రిక్షావాడు పళ్ళు, మందులు, టానిక్స్ తెచ్చి అక్కడ పెట్టాడు. "ఇదిగో ప్రిస్క్రిప్షన్ - ఇవిగో ఈ టాబ్లెట్స్ రోజుకు మూడు, ఇది రోజుకు ఒకటి - ఈ టానిక్స్ రెండూ మూడుపూట్లా ఇవ్వాలి. రక్తహీనత వల్ల బలహీనంగా వుంది. కాస్త పళ్లు - పాలు అవీ ఎక్కువగా ఇవ్వండి. జాగ్రత్తగా చూసుకోండి—" అని చెప్పి ప్రిస్క్రిప్షన్ కాగితం అందించాడు.

కాయితం అందుకుంటూ— "కూర్చోండి" అన్నాడు కంగారుని అణుచుకుంటూ-

రమణమూర్తి ప్రోద్బలం వలన అలా చేశాడుగానీ మనసులో అప్పట్నుంచీ దడగానే వుంది రుక్మిణీనాథరావుకి.

ఆ దెబ్బలవలన శరత్ - రక్తం కోల్పోయి భుజం ఫ్రాక్చర్ అయి సీరియస్ కండీషన్‌లో వుండటంవలన హాస్పటల్‌లో జాయిన్ చేశారని విన్నప్పటినుంచీ మనిషి మరింత బెదురుగొడ్డయిపోయాడు. రెండురోజుల్నుంచీ బయటకు రావడం మానేశాడు. ఎవరైనా, ఏదైనా అడుగుతారేమో - అని భయపడుతూ ఇంట్లోనే వుండిపోయాడు. కానీ శరత్ తండ్రి సరాసరి తన ఇంటికి వచ్చేసరికి రుక్మిణీనాథరావుకి చెమటలు పట్టాయి. వెంకట్రామయ్య రుక్మిణీనాథరావు మనసులో జరుగుతున్న తర్జనభర్జనలు కొంతవరకు సరిగ్గానే ఊహించగలిగాడు.

సరస్వతమ్మ శాలినిని లోపల పడుకోబెట్టి వచ్చింది.

"పిల్లల్ని భయపెట్టి అదుపాజ్ఞల్లో వుంచుకోవాలి. అది తల్లిదండ్రుల బాధ్యత... నిజమే! కానీ మరీ ముక్కుపచ్చలారని ఆడపిల్లని అంతలా—" అని ఆగాడు.

"మీరూ ఒక ఆడపిల్లనికంటే తెల్సివచ్చేది" అంది సరస్వతమ్మ అక్కసుగా.

వెంకట్రామయ్య నిరసనగా నవ్వి— "కొడుకు తండ్రిగా నేను పడుతున్న బాధ తక్కువది కాదు. మీరు కొట్టించిన దెబ్బలకి వాడి చెయ్యి ఫ్రాక్చర్ అయింది. ఆ చేతి ఎముక సరిగ్గా అతుక్కోకపోతే వాడు జీవితాంతం అవిటివాడయిపోతాడు. ఒక మగాడు అవిటివాడయితే వాడి భవిష్యత్తు ఎలా వుంటుందో మీరు ఊహించగలరనుకుంటాను"

సరస్వతమ్మ ఏం మాట్లాడలేకపోయింది.

రుక్మిణీనాథరావు మొహం పాలిపోయింది.

"మీరేదో నాకన్నా బలవంతులు అనుకోకండి. నేనూ మరో ముగ్గురు పాలెగాళ్ళని పెట్టి మీ తలబద్దలు కొట్టించగలను—" అని ఆగాడు.

రుక్మిణీనాథరావు నోరు పొడారిపోయి గుటకలు వేశాడు.

"కానీ మన సమస్యకి అది పరిష్కారం కాదని ఇప్పటికయినా మీకర్థం అయి వుంటుంది—"

"నన్ను... నన్ను క్షమించండి" తడబడుతూ అన్నాడు రుక్మిణీనాథరావు. వెంకట్రామయ్య ఏం మాట్లాడలేదు.

"ఇంత జరుగుతుందనుకోలేదు. ఆవేశంలో..." వాక్యం పూర్తిచెయ్యలేకపోయాడు.

వెంకట్రామయ్య నిరసనగా— "ఇంత జరుగుతుందనుకోలేదా? ఆ మాటకి అర్థం తెల్సా మీకు—" అని "సరే! అనవసర సంభాషణ ఎందుకు? అమ్మాయిని జాగ్రత్తగా చూడండి. ఏ మాత్రం మీరు మూర్ఖంగా ప్రవర్తించినా మీ అమ్మాయి మీకు దక్కదు. మరో రోజు వచ్చి మీతో అన్ని విషయాలు విపులంగా మాట్లాడతాను" అని లేచాడు.

★ ★ ★

మరో వారంరోజులకు శరత్‌ని హాస్పటల్ నుంచి డిశ్చార్జ్ చేశారు. శరత్ ఇంకా కోలుకోలే



డు. గాయాల వచ్చి ఆరింది. కానీ భుజాన సిమెంటు పోత అలాగే వుంది.

ఆ రోజు ఫాన్సీ స్టోరుకు బయల్దేరుతూ వెంకట్రామయ్య కొడుకు మంచం దగ్గరకు వెళ్ళాడు. నీరసంతో పాలిపోయి మంచంమీద పడుకున్న కొడుకుని చూడగానే శాలిని అమాయక వదనం జ్ఞాపకం వచ్చింది.

నిన్ననే శాలిని ఎలావుందో చూడటానికి వెళ్ళాడు. డాక్టర్ ఇచ్చిన వార్నింగ్ నిజమయింది. శాలినికి టైఫాయిడ్. మరింత చిక్కి శల్యమయి పడివున్న ఆ అమ్మాయిని అలా చూడగానే వెంకట్రామయ్యకు వెంటనే ఏడి టోలా అనిపించింది. ఆ విషయం తెల్సి శకుంతల కూడా చాలా బాధపడింది.

ఒక్కసారి ఈ ఆలోచన్ల నుంచి బయటపడి— ఫ్యాన్సీ స్టోర్సుకు బయల్దేరాడు. ఎందుకో శాలిని పరిస్థితి అయన్ని విపరీతంగా కలవర పెడుతోంది. ఇటువంటి మనసుని కలవరపెట్టే అనుభవం వెంకట్రామయ్యకు కొత్త. ఈ అనుభవం ఆయన్ని ఒక్క నిముషం విశ్రాంతి తీసుకోనివ్వకుండా వెంటాడుతోంది. ఆ

అమ్మాయి అమాయకంగా కన్పించడమే కాదు నిజంగా ముగ్ధ, అమాయకురాలు అని తన అంతరాంతరాళాల్లో అన్పించడంవల్లనే— శాలిని పట్ల జాలికలిగి తనకి ఆ అమ్మాయి పదేపదే జ్ఞాపకం వస్తోంది అన్పించింది వెంకట్రామయ్యకు.

ఫాన్సీ స్టోర్సులో కూర్చుని లెక్కలు చూసుకుంటున్నాడు. సేల్సుగర్ల్సు ఏవో అమ్ముతున్నారు. కుర్రాళ్ళు పొట్లాలు కట్టి— రేట్స్ చెబుతున్నారు. ఈలోగా అక్కడికి ఇంగ్లీషు లెక్చరర్ విల్సన్ వచ్చాడు.

ఆయనకి వెంకట్రామయ్యతో కొంచెం పరిచయం ఎక్కువ. ఇద్దరూ అమాట ఈమాట మాట్లాడుకుంటున్నారు. సడన్‌గా ఎందుకో వెంకట్రామయ్య అనుకోకుండా "శాలిని మీకు తెల్సా?" అనడిగాడు. విల్సన్ ఆశ్చర్యంగా "తెలియకపోవడం ఏవిటి? నాకు వున్న బ్రైట్ స్టూడెంట్స్‌లో ఆ అమ్మాయి ముఖ్యమైన స్టూడెంట్— ఏం అలా అడుగుతున్నారు" అనడిగాడు.

"ఆఁ... ఏం లేదు. టైఫాయిడ్ వచ్చి కాలేజీకి రావడంలేదు. ఈ సంవత్సరం చదువు పాడయిపోయినట్టేనా అని అడుగుదాం- అని"

"ఇంకా ఇది జనవరే కదండీ - అయినా ఆ అమ్మాయి పరీక్షల చివర్లో వచ్చి ఫైనల్స్ రాసినా కాలేజ్ ఫస్ట్ వస్తుంది. వెరీ ఇంటలిజెంట్—"

వెంకట్రామయ్య ఆశ్చర్యంగా— "కాలేజీ ఫస్టా?" అన్నాడు.

"ఒకరకంగా అది తక్కువ చెప్పడమే. స్టేట్ ఫస్టు రావొచ్చు నా వుద్దేశం ప్రకారం—"

"అంత తెలివైనదా?"

"చాలా. అందుకే మా లెక్చరర్స్‌కి ముఖ్యంగా ఇంగ్లీషు డిపార్ట్‌మెంటుకి శాలిని పెట్" అన్నాడు.

వెంకట్రామయ్య ఆలోచనల్లోపడ్డాడు. ఆయన ఆలోచనలు ఒక రూపం దిద్దుకుంటున్నాయి.

వెంకట్రామయ్యకు చదువు అంటే అదోరకమైన ముచ్చట. ఉన్న ఒక్క కొడుకు ఆయన ముచ్చట తీర్చిన పాపాన పోలేదు. శాలిని చాలా తెలివైందని, స్టేట్ ఫస్ట్ వచ్చే స్టూడెంట్ అని తెల్సినప్పటి నుంచీ ఆ అమ్మాయంటే మరింత మంచిభావం ఏర్పడింది ఆయనలో.

వెంకట్రామయ్యకు ఇంటలెక్చువల్‌గా మాట్లాడేవాళ్ళంటే ప్రత్యేకమైన అభిమానం. అందుకే ఆయన చుట్టూ అంతమంది స్నేహితులు వుంటారు ఎప్పుడూ. భార్య శకుంతల ఎక్కువగా మౌనంగా వుంటుంది. కొడుకు శరత్ ప్రతి విషయానికి తల తిరుగుడుగా సమాధానం చెబుతాడు.

అటువంటి వాతావరణంలో— తెలివైన కోడలు, చక్కటి కోడలు— తనకు టీ అందిస్తూ, ఆ రోజు పేపర్లోని రాజకీయ వార్తలగురించి చర్చిస్తే ఎంత బావుంటుంది; వీక్, సన్‌డే ఇంగ్లీషు వీక్లీలలో వచ్చే రాజకీయ నాయకుల బండారాలు బయటపెట్టే ఆర్టికల్స్ గురించి వివరిస్తూ అన్నం వడ్డిస్తుంటే ఎంత బావుంటుంది; ఇప్పుడొచ్చే దరిద్రపు సినిమాల గురించి చమత్కరిస్తూ, జోక్సువేస్తూ నిరసనగా విమర్శిస్తూ— సాయంత్రం తనకు ఆమె పక్క అందిస్తే ఎంతో బావుంటుంది. తనకి నాటకాలంటే పిచ్చి. తనతోపాటు నాటకాలు, డ్రామాలు చూసి వాటిగురించి— తనతో పేకాట ఆడుతూ మాట్లాడితే— ఆహా... ఎంతో బావుంటుంది. ఆయనకి కోడలి గురించి ఇటువంటి ఆలోచనలు ఎన్నో ఉన్నాయి.

తన ఆలోచనలకి తగ్గ అమ్మాయి 'శాలిని' అని అనిపించేసరికి, ఆయనో నిర్ణయానికి వచ్చాడు. తను మాత్రం ఇంతకన్నా అందమైన, తెలివైన, మర్యాద-మన్నన తెల్సిన కోడల్ని తెచ్చుకోగలడా? ఎప్పుడూ కొడుకు తనకు నచ్చేపని ఒక్కటి చేసి ఎరగడు. అట్లాంటిది కోడలివిషయంలో వాడు కొంచెం బుర్ర చూపించాడు. అటువంటప్పుడు— తను మూర్ఖంగా కేవలం కొడుకు ఆ అమ్మాయిని ప్రేమించాడు కాబట్టి— తను ఆ అమ్మాయిని నిరసించాలి, వ్యతిరేకించాలి అనేపద్ధతి ప్రకారం పోకుండా ఆ అమ్మాయినే ఇంటికోడలుగా తెచ్చుకుంటే?! పైగా కులం వేరనే సమస్య కూడా లేదు.

ఈ ఆలోచన వెంకట్రామయ్యలోని అపరాధ

భావనని— తను శాలినికి మనస్తాపం కలిగించాననే ఆలోచన పోయి— కంగారుని కలిగించింది. వెంటనే తన ముఖ్యస్నేహితుడు సారంగపాణిని పిలిపించి అతనితో ఈ విషయాలు మాట్లాడాడు. వెంకట్రామయ్య ఆలోచన్లని మరింత బలపరిచాడు సారంగపాణి.



ఇంటికి వచ్చి భార్యని పిలిచాడు.

"శాలిని గురించి నీ అభిప్రాయం ఏవిటి?"

శకుంతల అయోమయంగా చూసింది.

"శరత్‌కి తొందరగా పెళ్ళిచేస్తే మంచిదని నా ఉద్దేశం. నువ్వేమనుకుంటున్నావు?"

"మంచిదే"

"వాడు ఇలా ఇష్టంవచ్చినట్టు తిరుగుతూ వాళ్ళనీ వీళ్ళనీ నాలుగుతన్నీ లేక తన్నించుకునో ఇంటికి రావడం మామూలయిపోయింది. పెళ్ళిచేస్తే బాగుపడతాడు... ఏమంటావు?"

"నిజమే"

"ఈ సంవత్సరం వాడు డిగ్రీ గట్టెక్కిస్తాడని నాకేం నమ్మకంలేదు. కనీసం కాస్త తెలివైన పిల్లని తెచ్చిచేస్తే— దాన్ని చూసి అయినా బుద్ధితెచ్చుకుని సరిగ్గా చదువుతాడని నా ఆశ"

శకుంతల తలవూపింది.

కాసేపు ఆగి— "శాలిని అయితే ఎలా వుంటుందంటావ్?" అన్నాడు.

శకుంతల భర్త మొహంలోకి ఆశ్చర్యంగా చూసి, తర్వాత చిన్న చిర్నవ్వునవ్వి— "నాకు ఇష్టమే—" అంది.

"ఎలానూ మనవాడి నిర్వాకం వలన ఊరంతా పావం ఆ అమ్మాయి అల్లరిపడింది. పైగా మంచి తెలివైన అమ్మాయి— అమాయకురాలు. మన ఇంటికి కోడలు అయితే బావుంటుంది కదూ" అన్నాడు.

శకుంతల— "అవును... అలా చెయ్యండి" అంది.

వెంకట్రామయ్య సంతృప్తిగా తలవరికించాడు.

వెంకట్రామయ్య, సారంగపాణి వెళ్ళేసరికి ఎసైన్‌మెంట్సు బుక్సు దిద్దుతున్నాడు రుక్మిణీనాథరావు. వాళ్ళురావడం గమనించి— లేచి ఆదరంగా ఆహ్వానించాడు.

వెంకట్రామయ్య లోపల అడుగుపెట్టీపెట్టగానే "శాలిని ఎలావుంది?" అన్నాడు.

"ఇంకా జ్వరం నూరు ఉంది" చెప్పాడు రుక్మిణీనాథరావు.

"ఏదీ... ఎక్కడ ఉంది" అంటూ చనువుగా వెంకట్రామయ్య లోపలకు వెళ్ళాడు.

రుక్మిణీనాథరావు అనుసరించాడు. లోపల మంచంమీద పడుకుని ఆ జ్వరంలో కూడా టెక్సు బుక్కు చదువుతున్న శాలినిని చూస్తే ముచ్చటేసింది.

"ఇప్పుడు చదువుకు తొందరేమిటమ్మా! ఆరోగ్యం పూర్తిగా బాగుపడ్డాక చదువుకోవచ్చుగా—" అన్నాడు.

శాలిని నవ్వి— "శరత్ ఎలా ఉన్నాడు?" అంది.

"వాడు కూడా ఇంకా పూర్తిగా కోలుకోలేదు—" అని "టాబ్లెట్స్, టానిక్కు, పళ్ళు, జావ— అన్నీ టైమ్‌కు తీసుకుంటున్నావుగా—" అన్నాడు.

శాలిని తల ఊపింది.

అప్పుడే అక్కడకు వచ్చిన సరస్వతమ్మతో "నా కోడల్ని కాస్త బాగా చూసుకోవాలి మరి—" అన్నాడు

ఆ మాటల్లో శ్లేష అర్థమయి రుక్మిణీనాథరావు, సరస్వతమ్మ ఆనందపడ్డారు. శాలినికి పూర్తిగా అర్థంకాక ఆలోచనగా చూస్తుండిపోయింది.

అది గ్రహించి వెంకట్రామయ్య "వేరే ఆలోచనలు మనసులోపెట్టుకుని అనవసరంగా

మననుపాడుచేసుకోకు. అన్నీ నీకు నచ్చినవి ధంగా, నీ ఇష్టప్రకారం నేను జరిపిస్తాను'' అన్నాడు.

శాలినికి విషయం మరికొంత స్పష్టంగా అర్థమయింది.

''మీరిద్దరూ ఇలా మంచాల మీద ఉండటం నాకు చాలా బాధగా ఉందమ్మా. మీరు తొందరగా కోలుకుంటే- ముహూర్తాలు పెట్టుకోవచ్చు—'' అన్నాడు.

రుక్మిణీనాథరావు, సరస్వతమ్మ ఆనందంతో ఉబ్బితబ్బిబ్బవుతున్నారు.

శాలినికి విషయం పూర్తిగా అర్థమయింది. కేవలం వెంకట్రామయ్య తనకు ఇస్తున్న సపోర్టువల్లనే తల్లీతండ్రీ తనని బాగా చూసుకుంటున్నారని కూడా గ్రహించింది.

వెంకట్రామయ్య హాల్లోకి వచ్చి కూర్చోగానే- సరస్వతమ్మ కాఫీలు ఇచ్చి వెళ్ళబోయింది.

''మీరు కూడా ఉండండమ్మా'' అన్నాడు వెంకట్రామయ్య.

సరస్వతమ్మ కుతూహలంగా ఆయనేం చెబుతారా అని తలుపు దగ్గర కూర్చుంది.

వెంకట్రామయ్య- ''మీ అమ్మాయి శాలినిని మా ఇంటి కోడలుగా చేసుకోవాలనే నేను నిర్ణయించాను- మీ అభిప్రాయం—'' అని ఆగాడు.

రుక్మిణీనాథరావుకు గబుక్కున ఏంమాట్లాడాలో తెలీలేదు.

వెంకట్రామయ్య— ''మీకు మా అబ్బాయి శరత్‌ని మీ అల్లుడుగా అంగీకరించడంలో అభ్యంతరం లేదుగా—'' అనడిగాడు.

''అయ్యో ఎంతమాట. మీరు వచ్చి ఇంతగా అడుగుతుంటే—'' నొచ్చుకుంటున్నట్టు అన్నాడు రుక్మిణీనాథరావు.

సరస్వతమ్మ ఆనందంగా— ''అంతకన్నా అదృష్టం మాకు వేరే ఏముటుంది- అన్నయ్యగారూ—'' అంది.

''అయితే పిల్లలు ఇద్దరూ బాగా కోలుకున్నాక ముహూర్తాలు పెట్టుకుందాం—'' అన్నాడు.

''అలాగే. తప్పకుండా—''

''అయితే— నాకు మా కోడలు డిగ్రీ పూర్తి చెయ్యాలని కోరిక—''

''మీ ఇష్టం- మీ కోడలు—''

''అన్నీ నేనే మాట్లాడుతున్నా— మీరు కూడా మీ ఇష్టాలు, అభిప్రాయాలు మాట్లాడండి''

''అభిప్రాయాలు, ఇష్టాలు ప్రత్యేకంగా ఏవీ లేవు బావగారూ! కట్నం వ్యవహారాలు మాట్లాడుకుంటే—''

వెంకట్రామయ్య నవ్వాడు. ''నా కొడుకుని చూశారుగా నాకు ఉన్నది వాడు ఒక్కడే! పెద్దబజారులో ఫాన్సీస్టోరు, డాబా ఇల్లు ఉన్నాయి. రెండూ కలిపి మూడు లక్షలుపైగా చేస్తాయి. నాకు ఒక్కపైసా కట్నం వేసుకునే ఉద్దేశ్యంలేదు. పెళ్ళిఖర్చులు చెరిసగం. నాకు మీ అమ్మాయి నచ్చింది అన్నివిధాలా— కాబట్టి కోడలిగా చేసుకుందాం అనుకుంటున్నా గాని కట్నం దగ్గర బేరాలు ఆడి ''డబ్బు'' పోగేసుకోవాలనే ఉదేశ్యం ఏకోశానాలేదు'' ఈ మాటలు గుమ్మంచాటున నిల్చున్న సరస్వతమ్మలో విపరీతమైన సంతోషాన్ని కలగచేశాయి. గబగబ కూతురు దగ్గరకు వెళ్ళి ఎంతో అదృష్టవంతురాలివే తల్లీ అని మెటికలు విరుచుకుంది. శాలిని తల్లి ఆనందాన్ని ఆశ్చర్యంగా చూసింది.

అంతలో తనపట్ల విసుగుతో, చిరాకుతో ప్రవర్తించిన తల్లిలో ఎంత మార్పు అనిపించింది.

మరో అరగంటకి వాళ్ళని సాగనంపి వచ్చి— ''నాచిట్టి తల్లి అదృష్టవంతురాలు. పైసా కట్నం, లాంఛనాలు గొడవలేకుండా మొగుడ్ని తెచ్చుకుంటోంది'' అన్నాడు రుక్మిణీనాథరావు.

శాలినికి— తనకీ— శరత్‌కీ పెళ్ళి నిశ్చయం చేశారని పూర్తిగా అర్థమయింది. ఆమెకి వింతగా అనిపించింది తామిద్దరికీ పెళ్ళి అంటే. తనకోసం రాజకుమారుడిలా వచ్చిన శరత్ తన భర్త అవబోతున్నాడంటే ఆనందం కలిగింది.

★ ★ ★




హుషారుగా ఇంటికి వచ్చాడు వెంకట్రామయ్య. నరానరి శరత్ పడుకున్న మంచం పక్కన కూర్చుని భార్యని కేకేశాడు— "వీడికి బత్తాయి రసం ఇచ్చావా?" అని.

శకుంతల తల ఊపింది. నిల్చుని ఉన్న భార్యని- ఇలా కూర్చో అన్నాడు. శకుంతల వచ్చింది. శరత్ తండ్రి హుషారుని వింతగా చూస్తున్నాడు.

"మీ ఇద్దరికీ పెళ్ళినిశ్చయం చేశానురా. శాలిని తండ్రితో మాట్లాడాను. తొందరగా కోలుకుని హుషారుగా తిరగాలి మరి—" అన్నాడు.

శరత్ ఆశ్చర్యంగా— "ఎవరిపెళ్ళి?" అన్నాడు.

"ఎవరి పెళ్ళి ఏవిటిరా... నీకు, శాలినికి పెళ్ళినిశ్చయం చేశాం. ఇందాకే రుక్మిణీనాథరావుతో మాట్లాడాను. అన్నీ ఫైనలైజ్ అయినట్టే. నీకేమన్నా స్పెషల్‌గా అల్లుడి కోరికలు ఏవైనా ఉన్నాయా?" నవ్వాడు.

శకుంతల భర్తలో మార్పుకి ఆనందిస్తోంది.

"నాకు- శాలినికి పెళ్ళా?" అయోమయంగా అడిగాడు.

"అదిగో- అలా తలతిక్కగా మాట్లాడితేనే నాకు కోపం వచ్చేది. మీరు కల్సి, తిరిగి ప్రేమించుకున్నప్పుడు- ఈ ఆలోచనలేదా?" అన్నాడు గట్టిగా.

తండ్రికి కోపంవచ్చిందని శరత్ మౌనం అయ్యాడు. విషయం ఇలా మారుతుందని అతను ఊహించలేదు. అయినా శాలినిని భార్యగా ఊహించుకోవడానికి బావుంది అనిపించింది. ఉత్తి బావుండటం కాదు- చాలా బావుందనిపించింది మరికాసేపటి తర్వాత.

★ ★ ★

ఆ రాత్రంతా ఏవో కలలు. తను, శాలిని హేపీగా ఏవో కబుర్లు చెప్పుకున్నట్టు- శాలిని తనని గుండెల కుదుముకుని- ప్రేమించినట్టు- ఏవేవో- రాత్రంతా అతనికి నిద్రసరిగా రాలేదు. శరత్ హృదయం పండిన తేనెపట్టు నుండి చుక్కలు చుక్కలుగా తేనె జాలువారినట్టు- శాలిని మీద ప్రేమ- అదేరకమైన తియ్యటి అనుభూతి పొంగిపొర్లుతోంది.

తెల్లవారిన దగ్గర్నుంచీ శాలినిని ఒక్కసారి తనివితీరా చూడాలనిపిస్తోంది. ఏవేవో మాట్లాడాలనిపిస్తోంది. కానీ ఎలా? ఎలాగోలా చూడాలనుకుని నిర్ణయం చేసుకున్నాడు.

లేచి మొహం కడిగాడు. తల్లి వచ్చి టవలుతో మొహం తుడిచి- జుత్తు దువ్వింది. టిఫిన్ చేశాడు. పడక కుర్చీలో కూర్చుని కాసేపు ఆలోచించాడు. లేచాడు- అటు ఇటు పచార్లు చేశాడు. మళ్ళీ కూర్చున్నాడు- మనను స్థిమితంగాలేదు. నీర్సంగా అనిపిస్తోంది. అయినా ఓపిక చేసుకుని లేచి- అద్దంముందు నిల్చుని మొహం పరిశీలనగా చూసుకున్నాడు. మొహం పీక్కుపోయి, గడ్డం పెరిగి, కళ్ళు లోతుకువెళ్ళి జుత్తు రెల్లుదుబ్బులా పెరిగి-

అరచేత్తో జుత్తు నొక్కుకుని- భుజాన్ని కట్టు చూసుకున్నాడు. ఈ కట్టువలన చొక్కా మార్చుకోవడం అంటే బ్రహ్మప్రళయంగా ఉంది. అందుకే చొక్కా వేసుకోకుండా— పైన తెల్ల టవల్ కప్పుకుని తిరుగుతున్నాడు. లుంగీ కట్టుకోవడం కూడా ఒంటిచేత్తో కష్టమే. తల్లి సహాయం కావల్సిందే. వెళ్లివచ్చి మళ్ళీ పడక కుర్చీలో కూర్చున్నాడు- వెంటనే వెళ్ళి తీరాల్సిందే అని లేచాడు.

బీరువా దగ్గరకు వెళ్ళి పాంటు, షర్టు బయటకు తీశాడు. శకుంతల ఆశ్చర్యంగా— "అవెందుకురా ఇప్పుడు?" అంది.

"బయటకు వెళ్ళాలి"

"హాస్పటల్‌కా... నాన్నగారు సాయంత్రం దగ్గరుండి తీసుకెళ్తానన్నారుగా?"

"కాదు"

"మరి" ఆశ్చర్యపోతూ అంది.

"ఎక్కడికో చెప్పే తీరాలా?" ఆ స్వరం నీరసంగా ఉన్నా— అందులో ధ్వనించిన విసుగు, అసహనం గమనించి శకుంతల మరేం మాట్లాడలేదు. పాంట్ తొడుక్కున్నాడు. నడుంవరకు లాక్కున్నాడు. కానీ బటన్స్ పెట్టుకోలేకపోతున్నాడు. శకుంతల కొడుకు అవస్థ గమనించి గుండీలు పెట్టింది.

షర్టు అతికష్టంమీద, పళ్ళమధ్య బాధని నొక్కిపెట్టి వేసుకుంటుంటే శకుంతల తల్లి మనసు విలవిల్లాడింది. షర్టు వేసుకోగానే—




శకుంతల తేలిగ్గా నిట్టూర్చి గుండీలు పెట్టింది.

మొహాన్నా పౌడరు అద్ది- జుత్తు దువ్వింది.

శరత్ బయటకు వచ్చాడు. అప్పటికే పద కొండు దాటుతోంది. మధ్యాహ్నపు ముదురుతున్న ఎండ వెయ్యి వోల్టుల బల్బు మొహానికి దగ్గరగా పెట్టి ఫ్లాష్ కొట్టినట్టు దిమ్మెరపోయి కళ్ళు మూసుకుని నెమ్మదిగా తెరిచాడు.

మెల్లగా నడక ప్రారంభించాడు. నాలుగడుగులు వేసేసరికి ఒళ్ళంతా చెమటపోసి, ఆయాసం వస్తోంది. నిస్పృహ, నీరసం కల్సి నిట్టూర్పవుతోంది. తెగించి నడుస్తున్నాడు.

శాలిని ఇల్లు కనుచూపు మేరలో కనిపించగానే హృదయం ఆనందతాండవం చేసింది. గతంలో ఎప్పుడూ ఇటువంటివి అనుభవంకాలేదు. ఇల్లు దగ్గరవుతున్నకొలదీ ఆత్రుత పెరిగిపోతోంది. శాలిని తనని చూసి ఏమంటుంది? ఎలా ఫీల్ అవుతుంది ఊహలు- కలలు.

గేటువరకు వచ్చాక ఆగిపోయాడు. అసలు విషయం తాను ఆలోచించలేదు. శాలిని అమ్మానాన్నల విషయం మర్చిపోయాడు. వాళ్ళు తనని చూసి ఏదైనా అంటే, గొడవచేస్తే- శాలినిని చూడటానికి అనుమతించకపోతే- ఈ ఆలోచనతో నిరాశనిట్టూర్పులతో అలాగే చెమటలు కక్కుకుంటూ గేటుముందు నిలబడిపోయాడు.

ఆరోజు ఆదివారం అవ్వడం వలన అప్పుడే ఏదోపనిమీద ఇంట్లోవున్న రుక్మిణీనాథరావు బయటకు వస్తూ- ఎండలో మాడిపోతూ కూడా అలాగే గేటుదగ్గర నిల్చుండిపోయిన శరత్‌ని చూసి కంగారుగా శరత్‌వైపు కదిలాడు.

రుక్మిణీనాథరావుని చూడగానే శరత్‌కి మరింత నిస్పృహ, నిరాశలు కలిగాయి. "ఏమ్మంటాడు అంతేగా!" అనుకున్నాడు.

"అదేంటిబాబూ అలా ఎండలో నిల్చుండిపోయావు రా లోపలకి" అని ఆప్యాయంగా పిలిచాడు.

శరత్ కలానిజమా అన్నట్టు రుక్మిణీనాథరావు వైపు తెల్లబోయి చూస్తున్నాడు.

"ఆరోగ్యం ఎలా ఉంది. నేనే వచ్చిచూద్దామనుకుంటున్నా? బాగా చిక్కిపోయావు- నీరసపడిపోయావు" అన్నాడు లోపలికి తీసుకువస్తూ.

శరత్ తన చెవుల్ని తానే నమ్మలేకపోతున్నాడు.

అప్పటికి కూడా మాట్లాడని శరత్‌ని చూసి, రుక్మిణీనాథరావు పాతసంగతుల వలన మనసు కష్టపెట్టుకుని మాట్లాడటంలేదనుకుని— "బాబూ! గతం గుర్తుపెట్టుకోకు. ఏదో తెలియక ఆవేశంతో అలా ప్రవర్తించా. చిన్నవాడివైనా నా తొందరపాటుకి క్షమించమని అడుగుతున్నా" అన్నాడు.

శరత్ కంగారుపడుతూ— "అబ్బే అదేంలేదండి—" అన్నాడు.

"కూర్చోబాబూ—" అని లోపలవున్న సరస్వతమ్మని— "ఏమే అల్లుడుగారు వచ్చారు- ఇలారా" అని పిలిచాడు.

అప్పటికి శరత్‌కి ట్యూబ్‌లైటు వెలిగింది. వాళ్ళు ఎందుకు తనమీద అంత ప్రేమ, ఆప్యాయతలు చూపిస్తున్నారో- అసలు ఇంతవరకు ఆ విషయం తనకు తట్టలేదేంటి - అని తనలోతను నవ్వుకున్నాడు.

సరస్వతమ్మ కంగారుగా వచ్చి- "బావున్నావా నాయనా బాగా పాడయిపోయావు పాపిష్టివాళ్ళం. ఏదో చేశాం. అది మనసులో పెట్టుకోకు" అని ఆగి- "ఆడపిల్ల కన్నవాళ్ళం అదే ఆత్రుతతో-" ఆమె మాటలు పూర్తికాకుండానే మధ్యలో శరత్- "అబ్బే అదేంలేదండి- అలాంటిది ఏదైనా వుంటే పెళ్ళికి ఒప్పుకునేవాడినే కాదు-" అన్నాడు.

"ఆమాట అని మానెత్తిన పాలుపోశావు ఏంతీసుకుంటావు- కాఫీ తీసుకురానా" అంది.

"కాఫీ ఏంటే నీమొహం భోజనంటైమయితే-" అన్నాడు రుక్మిణీనాథరావు భార్యమీద విసుక్కుంటూ.

శరత్ కంగారుపడి- "లేదులెండి అమ్మ నాకోసం భోజనం చెయ్యకుండా ఎదురుచూస్తూ వుంటుంది. వెళ్ళిపోవాలి- శాలిని ఎలా వుంది?" అన్నాడు.

"అయ్యో... నువ్వొచ్చావనే ఆనందంతో ఆ విషయమే మర్చిపోయాను. వుండు బాబూ

పిలుచుకువస్తాను-" అని సరస్వతమ్మ లోపలికి వెళ్ళింది.

శాలిని అప్పుడే జావతాగి, పోయిట్రీ బుక్ తెరిచి గుండెలమీద పెట్టుకుని, కళ్ళు మూసుకుని చదివిన లెసెన్స్‌ని మననం చేసుకుంటోంది.

సరస్వతమ్మ గబగబవచ్చి- "ఏమే పడుకున్నావా- లే" అంది.

శాలిని కళ్ళు తెరిచింది. "అల్లుడుగారు వచ్చారు- పిలుస్తున్నారు" శాలినికి అర్థంకాలేదు "ఎవరు?"

"అదేనే" అంది ఆవిడ ఇబ్బందిగా అల్లుడుపేరు ఉచ్చరించటానికే మొహమాట పడుతూ.

శాలినికి అర్థమయ్యి గబుక్కున లేచికూర్చుంది. హృదయంలో అదోరకమైన ఉద్విగ్నత?

"ఎక్కడ?"

"హాల్లో" గొంతు తగ్గించి అంది. శాలిని లేచి తడబడుతున్న అడుగుల్తో హాల్లో గుమ్మం దగ్గరకు వెళ్ళి ఆగిపోయింది.

"శరత్-" అనుకుంది అతణ్ని చూడగానే



లోలోపల.

అలికిడికి తలెత్తి- ''శాలిని'' అనుకున్నాడు శరత్.

'ఎలా అయిపోయాడు. బాగా చిక్కిపోయాడు. సింహంలా వుండేవాడు ఎవరూ లొంగదీయలేనంత ధీమాగా. చిక్కిపోయిన ఎలకలా వున్నాడు'' అనుకోగానే ఆమె హృదయం అతనిపట్ల జాలి, దయలతో నిండిపోయాయి.

'తనవల్లనే కదా ఇలా అయిపోయాడు. అనుకోగానే నీరసం, జ్వరతీవ్రత కల్సి- ఆమెను కదిలించాయి. ఆమె కళ్ళునిండి, నీళ్ళు తొణికిన కుండల్లా అయ్యాయి. 'శాలినీ' అంటూ లేచాడు శరత్. అది చూసి- వాళ్ళిద్దరికీ ఏకాంతం కల్పించడానికి రుక్మిణీనాథరావు లోపలకు వెళ్ళిపోయాడు.

'రంగు తగ్గి- వడలిపోయిన పువ్వులా ఎలా పాడయ్యిపోయింది. ఒత్తైన నల్లటి జుట్టు బాగా రాలిపోయింది. గులాబీరంగుబుగ్గలు పీక్కుపోయాయి. తామరల్లాంటి కళ్ళు ఎండాకాలపు బావుల్లా లోతుకువెళ్ళిపోయాయి. కళ్ళకింద నల్లటిచారికలు జాకెట్టు లూజుగా- చేతులు తోటకూరకాడల్లా వ్రేలాడుతూ-' ఎందుకో శాలిని అస్సలు బావుండనట్టు అన్పించింది. మనసులో ఏదో తెలియని అసంతృప్తి ఫీలయ్యాడు. శాలిని దగ్గరగా వచ్చి- 'ఎంతో పాడయిపోయావు శరత్' అంది దయగా.

శరత్ తేలిగ్గా నవ్వి వూరుకున్నాడు. కానీ ఆమెని చూడాలని వచ్చిన వుద్రేకం, వూపు ఇప్పుడు అతనిలో లేవు.

'కట్టు ఇంకా విప్పలేదా?'' అంది భుజాన వున్న సిమ్మెంటుపోత చూస్తూ.

''ఇంకా వారంపడుతుంది-''

''నాక్కూడా... నేనూ కోలుకునేసరికి ఒక వారం పడుతుంది అన్నాడు డాక్టర్-''

అప్పుడు గుర్తొచ్చింది శరత్‌కి శాలినికి జ్వరం- అని తండ్రి చెప్పినట్టు ''ఇంకా జ్వరం తగ్గలేదా?-''

''లేదు... టైఫాయిడ్ కదా. అంత తొందరగా తగ్గదు''

ఇక శరత్‌కిఏంమాట్లాడాలో తెలీలేదు.

శాలిని నెమ్మదిగా- ''ఇంకా ఫైనల్ ఎగ్జామ్స్ రెండునెలలో వున్నాయి. చాలా లెసెన్స్ మిస్ అయ్యాం- బాగా ప్రిపేర్ అవ్వాలి'' అంది.

శరత్‌కి ఎందుకో ఈ మాటలు చిరాకుని కలిగించాయి.

విషయం మార్చుదామని- ''ఇదివరకటిలా మనం కల్సుకోవడానికి ఎవరూ అభ్యంతరం పెట్టరు-'' అన్నాడు.

శాలినికి గతం అంతా గుర్తొచ్చి చిర్నవ్వు నవ్వి- ''అవును-'' అంది.

''టైమ్‌పాస్ బావుంటుంది. సాయంత్రాలు కాసేపయినా వూరంతా చక్కర్లు కొట్టొచ్చు కల్సి మరీ-''

''మనమా?''

''ఏం... మనమే-''

''ఎందుకలా?''

''ఎందుకేవిటి? బావుంటుందిగా-'' విచిత్రపడుతూ అన్నాడు.

''ఏమో- కానీముందు బాగా చదువుకోవాలి. ఇంకా ఎగ్జామ్స్ రెండునెలలే వున్నాయి-'' అంది సాలోచనగా.

శరత్‌కి ఎందుకో తనకు బాగా తెల్సిన- తాను వూహించుకున్న శాలినికాదు ఈ 'శాలిని' అనిపించింది.

ఏవిషయం నుంచి మాటమార్చాలనుకున్నాడో- ఆ విషయం దగ్గరికే, మళ్ళీ విషయం వచ్చింది.

''ఎగ్జామ్స్ ఎలాగైనా రాయొచ్చులే'' నిరసనగా అన్నాడు.

నవ్వి- ''అదికాదుగా బాగారాయాలి'' అంది.

''సరే వస్తా-'' అన్నాడు కదులుతూ.

ఇంకాసేపు వుండమంటుంది అనుకున్నాడు. కానీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోండి.

అని మాత్రం అని వూరుకుంది.

నిరాశగా - ''అలాగేలే వస్తా'' అని కదిలాడు.

రుక్మిణీనాథరావు ఈ మాటవిని- ''వుండు బాబూ- ఇంటివరకూ నేనూ వస్తాను'' అన్నాడు లోపల్నించి వస్తూ.




"అబ్బే ఎందుకండి" మొహమాటంగా అన్నాడు.

"అసలే నీరసంగా వున్నావు. ఒంటరిగా వెళ్ళడం మంచిదికాదు" అన్నాడు ఆయన చెప్పులు తీసుకుంటూ.

శాలిని- "అవును శరత్-" అంది. శరత్ సరే అన్నట్టు తలవూపి కదిలాడు. మనసులో మాత్రం అనంతతృప్తిగా నిట్టూర్చాడు. మరో పదిరోజులకు- మామూలుగా కాలేజీకి వెళ్ళడం. ఆ తర్వాత శరత్ దర్జాగా, బాహాటంగా శాలిని ఇంటికిరావడం మామూలయింది. కానీ ఈసారి రుక్మిణీనాథరావు, సరస్వతమ్మ శరత్ వచ్చీరావడంతోనే- వాళ్ళు చేసే హడావుడి, చూపించే మర్యాదచూస్తే శరత్‌కి ఆశ్చర్యం అనిపిస్తుంది. ఎంత తేడా? అని.

అపుడపుడూ- సెకండ్‌షో సినిమా, ఈవెనింగ్‌షో అని ప్రపోజ్ చేసేవాడు శాలినికి ఎందుకో- ఇప్పుడు కూడా బెరుగ్గా వుంటుంది శరత్‌వెంటవెళ్ళడం. పదిమందీ- వాళ్ళ సంబంధం, కాబోయే భార్యాభర్తల సంబంధం అని చెప్పుకున్నా వెకిలిమాటలు, వ్యంగ్యోక్తులు వెదజల్లుతారని తెల్సు. "బయటకి ఎందుకు? హాయిగా ఇక్కడే కూర్చుని మాట్లాడుకుందాం-" అనేది.

వెంటనే సరస్వతమ్మకి కోపం వచ్చేది కూతురి ధోరణికి "అదేవిటే? అల్లుడుగారు ఎంతో ఇదిగా అడుగుతుంటే వెళ్ళనంటావేమిటి- వెళ్ళు" అని బలవంతంచేసేది. మారిన తల్లిదండ్రుల ధోరణి చూస్తే శాలినికి లోలోపల నవ్వుగా వుండేది.

నిశ్చితార్థ తాంబూలాలు చేసుకున్నాక- మరీనూ- శరత్ వస్తే రాజోపచారాలు జరుగుతున్నాయి. అప్పుడప్పుడూ- ఇద్దరూ కల్సి సాయంత్రాలు పొలాల గట్లవైపుకి, తామరలున్న చెరువుకి వెళ్ళేవారు.

తామరలని శాలిని ఎప్పట్లా ఆప్యాయంగా, అనురాగంగా చూసేది. "ఉండు- తీసుకువస్తాను" అని శరత్ కదలబోతేంటే- ఆమె కంగారుగా- "వద్దు" అంటూ అతని చెయ్యిపట్టుకునేది. ఆమె కంగారు, తన పట్లవున్న ఆర్ద్రత చూసి శరత్ తలవెనక్కి విసిరి హాయిగా నవ్వేవాడు. శరత్ నవ్వు' అంటే శాలినికి చాలా ఇష్టం. ఆ సాయంత్రాలు శరత్ నవ్వులో బ్రహ్మానందంతో నృత్యం చేస్తున్నట్టు అన్పించేది.

కానీ శరత్‌ధోరణి- కొంతవరకు ఆమెకి అర్థంకాలేదు. అతను చదువు విషయంలో సీరియస్‌కాదు. ఫైనలియర్ పూర్తి అవుతున్నా- ఇంకా టెక్స్టుబుక్స్ అతను కొనలేదు. సాయంత్రాలు స్నేహితులతో ఫుట్‌బాల్ ఆడేవాడు. అతను మంచి ఆటగాడని అందరూ చెప్పుకునేవారు. కానీ టోర్నమెంట్సు వస్తే- క్రమశిక్షణతో ప్రాక్టీస్ చేసేవాడుకాదు. ఒకసారి- ఏవో కారణాలు చెప్పి- టోర్నమెంట్సులో పాల్గొనకుండా ఎగ్గొట్టేవాడు.

"ఏవిటిది శరత్? ఎందుకలా?" అంటే "ఏమో నాకు ఇష్టంలేదు. అంతే దాని గురించి ఇక మాట్లాడకు-" అనేవాడు.

అతణ్ని పూర్తిగా అర్థంచేసుకునేలోపల ఫైనలియర్ ఎగ్జామ్సు వచ్చాయి. శాలిని సడలని పట్టుదలతో, పూర్తి ఏకాగ్రతతో పరీక్షలు రాసింది. శరత్ ఏదో రాశానన్నపేరుకు రాసివచ్చాడు. పరీక్షలు అవ్వగానే- తండ్రి దగ్గర ఓ నాలుగువేలు తీసుకుని- స్నేహితులతో సమ్మర్ ఎంజాయ్‌మెంటు అని మద్రాసు, వూటీ, కొడైకెనాల్ టూర్ ప్రోగ్రాం వేసుకుని వెళ్ళిపోయాడు.

అతను తిరిగి వచ్చేసరికి, రిజల్ట్సు వచ్చేశాయి.

రిజల్ట్సు వచ్చిన వారంరోజులకు మార్క్‌షీట్సు వచ్చాయి.

శరత్‌కి తెలుగు తప్ప- మిగతా అన్నీ పేవర్సుపోయాయి.

శాలిని కాలేజ్ ఫస్టు డిస్టింక్షన్‌లో వచ్చింది.

శరత్ తన ఫెయిల్యూర్‌ని సహజంగానే తీసుకుని- "అ(- మళ్ళీరాసి ప్యాస్ కావచ్చులే!" అనుకున్నాడు. కానీ శాలిని కాలేజ్ ఫస్టు వచ్చిందని అందరూ ప్రశంసగా చెప్పుకోవడం- లెక్చరర్స్ స్వయంగా శాలిని ఇంటికివచ్చి 'కంగ్రాట్యులేషన్స్' చెప్పడం ఎందుకో అతనికి నచ్చలేదు. మొదటిసారిగా శాలినిని మళ్ళీ కాలేజీలో చేర్పించడం పొరపాటయ్యిందేమో అనుకున్నాడు.

అలా అనిపించడమే ఏదో అసహజంగా ఫీల్

అయ్యి- "ఛ... తను అలా అనుకోకూడదు. అసలు శాలినికి కాలేజీ ఫస్ట్ రావడం, అందరి కన్నా ఎక్కువ తనకు సంతోషం కలిగించా ల్సిన విషయం!" అని సర్దిపుచ్చుకున్నాడు.

శరత్ ఎగ్జామ్ పోయిందని తెలియగానే శాలిని 'షాక్' తింది. 'చదువంటే శ్రద్ధ లేదు. ఏదో ఆషామాషీగా చదువుతున్నాడు కాబట్టి- మంచి మార్కులతో ప్యాస్ కాకపోవచ్చు అను కుంది గాని ఎగ్జామ్ పోతుంది' అనుకోలేదు. శరత్ గతంలో కూడా టెన్త్ రెండుసార్లు, ఇంటర్ మూడుసార్లు చదివాడని విందిగాని, డిగ్రీ కూడా ఆ పద్ధతిలోనే పూర్తి చేస్తాడని అనుకోలేకపోయింది. ఆమెకి కాలేజీకి వస్తూ క్లాసులు ఎగ్గొట్టే వాళ్ళన్నా కష్టపడి చదవ కుండా పరీక్షలు పోగొట్టుకునేవాళ్ళన్నా అస హ్యం.

ఆమె మానసికంగా శరత్‌గురించి ఇలా డిప్రెస్ అయివుండగా - స్నేహితులు, తెల్సిన వాళ్ళు - "ఏవిటి? నీక్కాబోయే మొగుడు పరీక్ష తన్నేశాడటగా!" అంటుంటే చాలా సిగ్గు అన్పించింది. మొట్టమొదటిసారిగా ఆమెకి శరత్‌మీద కోపం వచ్చింది. కానీ ఆ కోపాన్ని వెంటనే సర్దుకుంటూ - "ఛ... ఈమధ్య జరిగిన ఈ గొడవలతో శరత్ ఎగ్జామ్స్ వైపు అంతగా శ్రద్ధ చూపలేకపోయి వుంటాడు. తను ఈరోజు కాలేజీ ఫస్టు రాగలిగిందంటే- అది శరత్ వలనే- ఆ విషయం తను మర్చిపోకూడదు-" అని సర్దిపెట్టుకుంది.

కానీ ఇప్పుడు మరో సమస్య వచ్చిపడింది. శాలినిలో యూనివర్శిటీలో ఎమ్.ఏ చదవాలనే కోరిక బలంగా వుంది. శరత్ కూడా ప్యాస్ అయితే - ఇద్దరూ కల్సి చదువుకోవడానికి పెద్దవాళ్ళని ఒప్పించవచ్చు - వాళ్ళు అంతగా అభ్యంతరం పెట్టరు అనుకుంది. కానీ ఇప్పు డెలా? ఆమె ఈ సమస్య వెంకట్రామయ్యగారి ద్వారా సానుకూల పరుచుకోవాలనిపించింది.

విషయం తెలియగానే ఒక కిలో స్వీట్సు కొనుక్కుని మరీ కోడలి దగ్గరికి పరిగెత్తుకు వచ్చాడు వెంకట్రామయ్య.

వచ్చీ రావడంతోనే- "నా పరువు నిలబెట్టా వమ్మా. వాడి పరీక్ష ఎలాగూ పోతుందని తెల్సు. ఇద్దరిదీ కలిపి నువ్వే కాలేజీ ఫస్ట్ వచ్చి - ఆ లోటు తీర్చావు-" అన్నాడు.

శాలిని అంటే వెంకట్రామయ్యలో అంతకు ముందు వున్న ప్రేమాభిమానాలు రెట్టింప య్యాయి. ఈ సంఘటనలో తల్లితండ్రి లేని సమయం చూసుకుని-

"మామయ్యా! మీరు నా కోరిక ఒకటి తీర్చాలి-" అంది మెత్తగా. శాలినికి లోలోపల ఆశ్చర్యం! తను - తన ఆశ నెరవేర్చుకోవడానికి ఎంత టాక్ట్ వుపయోగిస్తోందో గమనించి.

"చెప్పమ్మా - ఒకటికాదు. ఎన్నైనా చెప్పు- తీర్చకపోతే, ఈ మావయ్యని నిలవేయి -" అన్నాడాయన.

"నాకు యూనివర్శిటీలో ఎమ్.ఏ చెయ్యాల నుంది మావయ్యా-"

వెంకట్రామయ్య ఆలోచనల్లో పడ్డాడు. చీరో, నగో అడుగుతుందను కున్నాడుగానీ ఇటు వంటి కోరిక వెల్లడిస్తుంది శాలిని అని ఆయన వూహించలేదు.

"నాన్న అమ్మ ఒప్పుకోవడంలేదు. శరత్‌ని ఇంకా అడగలేదు. మీరు చదవమంటే చదవా లనుంది, లేకపోతే లేదు!"

తనకి ఇంత ప్రాముఖ్యత ఇచ్చినందుకు మనసులో పొంగిపోయాడు వెంకట్రామయ్య. వెంటనే - "ఆ గాడిద ఎలానూ ఈ పోయిన పేపర్సు మరో రెండు సంవత్సరాలు దాకా కడుతూవుంటాడు. ఈలోగా నువ్వు ఎమ్.ఏ పూర్తి చేసిరా తల్లీ-" అన్నాడు ఆప్యాయంగా-

లోపల్నుంచి తన్నుకొస్తున్న ఆనందాన్ని వుత్సాహాన్ని అదిమి పెట్టుకుంటూ- "వైజాగ్‌లో అయితే తెల్సినవాళ్ళు ఎవరూ లేరు. హాస్టల్లో వుండాలి. మద్రాసు అయితే పిన్ని దగ్గరవుండి చదువుకోవచ్చు-" అంది.

"బేషుగ్గా- నీకు ఎలా బావుంటుందనిపిస్తే అలా చెయ్యమ్మా-"

"కానీ, నేను అడిగినట్లు కాకుండా - మీరే నన్ను పంపిస్తున్నట్లు - అందరికీ చెప్పాలి"

★ ★ ★

ఇద్దరూ మవునంగా నడుస్తున్నారు. శరత్ మనసంతా చేదు కెలికినట్టుగా వుంది. తనలో తను ఎంత సర్దిచెప్పుకోవడానికి ప్రయత్నిస్తు




న్నా. ఎందుకో అకారణంగా శాలినిమీద అయిష్టం కలగడమే కాకుండా ఆమె పక్కన వుండటమే అసహనంగా, భరించలేనిదిగా వుంది. ఎందుకిలా అన్పిస్తోందో అతనికి సరిగ్గా అర్థంకావడంలేదు.

శాలిని విపరీతంగా ఆలోచిస్తోంది. విషయం ఎలా చెప్పాలా అని. ఏమాత్రం శరత్ తన ఇంట్రస్టుకి వ్యతిరేకంగా రియాక్ట్ అయినా తన మార్గం క్లోజ్. గమ్యం అగమ్యమవుతుంది. ఆమెలో కూడా తన జీవితానికి సంబంధించిన ఒక ముఖ్యవిషయంలో ఫైనల్ జడ్జిమెంట్ ఇవ్వడం అసహనంగా వుంది. కానీ మరుక్షణం అనిపించింది. తల్లిదండ్రులకన్నా శరత్ బెటరు అని. కానీ ఏమంటారా అని ఆలోచించే కొలదీ గుండె గుబులుగా వుంది.

శరత్ ఏదైనా మాట్లాడటం మొదలుపెడితే తాను అసలు విషయం చెప్పొచ్చునని ఆమెకి. శాలిని ఏదైనా మాట్లాడితే ఈ 'బోరు' పోతుందని అతనికి- అప్పటికి పావుగంటపైగా ఎవరి ఆలోచనల్లో వాళ్ళుండిపోయి అలా పొలాలగట్ల వెంబడి నడుస్తున్నారు.

ఎదురుగా శరత్‌కి తెల్సిన పాలేరు వస్తున్నాడు. శరత్-శాలినీలను చూస్తూనే వాడు మొకమంతా నవ్వు చేసుకుని -"ఏం చిన్నయ్యా- అప్పుడే చిన్నమ్మని వెంటేసుకుని షికార్లు కొట్టేస్తున్నారు. ఆ కాస్త కానిచ్చేశారా లేక మనువు వరకూ ఆగుతారా-" అన్నాడు.

వాడి దృష్టిలో 'ఆకాస్త' అనేదానికి ఏం అర్థమో గ్రహించి శాలిని ముడుచుకుపోయింది. మొహం లజ్జాభారంతో ఎర్రబారింది.

శరత్ సరదాగా నవ్వేసి- 'నీమొహం- పోరా- పోయి నీపన్చూసుకో' అన్నాడు.

"పోతాలెండి... మీరూ మీపన్జూసుకోండి-" అని ఇకిలించుకుంటూ వెళ్ళిపోయాడు.

ఊరంతా వాళ్ళిద్దర్నీ భార్యాభర్తల్లా ట్రీట్ చేస్తున్నారని ఇద్దరికీ తెల్సు. కానీ వాళ్ళు అలా మాట్లాడితే- శాలినికి ఏదోలా వుంటుంది శరత్ మాత్రం ఆ మాటలని ఎంజాయ్ చేస్తాడు. అదే ఆమెకు అర్థంకాదు. బహుశా పురుష మనస్తత్వం అలా వుంటుందేమో అని సర్దిపెట్టుకుంటూ వుంటుంది. ఇటువంటి సంఘటనలు జరిగినప్పుడు.

శరత్ తనలోతను ఏదో ఊహించుకుని నవ్వుకుంటూనే- పక్కకి తిరిగి శాలిని ఎర్రబారిన మోము చూడగానే, తమకం ఆపుకోలేక, మోహంతో దగ్గరకు తీసుకుని ముచ్చటగా బుగ్గలమీద ముద్దుపెట్టుకున్నాడు.

శాలిని అతడ్ని తోసేసి, మరింత సిగ్గుపడుతూ "ఛీ, వుండండి" అంది.

అతను చిలిపిగా 'ఏం' అన్నాడు. అతనిలో ఇంతకుమునుపు మనసులో వున్న అసహనం, చిరాకు మాయమయ్యి హుషారు వచ్చింది.

శాలిని కొంచెం నిశ్శబ్దం తర్వాత- "నాకు చాలా బాధనిపించింది" అంది.

శరత్‌కి అర్థంకాక అయోమయంలో 'ఏంటి? ఏమయ్యింది?" అన్నాడు.

"మీ విషయమే"

"నా విషయమా? శాలినీ! నీకు బాధ కలిగించే పని నేనేం చేశాను. నీకు తెల్సి నేను అటువంటిది ఏమీ చెయ్యలేదే?"

"మీ పరీక్ష పోయిందంటే నాకు ఎంత బాధగా వుందో తెల్సా?"

శరత్ మనసు చివుక్కుమంది.

"ఎంత - వచ్చే సంవత్సరం పూర్తి చేసేస్తాగా - నీ కోసం" అని చిరునవ్వు నవ్వాడు.

శాలినికి ఓ పత్రికల్లో చదివిన నిజ జీవిత సంఘటన ఒకటి గుర్తొచ్చింది. 'హైస్కూల్‌లో ఒకబ్బాయి ఏవరేజ్ స్టూడెంట్. ఆ క్లాసులోనే చదువుతున్న టాప్ ఇంటిలిజెంట్ - ఇంగ్లీషు, మాథమేటిక్స్‌లో చాలా షార్ప్ అయిన అమ్మాయి వుండేది. ఆ అమ్మాయి తెలివితేటల్ని చలాకీదనాన్ని చూసి ప్రేమించేసి - ఆ అమ్మాయి ప్రేమని పొందడం ఎలా - ఆ అమ్మాయి తనని గుర్తించేలా చెయ్యడం ఎలా - తను ఏంచేస్తే ఆ అమ్మాయికి నచ్చుతుంది అని ఆలోచించి - ఆ అబ్బాయి విపరీతంగా ఇంగ్లీషు, మాథ్స్‌లో కృషిచేసి ఐ.క్యూ పెంచుకుని - క్లాసు ఫస్టు, స్కూలు ఫస్టు, స్టేట్ ఫస్టు వచ్చాడు. ఆ అమ్మాయి కూడా అతడ్ని అతడి తెలివితేటల్ని గుర్తించి, అబ్బురపడి - అభిమానించి - అభినందించింది. అబ్బాయి కొండెక్కినంత ఆనందపడి - ఇంకా ఇంకా డీప్‌గా

చదువుతూ - పుస్తకాల పురుగు అయ్యిపోయాడు. కేవలం ఆ అమ్మాయి ఎప్రిషియేషన్ కోసం. అమ్మాయికి ఫుట్‌బాల్ ఆట అంటే ప్రాణం. ఆ ఆట సూపర్బ్‌గా ఆడే స్టేట్ ప్లేయర్ని- చదువులో జీరో అయిన మరో అబ్బాయిని ప్రేమించి అటు తర్వాత అతడ్ని చేసుకుంది. ఈ అబ్బాయికి ఆ విషయం తెల్సి - క్రుంగిపోయినా - అప్పటికే చదువుకి ఎడిక్ట్ అవ్వడంవలన - ఇంగ్లీషుభాషపై ఎమ్.ఎ పి.హెచ్.డి., డాక్టరేట్ అయ్యి లింగ్విస్టిక్స్ అథారిటీ అవుతాడు. కానీ అమ్మాయిని 'మిస్' అవుతాడు. అమ్మాయిని చిర్నవ్వు - కన్నీటి చుక్క మధ్య తలుచుకుని, నవ్వుకుంటూ ఉంటాడు అప్పుడప్పుడు.

మనకు ప్రేమ వున్న వ్యక్తికోసం. మన స్వరూప స్వభావాల్నే ఆ వ్యక్తి కోసం మార్చుకోవడం ఎంత బావుంటుంది. అది ఎంతో గొప్ప విషయం, అనిపించి శాలిని పెదవులపై వాలుగా చిర్నవ్వు కురిసింది.

"నాకా నమ్మకం వుంది శరత్. అసలు ఈసారి మీరు ఫస్ట్ క్లాసులో పాస్ అవుతారేమో కూడా-" అంది.

శరత్ శాలిని మాటలకి తెల్లబోయినా - తనమీద ఆమె పెట్టుకున్న నమ్మకానికి చిర్నవ్వు నవ్వాడు.

"మీరు అవునంటే నా కోరిక ఒకటి తీరుతుంది" అంది నెమ్మదిగా.

శరత్ హుషారుగా- "చెప్పు" అన్నాడు.

"అవును అనాలి... అంటారు కదూ"

శరత్ నవ్వేస్తూ- "సరే... అవును! చెప్పు"

"విషయం వినకుండానే 'అవును' అంటే-"

"విషయం విన్నాక ఎలాగూ నీకోసం అవును అంటాను. కాబట్టి ముందే చెప్పాను-"

శాలిని కొంచెం తృప్తిపడి- "నాకు ఎమ్.ఎ చదవాలని వుంది" అంది.

పక్కనే ఏదో బాంబుపడినట్లు అదిరిపోలేదు కానీ - చిన్నగా నిరాశ పడ్డాడు- 'ఇంతకీ శాలిని కోరిక ఇదా అని-'

శరత్ మవునం చూసి గబుక్కున- "ప్లీజ్ కాదనకండి. చిన్నప్పటినుంచీ నాకు ఎమ్.ఎ చదవాలని కోరిక. మీ ఇష్టాఇష్టాలమీదే అది ఆధారపడి వుంది-" అంది చిన్నగా.

శరత్‌కి తమ గొడవవలన ఆల్‌మోస్ట్ శాలిని చదువు డిగ్రీ మధ్యలో ఆగిపోవడం గుర్తొచ్చింది. శాలిని అమాయకమైన మొహం చూస్తూ - ఆమె ఏంగ్జయిటీ చూసి- "సరే" అన్నాడు.

శాలిని ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అవుతూ - అతడి చెయ్యి నొక్కిపట్టి చిన్న ముద్దు పెట్టుకుని నవ్వింది.

శరత్ నవ్వుతూ- " ఎక్కడ చదువుదామని?" అన్నాడు.

"మద్రాసు యూనివర్శిటీలో"

"అక్కడెందుకు- మరీ దూరం"

"ఆంధ్రాగానీ, ఉస్మానియా ఆర్ వెంకటేశ్వర అయినా - హాస్టల్స్‌లో వుండాలి. మద్రాసులో అయితే మా పిన్ని బాబాయి వున్నారు. చక్కగా వాళ్ళింట్లో వుండి చదువుకోవచ్చు. అయినా మీరు చెప్పండి హాస్టల్స్‌లో వుండి చదవమంటే - అలాగే చదువుతాను-"

శరత్‌కి కూడా 'హాస్టల్' అనే పాయింట్ నచ్చలేదు.

"లేదులే-మీ పిన్ని- బాబాయి ఇంట్లో ఉండి చదువుకోవడం సేఫ్" అన్నాడు.

"థాంక్స్ శరత్"

"ఇంత హుషారు పడుతున్నావు కానీ ఒక సంవత్సరం చదవగానే నీకే బోరు కొడుతుంది"

శాలిని అనుమానంగా చూస్తూ-"ఎందుకు?"అంది.

"ఏముంది... పెళ్ళిచేసుకుని-హాయిగా సంసారం చేసుకోక ఎందుకీ చదువులు, పుస్తకాలు, పరీక్షలు అనుకుంటావు"

శాలిని శరత్ అమాయకతకు నవ్వుకుని- మొదటిసారిగా శరత్‌కి తను అర్థంకాలేదు అని మాత్రం అనుకుంది.

"అప్పుడు చూద్దాంలే శరత్. కానీ నేను చదువుతాను అంటే మా అమ్మ నాన్నలు ఒప్పుకోరు. నువ్వే ఒప్పించాలి"

"దానిదేముంది... నేను చెబుతాలే. నువ్వు

ఎమ్.ఏ చదువుతున్నావు. సరేనా'' అన్నాడు.

శాలినికి ఆనందంతో నోటమాట రాలేదు. తను అనుకున్నది సాధించబోతోంది అనే హుషారు మనసును ఉక్కిరి బిక్కిరి చేస్తోంది.

శాలిని అంత ఆనందపడటానికి సరైన కారణం అర్థంకాక శరత్ ఆమెకేసి వింతగా చూస్తూ ''పిచ్చిపిల్ల. ఈ హుషారు జాయిన్ అయిన రెండునెలల వరకు ఉన్నా గొప్పే'' అనుకున్నాడు.

అలా సరస్వతమ్మకి, రుక్మిణీనాథరావుకి ఇష్టంలేకపోయినా-శరత్, వెంకట్రామయ్యల వలన శాలిని మద్రాసు యూనివర్సిటీలో ఎమ్.ఏ ఇంగ్లీషు లిట్‌లో జాయిన్ అయింది.



''గ్రీకు సౌందర్యాధి దేవతలైన -అఫ్రొడైటీ, లన్‌ఫోరిసిన్, దలియా కలిసి-కదిలి వస్తున్న సోయగంలా ఉందికదూ మన శాలిని''

యూనివర్సిటీ బిల్డింగ్ ముందు చెట్ల నీడ కింద నిల్చున్న ఎమ్.ఏ ఇంగ్లీషు లిట్ గ్రూపు స్టూడెంట్స్‌లోని శారద అంది.

శాలిని చేతిలో ఉన్న ఖలీల్‌జిబ్రాన్ కవితల పుస్తకం తిరగేస్తూ నెమ్మదిగా నడుచుకుంటూ వాళ్ళవైపు వచ్చింది.

''నీ సౌందర్యానికి అద్భుతమైన పోలిక ఇచ్చింది ఇప్పుడే శారద'' అంది శ్రీదేవి చిర్నవ్వుతో.

శాలిని నవ్వి—''థ్యాంక్స్'' అంది శారద వైపు తిరిగి.

''నేను ఏంఅన్నానో వినకుండానే థ్యాంక్స్ చెప్పేశావు. నేను చాలా డిజప్పాయింట్ అయిపోయా''

''నీ వాచాలత మరోసారి రుజువు చేసుకొనే అవకాశం దొరకలేదనా'' కొంటెగా అడిగింది శ్రీదేవి.

''నిన్ను మెచ్చుకోలేదని ఈర్ష్యతో అలా మాట్లాడుతున్నావు'' సవాలు విసురుతున్న ధోరణిలో అంది శారద.

''మీరు దెబ్బలాడుకోవాలనుకుంటే వేరే ఏ విషయం మీదైనా దెబ్బలాడుకోండి. మధ్యలో నన్ను పెట్టి వాదించుకోవద్దు''

శారద నవ్వింది-నవ్వి-''ఎన్నికబుర్లైనా చెబ్తావు. ఏ రాజకుమారుడో వచ్చి ఎత్తుకుపోయే వరకు''

శాలిని నవ్వి ''ఆ అవకాశంలేదులే''

''అదేం?!''

''నేను ఆల్‌రెడీ బుక్ అయిపోయాను-''

''అంటే- ?''

''ఆల్‌రెడీ ఒక రాజకుమారుడికి కాబోయే భార్యగా బుక్ అయిపోయా- ''

''ఎవరా రాజకుమారుడు... ఏమాకథ?''

''శరత్ అని- '' పుస్తకాలమధ్యనున్న శరత్ ఫొటో చూపించింది.

అందరూ ఆతృతగా ఫొటోమీద పడిపడి చూసి సంతృప్తిచెందారు.

ఫొటోలోని శరత్ అందచందాల్ని జడ్జ్‌చేస్తూ- ''నిజంగానే రాజకుమారుడిలా వున్నాడే'' అన్నారు అందరూ ఏకగ్రీవంగా.

''పాపం! ఈ విషయం మన యూనివర్శిటీ కుర్రవాళ్ళకి తెలీక- ఎంతమంది హృదయాలు పారేసుకున్నారో...''

''ఈ విషయం తెలిస్తే పారేసిన తమతమ హృదయాల్ని ఏరుకుంటారులే...''

నవ్వులు.

హఠాత్తుగా శారద అంది- ''లైబ్రరీహాల్‌లో ఏదో సెమినార్ వుందట, సైకాలజీ స్టూడెంట్సుది- పోదామా?''

శ్రీదేవి- ''అబ్బ! సైకాలజీవాళ్ళ సెమినార్‌కి మనమెందుకే! బోర్'' అంది.

శాలిని కుతూహలం చూపిస్తూ- ''వెళదాం-'' అంది.

అప్పటికే యూనివర్సిటీ హాల్ స్టూడెంట్స్‌తో నిండిపోయివుంది. డయస్‌మీదకి - తెల్లగా, సున్నితంగా, ఆడపిల్లలా నాజూగ్గావుండే ఒక బ్బాయి వచ్చాడు. అతణ్ణి చూడగానే శాలినికి తమాషా అనిపించింది. అతనేం మాట్లాడగల డు అనుకున్న మరుక్షణంలో-

చిన్నచిర్నవ్వుతో మృదువుగా మాట్లాడటం ప్రారంభించిన అతణ్ణిచూడగానే- జిడ్డు కృష్ణ మూర్తి, ఆయన డిస్‌కోర్సెస్ జ్ఞాపకంవచ్చాయి.

"నీకు తేనెకావాలంటే- తేనెపట్టును కొట్టి తేనెటీగలను రెచ్చగొట్టవద్దు- వదునుకువచ్చిన తేనెపట్టునుంచి- తేనెటీగలను విడగొట్టి తేనెను పిండుకునే సున్నితమైన మార్గం ఒకటివుంది- అంటూ మొదలైన స్పీచ్-

నువ్వు జీవితంలో సాధారణంగా ఏవేం పొందాలని కోరుకుంటావు.

ఆరోగ్యం

శుభ్రమైనతిండి

కంటినిండా నిద్ర

చేతినిండా డబ్బు

సెక్స్

కుటుంబజీవితం- పిల్లల జీవితాలు బావుండాలని

నీకంటూ సమాజంలో ప్రాముఖ్యత, గుర్తింపు కోరుకోవడం-

జీవితంలో వీటన్నిటినీ సాధించడానికి ఒక నిర్దుష్టమైన ప్లాన్, డిసిప్లిన్ వుండాలి.

ముఖ్యంగా ఆఖరిపాయింటు సాధించాలంటే అంతసులభమూకాదు- అంతకష్టమూకాదు.

ఉదాహరణకు మద్రాసులో ఒక నటుడు వుంటాడు. సాధారణంగా అతనిచుట్టూ- పది మంది నటులు వుంటారు. కాబట్టి ఆ నటుడి గ్లామర్, హోదా ప్రత్యేకంగా గుర్తించబడదు. అదే ఆంధ్రావెళ్ళి- ఏదైనా మీటింగ్‌లో పాల్గొంటే, అక్కడి రెస్పాన్సువేరు. అలాగే నాయకులు, రచయితలు, నృత్యకళాకారులు- వీళ్ళందరిలో కామన్‌గావుండే కళాతృష్ణ- డిగ్రీలతేడా, ప్రతిభవిషయంలో తేడావుండొచ్చు. కానీ అందరిలో ఒకే కామన్ ఫాక్టర్ వుండటంవలన- ఒకవ్యక్తి విడిగా, ప్రత్యేకంగా తెలీడు... తెలిసిరాడు.

కళాకారుల విషయంలోనే అలా వున్నప్పుడు- ఇక సామాన్యుల విషయంలోకి వస్తే ఎలావుంటుందో మీరు వూహించవచ్చు.

అందరిలోనూ- వేరుగా- ప్రముఖంగా కన్పిస్తూ- అందరిచేత ఆదరింపబడి- ప్రేమించబడాలంటే- ముందు మీరు- మీచుట్టుపక్కలవాళ్ళని టేకెన్ ఫర్ గ్రాంటెడ్‌గా కాకుండా డిఫరెంట్‌గా ప్రేమగా, ప్రత్యేకంగా చూడటం నేర్చుకోవాలి.

చిన్నచిర్నవ్వు-మీ పెదవులపై వెలిసిన చిర్నవ్వు-అవతలి వ్యక్తుల హృదయాల్లో పలికేలా సహజంగా ఉండాలి. అసహజంగా... అబ్బ వీడెందుకు అస్తమానం ఇకిలిస్తున్నాడురా- అనేలా కాకుండా, ఆప్యాయంగా పలకరించడం—ఆ పలకరింపు అవతలివ్యక్తి మళ్ళీ మళ్ళీ వినాలకునేలా ఉండాలి కాని- అబ్బ... వీడు సుత్తికొడతాడురా అనేలా ఉండకూడదు.

బ్యాంకుకి వెళతాడు. కౌంటర్‌లో క్యాష్ కట్టి వెళ్ళిపోతారు- కాషియర్ మొహం కూడా చూడకుండా మళ్ళీ కన్పిస్తే గుర్తుపట్టలేని స్థితిలో. పోస్టాఫీసుకు వెళతారు- స్టాంప్సు-కవర్లు తీసుకుంటారు-ఆ క్లర్కు ఎవరో మీకు తెలీనే తెలీదు. అలాగే డిపార్ట్‌మెంటు స్టోర్సుకు వెళతారు- అక్కడా మేటర్ ఆఫ్ ఫాక్ట్‌గా ఉంటారు. అలాగే ఉండండి... కానీ డబ్బు చెల్లించేటప్పుడు వాళ్ళ దగ్గర్నుంచి వస్తువులు అందుకునేటప్పుడు-చిన్న చిర్నవ్వుతో-'థాంక్స్' అంటే మీరు నష్టపోయేది లేదు. కానీ ఆ 'చిర్నవ్వు'-'కృతజ్ఞత-' మిమ్మల్ని వందలాది కస్టమర్స్‌లో విడిగా ప్రముఖంగా నిలబెడుతుంది. మీరు మరోసారి తమ దగ్గరకు వచ్చి-తమ సర్వీసులు అందుకోవాలని వాళ్ళు ఆశిస్తారు. మిమ్మల్ని అల్లంతదూరంలోనే గుర్తుపట్టి నవ్వి-ఆదరంగా ఆహ్వానిస్తారు—"

అలా అతను అరగంటపైన మాట్లాడాడు ధారాళంగా- సింపుల్ ఇంగ్లీషులో. జీవితానికి ఉపయోగించేవి ఎంతో అద్భుతంగా, సింపుల్‌గా చెప్పాడు అన్పించింది శాలినికి.

తర్వాత ఇద్దరు ముగ్గురు మాట్లాడారు కాని ఇంత గొప్పగా మాట్లాడలేకపోయారు వాళ్ళు.

సెమినార్ అయ్యేసరికి రాత్రి ఎనిమిది దాటింది.

యూనివర్సిటీ బస్‌స్టాండ్‌లో నిల్చున్నారు. అప్పటికే శారద వెళ్లిపోయింది. శాలిని నిల్చుని బస్సుకోసం అటు ఇటు చూస్తూ-అతణ్ణి చూసింది. అప్రయత్నంగా పలకరింపుగా నవ్వింది. అతనూ ఆమె ఎవరో తెలీకుండా ఆమె నవ్వుని ఆప్యాయంగా అందుకుని-చిర్నవ్వు నవ్వాడు.

"మీరు ఎంతో బాగా ఎన్నో విషయాలు చెప్పారు. నాకు ఇంకా మీనుంచి ఎంతో తెల్సుకోవాల్సింది ఉందన్పిస్తోంది—"

"తప్పకుండా. థాంక్స్ ఫర్ యువర్ కాంప్లిమెంట్స్-"సున్నితంగా అన్నాడు.

అమ్మాయిలు అతని దగ్గర్నుంచి ముందు సున్నితంగా ఉండటం నేర్చుకోవచ్చు అనిపించింది శాలినికి.

"నాపేరు శాలిని. ఫస్టుఇయిర్ ఎమ్.ఏ లిట్—"

"నేను వసంత్-ఫైనల్ ఎమ్.ఏ సైకాలజీ"

"మీరు చాలా బాగా చెప్పారు. నిజంగా సైకాలజీలో నిజజీవితానికి ఉపయోగించే ఇంత గొప్పవిషయాలు ఉన్నాయా—"

"సైకాలజీ అంటే మనుషులకు సంబంధించిన మానసిక శాస్త్రం. సైన్సు-ఇంజనీరింగ్ టెక్నాలజీ-సైకాలజీ-తెల్సుకున్న వ్యక్తి-మిగతావాళ్ళను మించి హాయిగా, సౌఖ్యంగా, తృప్తిగా జీవించగలడని నా అభిప్రాయం-"

"సైన్స్‌లో డార్విన్ సూత్రాలు, ఎవల్యూషన్ ఇంజనీరింగ్ టెక్నాలజీలో మనం రోజూ ఉపయోగించే గాడ్జెట్స్‌విలువ-అవి పనిచేసేతీరు-సైకాలజీలో మనిషి మానసిక ప్రవర్తన-అలవాట్లు-ఇవన్నీ తెల్సున్న మనిషి నిజంగానే ఈ జీవిత పరుగుపందెంలో మిగతావాళ్ళని అధిగమించి నిలవగలడని నా నమ్మకం.సర్వైవల్ ఆఫ్ ది ఫిట్టెస్ట్ ఫాక్టర్ ఇక్కడ పనిచేస్తుంది"

"నాకు నిజంగా ఆశ్చర్యంగా వుంది- సైకాలజీ వ్యక్తి అంటే ఏమిటో చెబుతుంది అనుకున్నా కానీ - వ్యక్తి లోని దురలవాట్లని మార్చి వ్యక్తిత్వాన్ని అభివృద్ధి చేస్తుందనుకోలేదు"

వసంత్ నవ్వాడు. నవ్వి - "ఉదాహరణ నేనే. నేను మొదట్నుంచీ మిగతావాళ్ళకన్నా విరుద్ధంగా వుండేవాణ్ని. పదిమందిలో సరిగ్గా మాట్లాడలేకపోయేవాణ్ణి. రోడ్డుమీద తలెత్తుకుని ధీమాగా నడవలేకపోయేవాణ్ణి. కాంప్లెక్స్, నేను తెలివైనవాణ్నని- ఎబోవ్ ఏవరేజ్ స్టూడెంట్‌ని అని నాకు తెల్సు. కానీ పరీక్షల్లో అత్తెసరు మార్కులు వచ్చేవి. క్లాసులో లాస్ట్ నుంచి రెండో బెంచిలో కూర్చునేవాణ్ణి. లాస్ట్ బెంచీలో కూర్చోవాలన్నా భయమే- పర్టిక్యులర్‌గా కన్పించి పోతానేమోనని. అందరిలో ఒకడుగా వుండిపోవాలని ప్రత్యేకంగా కన్పించకూడదని ప్రయత్నించేవాణ్ణి. కానీ నాలోలోపల, నాస్టుపిడ్ ప్రవర్తనకి విసుగ్గా వుండేది. అప్పుడే సైకాలజీకి సంబంధించిన ఆర్టికల్స్ చదవడం జరిగింది. దాంతో ఇంట్రస్టుకలిగి - ఫ్రాయిడ్, జంగ్, ఎరిక్‌బెర్నీ థామస్ ఏ హారిస్, నెపోలియన్ హిల్, డేల్‌కార్నిజ్- వీళ్ళందర్నీ చదువుకున్నా- చదువుతున్న బి.ఎ ఎకనామిక్స్ సెకండియర్ డిస్‌కంటిన్యూ చేసి సైకాలజీ సబ్జక్ట్‌గా - బి.ఎ చేశాను. హైయ్యస్ట్‌గ్రేడ్స్‌తో కాలేజ్ ఫస్టు వచ్చా. యూనివర్సిటీలో నాకు సబ్జక్ట్‌లో వున్న గ్రిప్‌కు ఆల్‌రెడీ ప్రొఫెసర్స్‌లో ప్రత్యేకమైన గుర్తింపు తెచ్చుకున్నా.

"ఒకప్పుడు పదిమందిలో మాట్లాడలేని నేను ఈ రోజు మాట్లాడుతుంటే - వినడానికి వందలమంది స్టూడెంట్స్ వస్తున్నారు-" అని కాస్సేపు నిశ్శబ్దంగా వుండి - నవ్వాడు.

నవ్వి "సెల్ఫ్ ఎడ్యుకేషన్ ద్వారా నాలోని మైనస్‌పాయింట్స్‌ని ప్లస్‌పాయింట్స్‌గా మార్చుకున్నాను. నేను నేనంటే ఒకప్పుడు విసుక్కున్న వాణ్ణి - ఈరోజు నన్ను నేను ప్రేమించుకుంటున్నవాణ్ణి. అది అందరివల్లా సాధ్యంకాదు. ముఖ్యంగా - మన యువకులు సెల్ఫ్‌పిటీతో బాధపడుతున్నవాళ్ళు-" అని మళ్ళీ చిర్నవ్వు-

వసంత్ మంద్రస్థాయిలో - చిన్న చిర్నవ్వుతో - అలా చెబ్తుంటే - అతనంటే ఒకరకమైన ఆరాధన ఆమెలో ప్రారంభమయింది. నెగెటివ్ ఏటిట్యూడ్‌తో జీవితం అంటే ఏమిటో తెలీకుండా, ఏదో రకంగా జీవిస్తూ, మొక్కుబడిగా పరీక్షలు రాసేసి, లంచాలు ఇచ్చేసి వుద్యోగాలు సంపాదించుకోవచ్చునని అనుకుంటూ, కష్టపడకుండా, డిగ్నిటీ ఆఫ్ లేబర్ గురించి కనీసం ఒక్క నిముషమైనా ఆలోచించకుండా, వైట్‌కాలర్ జాబ్స్ కోసం కొంగజపం చేస్తూ- అది రాలేదని ఏర్రైలుకింద తలపెట్టి ఆత్మహత్యచేసుకుంటూ సమాజం నుంచి జాలిని మాత్రం తమ బలవంతపు చావులు ద్వారా సాధించుకునే - నీర్సంగా - నిస్సత్తువుగా - చప్పబడిపోయిన యువతరంలో - 'వసంత్' నూతనంగా కనిపించాడు శాలినికి.

★ ★ ★

మరో ఎనిమిది నెలలు గడిచాయి.

డిగ్రీ రిజల్ట్సు వచ్చాయి. శరత్ - రాసిన ఒక్కసబ్జక్టూ పాస్ కాలేదు. అబ్బే... మనకు చదువు అబ్బదు- అని బుక్సు ఒక మూలపడేసి, తనస్నేహితుడు గోపాల్‌తో వీడియో - ఆడియో క్యాసెట్స్ షాపు పెట్టాడు.

ఈ జీవితం అతనికి హాయిగావుంది.

చక్కగా షాప్ మెయిన్‌టెనెన్స్- సేల్సు చూడటానికి గోపాల్ వున్నాడు- కాసెట్స్ అందించడానికి నమ్మకమైన సప్లయిర్స్ వున్నారు. హాయిగా కాలక్షేపం చెయ్యడానికి - తన ఖర్చుగా నెలకు వెయ్యిరూపాయలు వస్తున్నాయి. వచ్చినసినిమాలు, మెచ్చినపాటలు - షాప్‌లో కూర్చునే చూడొచ్చు, వినొచ్చు. ఈ జీవితం బావుంది అనిపించింది శరత్‌కి.

శాలినిని చూసి అప్పుడే రెండు నెలలవుతోంది అనుకుని మద్రాసు బయల్దేరాడు.

★ ★ ★

శాలిని క్లాసెస్ అయ్యివచ్చే వరకు - యూనివర్సిటీ బస్టాండ్‌లో రైలింగ్ మీద కూర్చుని వున్నాడు శరత్-

శాలినిని చూస్తూనే నవ్వుతూ - ఎదురెళ్ళాడు.

అతను పొద్దుటే సర్కారుకు వచ్చాడు. సాయంత్రం యూనివర్శిటీకి వస్తానని అన్నాడు కాబట్టి శరత్‌ని చూసి శాలిని అంతగా ఆశ్చర్యపోలేదు.

ఇద్దరూ రోడ్డుదాటి సముద్రం వైపు నడుస్తున్నారు.

"అందరూ బావున్నారా?"

"ఓ... బ్రహ్మాండంగా. అమ్మా నాన్న నిన్ను అడిగినట్టు చెప్పమన్నారు. నాన్నగారు కోడలిచేతివంట రుచి ఎప్పుడు చూస్తాను అంటున్నారు" అని నవ్వాడు.

ఎందుకో ఈ మాట శాలినికి రుచించలేదు. తనని తాను ఎక్కువగా చదువుతో - రీసెర్చితో- ఐడెంటిఫై చేసుకోవడం వలన - 'వంట' పేరు తనతో కలపడం తనకి నచ్చి వుండకపోవచ్చు బహుశా అదే మావగారు - కోడలి నోటి నుంచి వరడ్స్ వర్త్, కీట్సు కవితలు వినాలనుకుంటున్నారు అని తెలిస్తే బ్రహ్మాండంగా ఆనందించి వుండేది తాను. తన ఆలోచనకి తనలో తనకి నవ్వు కదిలింది.

"ఏవిటి మాట్లాడవు?" మౌనంగా వున్న శాలినిని చూసి రెట్టించి అడిగాడు.

"డిగ్రీ ఏమయింది అని రాస్తే జవాబు ఇవ్వలేదేం?"

"ఇవ్వలేదంటేనే అర్థం చేసుకోవాలి పోయిందని" తేలిగ్గా అన్నాడు.

"మళ్ళీనా?"

"ఆఁ... మళ్ళీ కడితే మళ్ళీ పోవడం కూడా గ్యారంటీ-"

శాలినికి చిన్నగా కోపం వచ్చింది- "అంత తేలిగ్గా విషయం తీసుకుంటే ఎలా? మీకసలు చదువు మీద శ్రద్ధలేదు"

శరత్ భుజాలు కదిపి, చుట్టూరా వున్న జనాన్ని చూస్తున్నాడు.

"కూర్చుందామా?" అంది శాలిని చేతిలో వున్న పుస్తకాల్ని చూసుకుంటూ. ఇవంటే తనకు ఎందుకు ఇంతపిచ్చి, చదువంటే ఎందుకు అంత పిచ్చిప్రేమ అనుకుంది.

జనానికి దూరంగా - ఒక పల్లెపడవ పక్కగా ఇద్దరూ కూర్చున్నారు.

"మరేం చేస్తున్నారు"

"నేను, గోపాల్ సైట్ అండ్ సౌండ్ అని వీడియో ఆడియో షాప్ పెట్టాం. నావాటాకి ఖర్చులన్నీపోను నెలకు ఒక వెయ్యి వస్తోంది. దాంతో జల్సా"

"అదెలా?"

"అవును- అన్నీ గోపాల్ చూసుకుంటాడు. నేను వూరికే సర్దాగా అలా వచ్చి చూసి వెళ్ళిపోతూవుంటాను-"

"మరి... మిగతా సమయం అంతా ఏం చేస్తారు?"

"తినడం... పడుకోవడం.. సాయంత్రం పుట్‌బాల్ ఆడుకోవడం... ఎనిమిది దాటాక ఏ ఇంగ్లీషు సినిమాయో వీడియో డెక్‌లో చూడటం... తొమ్మిది దాటాక - ఎవడన్నా పార్టీ - సాధారణంగా ఇస్తూవుంటారులే - ఇస్తే... అర్ధరాత్రి రెండు వరకూ ఎంజాయ్ చెయ్యడం- జీవితం ఎంతో బావుంది... జాలీగా హాయిగా..."

ఈ యిరవైఏడేళ్ళ యువకుడి జీవితంపట్ల తేలికధోరణి చూసి శాలిని నివ్వెరపోయింది. అసంతృప్తి ఫీల్ అయింది. అప్రయత్నంగా వసంత్ జ్ఞాపకం వచ్చాడు. అతను మాట్లాడుతుంటే - తనకి కూడా ఎంతో హుషారు, ఏదో




# ఆకారంలో పెద్దవి! రుచిలో గొప్పవి!

ప్రతి మిఠాయియందు
రసమయ రుచికర విందు!



## న్యూట్రిన్

## SuperStar

బహుమంచి మిఠాయిల సరళి






isesh/NC/8818/Tel

సాధించాలనే తపన, కోరిక కలిగేవి - కానీ శరత్‌తో మాట్లాడుతుంటే అసంతృప్తి, విసుగు, చిన్నకోపం- "అదేమిటి శరత్... జీవితాన్ని అంత తేలిగ్గా తీసుకుంటే ఎలా?"

"తేలిగ్గానా...?" అని విస్తుపోయి- "సంపాదిస్తున్నాను, ఖర్చుపెడుతున్నాను. అది బాధ్యత కాదూ - మీ అమ్మా నాన్న ఎంత సంతోషించారో తెల్సా నా వద్దతికి-"

"అది కాదు శరత్ - ఎప్పుడూ జీవితం ఇక ఇంతేనా? మీరేం సాధించాలని అనుకోరా? చదువుని తేలిగ్గా తీసుకున్నారు. డిగ్రీ పూర్తి చెయ్యలేకపోయారు. ఫుట్‌బాల్‌ని కూడా తేలిగ్గా తీసుకున్నారు. ప్రొఫెషనల్ కాలేక కాలక్షేపం ఆటగాడిలా మిగిలిపోయారు. ఇప్పుడు ఆ షాప్ పెట్టారు. అంతా గోపాల్ మీద వదిలేశారు. దాన్ని ఎలా ఇంకా అభివృద్ధి చెయ్యాలి. ఏం చేస్తే బావుంటుంది- అని ఆలోచించడంలేదు. రేపు గోపాల్ మీకు తప్పుడు ఎక్కౌంట్స్ చూపించి షాప్ దివాళాతీసిందని అంటే-"

వెర్రిగా చూశాడు శరత్ శాలినివైపు.

"నీకు బొత్తిగా మనుమల మీద నమ్మకం లేదేవిటి శాలీ?"

"నేను ఉదాహరణగా చెప్తున్నాను. అయినా అలా ఎన్ని జరగడంలేదు. మనం చూడటంలేదూ"

"గోపాల్ అటువంటివాడుకాదు-"

"అందరూ అందర్ని గురించీ ముందు అలాగే అనుకుంటారు"

"సరే... ఆవిషయం వదిలేసి ఏదైనా మాట్లాడు. నీ చదువు గురించి చెప్పు. మరోరెండు నెలల్లో ఎగ్జామ్స్ వుంటాయి. ప్రీవియస్ అయిపోతుంది. ఇంకా చదవాలని వుందా- బోరుగా లేదూ?"

శాలిని ఆశ్చర్యంగా చూస్తూ- "బోర్‌గా వుండటం ఏమిటి? ఫైనల్ రాయాలి. యూనివర్సిటీ గోల్డ్‌మెడల్ సంపాదించాలి. ఆ తర్వాత రీసెర్చి చెయ్యాలి"

"అదేవిటి?"





"నాకు నచ్చిన సబ్జక్ట్ ఇంకా దొరకలేదు. గైడ్‌తో డిస్కస్ చేసి మంచి సబ్జక్ట్ మీద ఎమ్.ఫిల్ ఆ తర్వాత పి.హెచ్.డి, పి.హెచ్.డిలో డాక్టరేట్"-

"అబ్బా... అదంతా ఎందుకు శాలీ! ఎమ్.ఏ చదవాలని కోరిక అన్నావు. ఓ.కే. కానీ ఆ మిగతా చదువులన్నీ మనకొద్దు శాలీ" అతనిలో చిరాకు.

శాలిని అతని వంక అనుమానంగా చూసి- "ఎమ్.ఎ చేసిన తర్వాత-" అంది.

"తర్వాత ఏముంది? పెళ్ళి- పిల్లలు హాయిగా మనవూళ్ళో ప్రశాంతంగా, హేపీగా-"

"ప్రశాంతత, ఆనందం అంటే - తినడం, పడుకోవడం, కాలక్షేపం కబుర్లు చెప్పుకోవడం- ఇవ్వేనా?-"

"మరి-"

"ప్రశాంతత- ఆనందం- సంతృప్తి - అంటే మన చదువు, సంస్కారం, మేధావితనం- పదిమందికి వుపయోగపడేలా మనల్ని మనం తీర్చిదిద్దుకుంటూ మరో పదిమందిని తీర్చిదిద్దడం"

"ఒక్క ముక్క నాకు అర్ధంకాలేదు" శరత్ విసుగుని అణుచుకుంటూ అన్నాడు. ఆమెకు మళ్ళీ వసంత్ గుర్తుకు వచ్చాడు. అతని మాటలు గుర్తుకు వచ్చాయి.

చీకట్లో వెదుకులాట ఎంతవరకు - మనం సాధించుకోవాలనుకునే గమ్యం తెల్సుకోవడం, నిర్ణయించుకోవడం ఎంత స్వర్గం!

మనిషి ఎంతో గొప్పవాడు. ఎన్నో సాధించగలడు. కానీ యిరవై నాలుగు సంవత్సరాలకి డిగ్రీ పూర్తిచేస్తే తన బాధ్యత నెరవేరిపోయినట్టు, కొన్ని వేలు లంచం పోసి, గుమస్తా వుద్యోగం దొరకగానే- జన్మధన్యమయినట్టు; వేల కట్నం తీసుకుని పెళ్ళిచేసుకోగానే జీవితం సఫలమయినట్టు; ఇద్దరు ముగ్గురు పిల్లల్ని కని, వాళ్ళకి చాలీచాలని తిండి పెట్టి, మంచి చదువు చెప్పించలేక అప్పులతో సతమతమవుతూ అదే జీవితం అని సరిపెట్టుకునే మనిషిని చూస్తుంటే ఎంత బాధగా వుంటుందో శాలీ-

శరత్ మాటలతో ఆలోచన్లనుంచి తేరుకుంది- "నీకు మరీ వుద్యోగం చెయ్యాలంటే బి.ఇడి

కట్టి- మనహైస్కూల్‌లో ఏ టీచర్‌పోస్టో చెయ్యి-''

ఒక ప్రొఫెసర్ అవ్వాల్సిన తాను - ఇండియన్ ఇంగ్లీషు లిటరేచర్ మీద పూర్తి అథారిటీ సాధించాలనుకుంటున్న తాను, ఆ సబ్జెక్టులో చిన్న సందేహం వచ్చినా తనని రిఫర్‌చెయ్యాలనే ఎత్తుకు ఎదగాలనుకునే తనని ఎంత చిన్న చట్రంలో ఇరికించాలని చూస్తున్నాడు.

అతను మొదట మొదటగా - తనకి 'తామరలు' అందించినప్పుడు, తాను పొందిన తృప్తి, ఆనందం, ఆర్ద్రత గుర్తొచ్చాయి. ఇదేమిటి, ఇతను ఇప్పుడు ఏం మాట్లాడినా తనలో వ్యతిరేక భావం, అసంతృప్తి కలుగుతున్నాయి.

★ ★ ★

శరత్‌కి మనసంతా చిరాగ్గా ఉంది. ఇంటికి రాగానే- ''శాలిని బావుందిరా? ఏమంది?'' అని అడిగిన తల్లిని చిరాగ్గా ఒకచూపు చూసి, స్నానం చేసి గోపాల్‌ని కల్సుకోవటం కోసం వాళ్ళింటికి వెళ్లాడు.

గోపాల్ లేడు. గోపాల్ చెల్లెలు సుజాత శరత్‌ని చూడగానే మొహం నిండా చిరునవ్వుని కప్పుకుంటూ- ''ఎప్పుడొచ్చారు? రండి! కూర్చోండి!'' అంటూ హడావుడి చేసి, గబగబ లోపలికి వెళ్ళి- కాఫీ కలుపుకు వచ్చింది.

''గోపాల్ లేడా?''

''లేడు... బయటకు వెళ్లాడు''.

''అయితే- నేను వెళతాను'' అని లేచాడు.

''అదేమిటి- మీకు ఇష్టం అని మీగడ పాలుతో కాఫీ చేసుకు వస్తే''

శరత్ ఆశ్చర్యంగా చూశాడు. తనకు ఇష్టమని మీగడపాలతో- కాఫీ చేసిందా సుజాతా? సన్నగా, తెల్లగా, సన్నజాజి మొగ్గలా వున్న సుజాతని అప్పుడే పరిశీలనగా చూశాడు.

నవ్వి కాఫీ కప్పు అందుకున్నాడు. 'చంద్రుడులా నవ్వాడు, వెన్నెల కురిసినట్టు' తన్మయంగా అనుకుంది సుజాత.

తనని ఆపేక్షగా, అభిమానంగా చూస్తున్న సుజాతని చూసి చిరునవ్వుతో- ''ఇంకా నాకేం ఇష్టమో చెప్పండి'' అన్నాడు.

టిఫిన్స్-

రవ్వదోసె
మిరపకాయ బజ్జీలు
వుల్లిబోండా
ఆవడ
అరిసెలు

అన్నంలో-

వెల్లుల్లి ఆవకాయ,
అరిటికాయ పులుసు
మెంతిచారు
వులవల పులుసు
బీరకాయ కూర
పచ్చిపులుసు
ఆవపెట్టిన వంకాయకూర
మజ్జిగ పులుసు
గడ్డపెరుగు

మీకు ఇష్టమైన సోప్-

పాండ్స్-

టూత్‌పేస్ట్

కాల్గేట్

పౌడర్

ఓల్డ్‌స్పైస్

సిగరెట్ బ్రాండ్-

గోల్డ్‌ఫ్లేక్

అంతవరకు చెప్పి నవ్వి- ఇష్టమైన డ్రింక్స్ బ్లాక్‌డాల్ విస్కీ, ఓల్డ్‌మాంక్ రమ్ము... ''అమ్మో! చెప్పొద్దు!! అప్పు!!!''

''నీకు ఇవన్నీ ఎలా తెల్సు సుజాతా!''

''అన్నయ్య ద్వారా గ్రహించినవి కొన్ని మీ ఇంటికి వచ్చినప్పుడల్లా పరిశీలించినవి మరికొన్ని- తర్వాత మీ కిష్టమయిన అమ్మాయి-''

'శాలిని'-''

శాలినిపేరువినగానే అతన మొహం చిన్నబోయింది. తను ఎంతోహుషారుగా ఇక్కడ్నుంచి అంత దూరం వెళ్లాడు. ఎందుకో శాలినితో మాట్లాడాక ఆ హుషారు అంతా దిగిపోయింది. శాలిని ముభావంగా వుంది. అసంతృప్తిగా మాట్లాడింది. ఇది వరలా శాలినితో సమయం గడపటంలో 'థ్రిల్' కన్పించలేదు. అనవసరంగా అదీ ఇదీ అని ఎందుకు తాపత్రయపడుతుందో అర్థంకావడంలేదు.

కాఫీ తాగి ఖాళీ కప్పు టేబిల్ మీద పెడుతూ- "ఒకవేళ తనంటే ఇంట్రస్టు పోయిందేమో శాలినీకి" అనుకున్నాడు. ఆ ఆలోచనకు ఉలిక్కిపడ్డాడు.

శాలిని పేరు ఎత్తగానే చిన్నబోయిన అతని మొహం చూడగానే సుజాత లోలోపల ఆశ్చర్య పోయింది.

లోపలికి వెళ్ళి, స్పోర్ట్స్ వీక్ తెచ్చి అందించింది కొత్తది. "మీకు ఇష్టంకదా, ఈ మాగజైన్ అంటే! న్యూస్ ఏజెంట్‌కి చెప్పాను. ప్రతీవారం మనషాప్‌లో వేస్తాడు" అంది.

తలెత్తి- అల్చిప్పల్లా వున్న ఆమె నిర్మలమైన కళ్ళల్లోకి చూస్తూ- 'థాంక్స్' అన్నాడు. నిజంగా శాలిని ప్రవర్తన వలన డిస్టర్బ్ అయిన మనసు మళ్ళీ సుజాత చూపిన ఆదరణ వలన తేరుకుంది. 'థాంక్స్' ఏదో మాటవరసకి కాకుండా నిండు మనసుతో అన్నాడు.

అది గ్రహించిన సుజాత కళ్ళల్లో మెరుపు. కేవలం తన నోటినుంచి వచ్చే ఒక పదం మరో వ్యక్తిలో అంత వెలుగు సృష్టించడం గ్రహించి



అతనికి 'థ్రిల్' అనిపించింది.

చిరాకు, విసుగుతో బయల్దేరిన శరత్ మంచి మూడ్‌లో హుషారుగా బయల్దేరాడు.

'వెళ్ళొస్తాను' అని సుజాతకు చెప్పి- అక్కడ్నుంచి రెండడుగులు వేయగానే గోపాల్ కనిపించాడు.

"అదేమిట్రా మరో రెండురోజులు వుంటావనుకున్నా- అప్పుడే వచ్చాశావేం?!"

"ఏం తొందరగా రావడం వలన నీకేమన్నా బాధగా వుందా?!"

"ఛీ! మాటవరసకు కూడా అలా అనకురా ముఖ్యంగా సుజాత నిన్ను చూసి ఎగిరి గంతేసి వుంటుందే?"

శరత్ నవ్వాడు. హుందాగా, నిండుగా, సంతృప్తిగా.



"మరో రెండు రోజులు వుండకూడదూ-" అని తాను అడిగినా, 'వెళ్ళిపోవాలి' అంటూ వెళ్ళిపోయిన శరత్ పదేపదే జ్ఞాపకం వస్తున్నాడు శాలినికి.

'యుఆర్‌ఒకె, ఐయామ్‌ఒకె' హారిస్ పుస్తకం ఇస్తూ- మీరు అడిగారు కదా- ట్రాన్సక్షనల్ ఎనాలసిస్. మనిషిలో- పేరెంట్, అడల్ట్, చైల్డ్ ఎలావుంటారని- ఆ యూనిట్స్ ఎలా వర్క్ చేస్తాయి మనిషి ప్రవర్తన మీద- ఈ పుస్తకం చదివితే మీకు చాలావరకు తెలుస్తుంది. ఇది మీరు చదివాక హారిస్ ఇటీవల రాసిన 'స్టేయింగ్ ఓ.కే.' బుక్ ఇస్తాను. అది కూడా చాలా ఇంట్రస్టింగ్‌గా ఉంటుంది-" అన్నాడు వసంత్.

మరోమాట లేకుండా, చిన్న చిరునవ్వుతో పుస్తకం అందుకుంటున్న శాలినిని చూసి- "చాలా బేడ్ మూడ్‌లో వున్నట్టున్నారు" అన్నాడు మళ్ళీ అతనే.

శాలిని తలెత్తి- ఫ్రెష్‌గా నిర్మలంగా వున్న అతని కళ్ళల్లోకి చూస్తూ- "తనని తెరిచిన పుస్తకంగా ఎంత బాగా చదవగలడు ఇతను-" అనుకుంది. "అబ్బే!లేదే! మంచి మూడ్‌లోనే వున్నాను-" అంది.

"అబద్ధం ఆడకండి. మీ ముఖకవళికల్ని చూస్తుంటే తెలుస్తుంది"

"మీరు సైకాలజీ స్టూడెంట్‌కదా- నా సమస్యని విశ్లేషించి చెప్పగలరా?"

"చెప్పండి అసలు విషయం ఏమిటో"

"ఒక సమస్యని విశ్లేషించడానికి, విపులీకరించడానికి, పరిష్కారం అన్వేషించడానికి- సైకాలజీ స్టూడెంట్ అయి వుండనక్కరలేదు. కొంత లాజిక్, రీజన్, హ్యూమన్ సింపతీ వుంటే చాలు"

"పోనీ అలా చూసుకున్నా: అవి మీలో వున్నాయిగా-"

"సరే... చెప్పండి-"

ఇద్దరూ యూనివర్శిటీ బిల్డింగ్స్ వక్కనున్న చెట్ల కింద కూర్చున్నారు.

శాలిని శరత్‌గురించి చెప్పి- తామిద్దరి మధ్య జరిగిన సంభాషణ చెప్పింది.

నేను చెప్పిన విషయం గురించి ఆలోచించడం మాట అటుంచి, కోపం తెచ్చుకున్నట్టున్నాడు.

వసంత్ నవ్వాడు.

"మనం మాట్లాడేది ప్రతిదీ అవతలివాళ్ళు- మనం అర్థం చేసుకున్న రీతిలోనే అర్థం చేసుకోవాలి అని మనం అనుకోవడం కరక్టే. కానీ సాధారణంగా తొంభై తొమ్మిది శాతం అవతలి వాళ్ళు- మనం చెప్పేది రైట్‌సెన్స్‌లో తీసుకోరు. నెగిటివ్‌గా తీసుకుంటారు. తనని సరిగ్గా అర్థంచేసుకోలేదనో తక్కువగా మాట్లాడామనో- ఇలా రకరకాలుగా తనని కించపరిచి దుర్భాషలాడామని కూడా అనుకుంటారు.

-అన్ని విత్తనాలూ మొలకెత్తవు. అలానే అన్ని భూములూ పండవు. మనం ముందు




అవతలి వ్యక్తి మనస్తత్వం అర్థం చేసుకుని నిర్ణయించుకోవాలి. దాని ప్రకారం మాట్లాడాలి.

"శరత్ మనిషి మంచివాడే. కానీ ప్రతిదీ తేలిగ్గా తీసుకుంటాడు. జీవితంలో ఒక గమ్యం, మార్గంలేనివాడు. ఈ రోజు కష్టం వస్తే కన్నీరు కారుస్తాడు; నవ్వొస్తే పగలబడి నవ్వుతాడు; ఎందుకీ కష్టం వచ్చిందని ఆలోచించడు; ఆ కష్టాన్ని అధిగమించే మార్గం ఆలోచించడు; ఇలాంటి నవ్వులే జీవితంలోమరిన్నిపండాలని అనుకుని- ఆ అనుకున్నదాన్ని ఆచరణలో పెట్టడు. అతను ఆలోచనకి వ్యతిరేకి. ఆలోచించడానికి భయపడతాడు. ఎలావడితే అలా బతకడమే సహజం అనుకుంటాడు. ఈ రకంగా బతకాలి అనే సూత్రం అతనికి తెలీదు. అవసరం లేదనుకుంటాడు కూడా. మీరు తెలియచెప్పాలని ప్రయత్నించి విఫలమయ్యారు-"

ఆమె వసంత్ వైపు ఆశ్చర్యంగా చూస్తూ, ఎంత బాగా చెప్పాడు అనుకుంది.

కానీ ఆమెలో తను శరత్‌ని బాధపెట్టానేమో అనే గిల్టీనెస్ పోలేదు. "అయితే నేను మాట్లాడింది కరక్టేనా వసంత్?"

"మీరు మాట్లాడిన పద్ధతి కేవలం శరత్‌కే కాదు- ఈనాటి నీరస యువతరానికి చెప్పాల్సిన పద్ధతి. కావాల్సిన పద్ధతి. వాళ్లు వాళ్ల గురించే ఆలోచించరు. ఇక పక్కవాళ్ళ గురించి, సమాజం గురించి, దేశంగురించి ఏం ఆలోచిస్తారు? దేశంలోని ఆకలి, నిస్సహాయత, నిరక్షరాస్యత, నిరుద్యోగం, అక్రమం, లంచగొండితనం- ఏ ఒక్కదాన్ని గురించీ పట్టించుకోరు. మీరు మాట్లాడిన పద్ధతి కరక్టే శాలినీ-" అని ఆగి-

"మీ ద్వారా ఎంతోమంది తమ గాడి జీవితాల నుంచి కదిలి- ఎంతో కొంత సాధిస్తారని నా నమ్మకం-"

శాలిని ఆశ్చర్యంగా-ఉ"నాగురించి ఏం తెల్సని అంత నమ్మకం మీకు?" అంది.

వసంత్ నవ్వాడు. నవ్వి, చనువుగా- "నువ్వు అంటే ఏమిటో నాకు తెల్సు శాలినీ ... త్వరలోనే నువ్వూ తెల్సుకుంటావు" అన్నాడు.

★ ★ ★

సాయంకాలం నీరెండ- నలుపెక్కుతున్న సమయంలో-

"మైజావుం, తుమ్ సోజావో-" పాట వింటున్నాడు శరత్.

గోపాల్ ఏవో ఎక్కౌంట్స్ సరిచూసుకుంటున్నాడు.

షాపు కుర్రోడు వచ్చి- శరత్ పక్కన నిల్చుని గునగునగా- "సుజాతగారు రమ్మంటున్నారు-" అన్నాడు.

శరత్- సాగివుండే నల్లటి కళ్ళల్లో ఆశ్చర్యం తొంగిచూసింది. ఆ క్షణంలో అవి కాంతివంతమయ్యాయి. ఎందుకో హృదయంలో ఇది అని చెప్పలేని ఆనందం కలిగింది.

గోపాల్ ఇటు తిరిగి నవ్వి- "సుజాత పిలుస్తోందా?"

శరత్ నవ్వి- "ఏదో రహస్యంగా పిలుస్తోందని, ఈ రహస్యం ఎలా దాచాలా అని ఉబ్బితబ్బిబ్బవుతున్నాను. నీకు తెల్సినా- హమ్మయ్య-" అన్నాడు.

"సుజాత నాకు చెప్పిందిలే!"

"మీ చెల్లెలు తెలివైంది" అన్నాడు శరత్ తమాషాగా.

"నీకు సర్‌ప్రైజ్ ఇవ్వబోతోంది ... వెళ్ళు"

"ఇంతకీ రహస్యం ప్రపంచానికి కాదు. నాకన్నమాట..." అతనికి లోలోపల కుతూహలంగా వుంది- అది ఏవిటో తెల్సుకోవాలని.

"అయితే వెళ్తున్నా- నువ్వుకూడా రాకూడదూ-"

"నేను వస్తే షాపు ఎవరు చూస్తారు. అయినా సుజాత నిన్నేగా పిల్చింది ... వెళ్ళు"

"తనే ఇక్కడికి రావచ్చుకదా-"

గోపాల్ నవ్వాడు. నవ్వి "నా చెల్లెలు నీతో మాట్లాడటం నాకు సహజంగా కనిపించినా ప్రపంచానికి కాదు- ఆ విషయం మర్చిపోకు" అన్నాడు.

శరత్‌కి- తను- శాలినీల గురించిన మొదట్లో జరిగిన గొడవలు గుర్తొచ్చాయి. నవ్వొచ్చింది. నిజంగా తామిద్దరి మధ్య సమాజం అనుకున్నంత దగ్గరితనం వుందా? లేదు...

వుందనుకుని ప్రపంచం గొడవచెయ్యడంతో తామిద్దరూ దగ్గరయ్యారు. ఆ ఆలోచనని ఒక్క సెకను ఆపి- "ఇప్పుడు తామిద్దరి మధ్యా ఆ దగ్గరితనం వుందా?" అనుకున్నాడు.

బయల్దేరి అక్కడికి వెళ్ళేసరికి- సుజాత గుమ్మంలో నిల్చుని, సన్నజాజి మొగ్గలాంటి ఆహ్లాదకరమైన తెల్లటి చిరునవ్వుతో ఆహ్వానించింది.

లోపలికి వస్తూనే శరత్‌తో- "డాబాపైకి పోదామా" అంది.

శరత్ నవ్వి ఆమెని అనుసరించాడు. ఇద్దరూ డాబా ఎక్కారు. వాళ్ళకన్నా ముందు వాళ్ళ నీడలు వెనకనుంచి నీరెండపడటంతో ముందే వెళ్ళాయి.

"విష్‌యు మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే-"

శరత్ ఆశ్చర్యంగా- "థాంక్యూ" అని మీ కెలా తెల్సు- అన్నాడు.

"ఎప్పుడో అన్నయ్య చెప్పాడు గుర్తుపెట్టుకున్నా. మీరు ఈరోజు నన్ను- గుర్తు పెట్టుకునే బహుమతి ఒకటి ఇవ్వబోతున్నా-"

శరత్ నవ్వి- "ఏమిటది?" అన్నాడు.

ఆమె తన గుప్పిటలో దాచిన బంగారు ఉంగరం ముందుకు చాపింది.

'ఎస్' అనే అక్షరంతో వున్న ఆ వుంగరం అతని చేతిలోకి అందిస్తూ- "మీ జీవితంలో ఆనందం మాత్రమే వుండాలని కోరుకుంటున్నా-" అంది. ఆ మాటలు- ఆమె కంఠం సిన్సియర్‌గా పలికినా అలా అంటున్నప్పుడు, ఆమె కళ్ళల్లో నీలినీడలు రహస్యంగా తొంగి చూశాయి.

"ఇంత ఖరీదైన ప్రెజెంటా"

"దయచేసి ప్రెజంటేషన్‌కి ఖరీదుని అంటగట్టకండి-"

"ఓ.కే... నిన్ను జీవితాంతం గుర్తుపెట్టుకోననా 'ఎస్' అనే అక్షరంతో వుంగరం ఇచ్చావు-"

"అదేమిటీ... 'ఎస్' నేను కాదు"

'ఎస్' ఫర్ సుజాత కాదూ!





"కాదు... ఎస్ ఫర్ శాలిని"

"అవును- శాలిని" అనుకోగానే అతని ఆలోచనఆగింది. అంతవరకు అతని మొహంలో తాండవిస్తున్న చిర్నవ్వు అలలు చెరిగిపోయాయి. మారిన అతని ముఖ కవళికలు గమనించి- "ఏమిటి శరత్... ఎందుకలా అయ్యారు?" అంది.

ఉన్నట్టుండి- "శాలిని, నేను కల్సి జీవించలేం సుజా... పెళ్ళి చేసుకున్నా సుఖపడలేం. మా ఆలోచనాధోరణులు వేరయ్యాయి-"

"కానీ నిశ్చితార్థం జరిగింది. ఊళ్ళో అందరూ మిమ్మల్నిద్దర్నీ పెళ్ళి కాకపోయినా భార్యాభర్తలుగా చూస్తున్నారు-"

"అవును... ఊళ్ళేనే కాదు- నిన్నమొన్నటి వరకు నేనూ అలానే అనుకున్నా-"

"ఇప్పుడు మీరుకాదంటే- శాలిని బాధపడదూ- ఆమె జీవితం ఏమవుతుంది?"

"శాలిని బాధపడుతుందని నేను బాధపడాలా? ఒకప్పుడు శాలిని కాల్లోముల్లు గుచ్చుకుంటే- నాగుండెల్లో గునపం దిగినంత బాధపడేవాడిని. కానీ ఎందుకో చాలా మార్పువచ్చింది నాలో. ఇప్పుడు అటువంటి సెన్సిటివ్ ఫీలింగ్స్ ఆమె పట్లలేవు. ఇప్పుడు నేను పెళ్ళిచేసుకోకపోతే శాలిని బాధపడుతుందని నేను బాధపడదలచుకోలేదు. తన జీవితం ఏదో అవుతుందని నా జీవితం పాడు చేసుకోదలచుకోలేదు-"

సుజాత మౌనంగా వుండిపోయింది. అతని మాటలు ఆమెలో రకారకాల ఆలోచనలకు వూపు ఇచ్చింది.

"ఏం సుజా మాట్లాడవు? నేను ప్రపంచానికి దుర్మార్గుడిలా కన్పించినా ఫరవాలేదు. కానీ నువ్వు మాత్రం నాగురించి చెడుగా అనుకుంటే భరించలేను"

సుజాత ఆశ్చర్యంగా చూసింది.

"నాకు నువ్వంటే ఇష్టం సుజా! దాన్ని ఎటువంటి ఇష్టంగా మార్చాలన్నా- అది నీచేతిలో వుంది;" అని వుంగరాన్ని తిరిగి ఇచ్చేస్తూ "ఈ 'ఎస్' - సుజాత అయితే వేలికి పెట్టు; శాలిని అయితే నీ దగ్గరే వుంచుకో-"

ఆమె మౌనంగా ఆ వుంగరాన్ని అతని

కుడిచెయ్యి వుంగరంవేలికి తొడిగి తలెత్తి- "బాగా ఆలోచించుకునే నిర్ణయించుకున్నారు కదూ" అంది.

"అవును... మరి నువ్వు?"

"నేను కూడా-"

శరత్ చిర్నవ్వు నవ్వాడు. "బహుశా ఇప్పుడు శాలినిని కాదంటే ఇంట్లో గొడవలు రావచ్చు కానీ మనపెళ్ళి మాత్రం జరగడం ఖాయం. నాకు మీరంటే మొదటినుంచీ ప్రత్యేకమైన అభిమానం. కానీ శాలినికి, మీకు వివాహం జరగబోతుందని తెల్సి- నేను మరోరకమైన ఊహలు పెంచుకోలేదు"

"నాకు తెల్సు-" అని సుజాత చెయ్యి అందుకుని ముద్దుపెట్టుకుంటూ- "ఇక మన సంభాషణల్లో శాలిని ప్రసక్తి తీసుకురావద్దు సుజా! నాకు ఆమెని మర్చిపోవాలని వుంది" అన్నాడు.

★ ★ ★

శాలిని వసంత్ పక్కనే సముద్రం ముందు ఎత్తయిన ఇసుకదిబ్బ మీద కూర్చుని ఉంది. కాళ్ళు ముందుకుచాచి సముద్రపు అలలు వచ్చి పాదాల్ని తాకి వెనక్కి వెళ్ళిపోతుంటే తమాషాగా, ఆహ్లాదంగా వుందామెకు. ఆకాశంలో వెన్నెలల్ని వెదజల్లుతూ చంద్రుడు- ఆ చంద్రుడికి మేఘాలు చల్లగా అడ్డుపడినప్పుడల్లా చుట్టూ- నీడలాంటి చీకటి. అడ్డుతొలగినప్పుడు వెన్నెల. నిజంగా బావుంది వాతావరణం అనిపించింది.

ఎగ్జామ్స్ అయిపోయాయి. ఇవన్నీ వదిలేసుకుని వెళ్ళాలంటే, మనసు బాధగావుంది. కానీ కనీసం కలవంటి అందమైన వాస్తవం ప్రస్తుతం అయినా వుంది కదా అనే ఆనందం. ప్రస్తుతంలో అనుభవిస్తున్న ఆనందపు స్పందన భవిష్యత్తుని తల్చుకుంటే అయోమయంతో కల్సిన బాధ.

వసంత్ 'బియాండ్ ద రిలాక్సేషన్ రెస్పాన్స్' మీద ఎమ్.ఫిల్ చేశాడు. త్వరలోనే ఫెయిత్ ఫాక్టర్ మీద పి.హెచ్‌డి చెయ్యబోతున్నాడు. ప్రస్తుతం సైకియాట్రిస్ట్ డాక్టర్ అగర్వాల్ దగ్గర సైకోఎనాలిసిస్ అసిస్టెంట్‌గా పనిచేస్తున్నాడు. అతను ఎమ్.ఫిల్ చేసిన పేపర్సు పబ్లిషర్సు బుక్‌గా ప్రింట్ చెయ్యబోతున్నారు. ఆ పేపర్సుకి కొంచెం మార్పులు- చేర్పులు చేసి శాలిని రాస్తోంది. భాషమీద వున్న అథారిటీ వలన- శాలిని శైలిలో చదివించే గుణం వుంటుంది. ఏ పుస్తకానికైనా చదివించే గుణం ప్రాణం. అందుకే ఆ పని ఆమెకు అప్పగించాడు వసంత్.

దాని గురించే అతను మాట్లాడుతూ ట్రాన్సాక్షనల్ ఎనాలిసిస్ గురించి మంద్రస్థాయిలో చెబుతున్నాడు.

అతని గొంతు వింటుంటే ఎంత బావుంది. అతనలా మాట్లాడుతుంటే, హాయిగా ప్రవహిస్తున్న గోదావరీప్రవాహంలో వెల్లకిలాపడుకుని తేలుతూ, నీలాకాశాన్ని ఆస్వాదిస్తూ- ప్రవాహంతోపాటు కల్సి ప్రవహిస్తున్న గంభీర ప్రశాంతత.

హఠాత్తుగా ఆమె ఎందుకో కలలో నవ్వినట్టుగా- నవ్వి- 'వసూ' అంది.

వసంత్ చెబుతున్న విషయం ఆపి- "వూఁ ఏంటి?" అన్నాడు.

"ఏంలేదు ... నువ్వు ఆపకు - చెప్పు"

"నేను తర్వాత చెబ్తానుకాని నువ్ ఏం చెప్పదల్చుకున్నావో చెప్పు"

"నీకు రాత్రి అంటే ఇష్టమా? పగలా"

అతను నవ్వాడు. తెల్లటి అతని పాలకళ్ళు స్వచ్ఛంగా మెరిసాయి వెన్నెలలో. "రాత్రి అంటే నాకు ఇష్టం. నాలో నేను ముడుచుకుపోయి, ప్రశాంతంగా ఆలోచించుకోవచ్చు. పగలు అంటే ఇష్టం. ఎన్నో పనులు చేసుకోవచ్చు. నాలాంటి ఎంతోమంది మనుషులతో నన్ను నేను పంచుకోవచ్చు"

శాలిని నవ్వింది. "నువ్ వాస్తవికవాదివి వసూ. అందుకే నువ్ అంటే నాకు ఇష్టం"

"నీకు వూహలంటే ఇష్టంకదూ శాలీ- మరి నాలోని వాస్తవికతని మెచ్చుకుంటున్నావు"

"నిజమే ... నాకు వూహలంటే భలే ఇష్టం. కానీ ఆ వూహలు ఒక మూడ్‌లో ఇష్టం. అంతేకాని అస్తమానం కాదు. ఉదాహరణకి ఇప్పుడు అదిగో ఆకాశం నుంచి తెల్లటి రెక్కల పుష్పకవిమానం దిగితే- మనిద్దరం అది ఎక్కి హాయిగా



పట్టువరుపులమీద ప్రశాంతత పొందుతూ- ఆకాశంలో, గాలిలో ప్రయాణిస్తూ చంద్రుడ్ని ఇలా నిమిరి, మేఘాల్ని అలా తట్టి, గగన వీధుల్లో చల్లగాలిలో ప్రయాణించడం ఎంత బావుంటుంది. వీలైతే రకరకాల పువ్వుల్ని విమానం నిండుగా పోసుకుని- వాటి సువాసన ల్ని ఆస్వాదిస్తూ- రంగుల్ని అనుభవిస్తూ- కానీ- ఈ వూహాజీవితకాలంలో కొన్ని నిముషాలు. ఆ కొన్ని నిముషాలు నాకు చాలు. ఆ ఆనందం నాకు రేపేకాదు కొన్ని సంవత్సరాల దాకా మనసులో ఫ్రెష్‌గా ఉంటుంది. కానీ రేపు-

-మళ్ళీ తెల్లారితే ఈ వూహ కనీసం గుర్తు అయినారాదు. రేపు యూనివర్సిటీని, నేను రాస్తున్న నీ పుస్తకాన్ని- స్నేహితుల్ని టీలని, భోజనాల్ని- ఈ చెట్లని- సిటీబస్సుల్ని- రోడ్లని- అన్నిటినీ ఎంజాయ్‌చేస్తా. అంతేకానీ, ఈ వూహనే పట్టుకుని వ్రేలాడను. నన్ను మీ సైకాలజీలో ఏమంటారు వసంత్- ఎస్కేపిస్టు అంటారా?''

వసంత్ మౌనంగా ఆమె చేతిని తన చేతిలో కి తీసుకుని మృదువుగా నొక్కి- ''నువ్వు అదృష్ట వంతురాలివి శాలీ. జీవితంలో ఎప్పుడూ ఆనందం అనుభవించగలవు. ఆ ఆనందాన్ని ఎదుటివ్యక్తికి పంచగలవు. ఐలైక్‌యు- నీలాంటివాళ్ళు చాలా అరుదు'' అన్నాడు.

''కానీ వసూ వూహకి ఎక్కడ ఫుల్‌స్టాప్ పెట్టాలో- వాస్తవాన్ని ఎక్కడవరకు అంగీక రించాలో చాలావరకు నీనుంచే నేర్చుకున్నా''

''థాంక్‌యూ- నాకు మరీ ఎక్కువ క్రెడిట్ అంటగడుతున్నావేమో!''

''లేదు వసూ- జీవితాంతం నువ్ జీవితం గురించి విపులీకరిస్తుంటే- ఆ లోతుల్ని నేను రాస్తూ- నీతోనే ఉండిపోవాలని అన్పిస్తోంది''

వసంత్- ఆ మాటలోని లోపలి అర్థం గ్ర హించగానే- శాలిని చెయ్యి వదిలేశాడు.

''ఐయామ్ సారీ శాలినీ''

''అదేంటి'' అంది శాలిని వసంత్‌లోని ఈ రియాక్షన్‌ని అయోమయంగా చూస్తూ.

''అవును శాలినీ నువ్ శరత్‌తో కల్సి జీవితం వంచుకోబోతున్నావని తెల్సి మాన సికంగా నేను నీకు మరీ క్లోజ్‌గా రావడం నాకు అంత బావుండలేదు''

శాలిని మౌనం వహించింది. కొన్ని నిము షాల నిశ్శబ్దం తర్వాత- ''శరత్- నామధ్య ఉన్నది కేవలం సరదా అయిన ఇంట్రస్టు. దాన్ని 'ప్రేమ- మోహం' అంటూ చుట్టూ ఉన్నవాళ్ళు మమ్మల్ని కంగారుపెట్టారు. గొడవ చేశారు. పెళ్ళి నిశ్చయం చేశారు. కానీ వసూ- మనిద్దరిమధ్య ఉన్నది పరస్పర అవగాహన, ఎడ్మిరేషన్, ఎడొరేషన్''

వసంత్ నవ్వి ''నిజమే... ఐయామ్ ఓ.కె, యు.ఆర్. ఓ.కె. సైకియాట్రిస్ట్ డా. థామస్ హారిస్. ఆయన భార్య అమీజోర్కల్లా బెస్ట్ కపుల్‌అయ్యే అవకాశాలు వున్నాయి'' అన్నా డు.

అతను ఏ ఉద్దేశంతో అలా అన్నాడో అర్థం అయ్యి శాలిని మోము ప్రఫుల్లమయ్యింది.

★ ★ ★

''శాలిని ఉదయమే వచ్చింది. సాయంత్రం అయిదు గంటలకు పంతులుగారు ముహూ ర్తం బావుందన్నారు. లగ్నపత్రిక రాసుకోవడాని కి తయారుగా వుండు. వెళ్లాలి'' హడావుడిగా వెంకట్రామయ్య భార్యకి చెబుతున్నాడు.

మధ్యాహ్నం భోజనం అవ్వగానే నిద్ర అల వాటు శరత్‌కి. అటుతిరిగి మాగన్నుగా నిద్రపో తున్నవాడల్లా తండ్రి హడావుడికి కళ్ళువిప్పి – ''ఎవరికి లగ్నపత్రికలు...?'' అన్నాడు.

అప్పుడే మంచంమీద కొడుకు వున్న సంగతి గ్రహించి –''ఓ... నువ్వు మెలుకువ గానే వున్నావా? అయితే సాయంత్రం అయి దుకు ఎటూపోకుండా మీ మామగారి ఇంటికి వచ్చేయి –'' అన్నాడు.

శరత్ ఆ మాటలు వినిపించుకోకుండా – ''లగ్నపత్రిక ఎవరికి?'' అని రెట్టించాడు.

వెంకట్రామయ్య విసుక్కుంటూ – ''ఎవరికి ఏమిటిరా? ఈ నెలలోనే మంచి ముహూర్తాలు వున్నాయట. మీ జాతకాలుచూసి ఒక ముహూ ర్తం నిర్ణయించుకుంటే... ఇప్పటికే ఆలస్యమ యింది –''

శరత్‌కి అర్థం అయింది. లేచి మంచంమీద కూర్చుని – ''ఈ పెళ్లి నాకిష్టంలే దు –'' అన్నాడు.




వెంకట్రామయ్యకి తన కళ్ళముందే కొంపకి నిప్పంటుకున్నంతగా నీరుగారిపోయి – తేరుకుని – "మతి వుండే మాట్లాడుతున్నావా?" అనరిచాడు.

"నేను శాలినిని పెళ్ళిచేసుకోలేను –"

"అదే... ఎందుకని –"

"ఎందుకంటే – నాకిష్టంలేదు... అంతే గోపాల్ చెల్లెల్ని సుజాతని చేసుకోవాలనుకుంటున్నాను –"

వెంకట్రామయ్యలో కోపం తారాస్థాయినందుకుంది. ఒక బూతు తిట్టి – "ఏవిటిరా నీ ఇష్టం... బోడి ఇష్టం. శాలిని ఎప్పుడో నీ భార్య అయింది. నిశ్చితార్థం జరిగిననాడే. అది కూడా మా ఇష్టప్రకారం కాకుండా, నీ ఇష్టప్రకారం జరిగిన నిర్ణయం. ఇప్పుడు ఆ అమ్మాయిని కాదనడానికి – నువ్వెవడివి? ఈ విషయం తెలిస్తే శాలిని ఏమవుతుంది? అసలు రుక్మిణీనాథరావు గుండెపగిలి చస్తాడు. దరిద్రుడా - ఇది జీవితం..."

వెంకట్రామయ్య మాటల్ని మధ్యలోనే కట్ చేసి – "జీవితం కాబట్టే...." అని లేచి లుంగీవిప్పి – పాంటు, షర్టు వేసుకోసాగాడు.

"ఛీ... మాట్లాడకు. నోరెత్తావంటే చంపుతాను. ఈ పెళ్ళి జరిగి తీరాల్సిందే –" ఉద్రేకంగా అరుస్తున్నాడు.

శరత్ మరేమీ మాట్లాడకుండా బయటకు వెళ్ళిపోబోయాడు.

"ఎక్కడికిరా? నామటుకి నేను ఇక్కడ అరుస్తుంటే, పట్టించుకోకుండా పోతావేం?" అని గర్జించి, ముందుకు దూకి – చాచి లెంపకాయ కొట్టాడు శరత్ని.

ఈ హఠాత్పరిణామానికి ఒక క్షణం మ్రాన్పడి – తేరుకుని – తండ్రిని నిరసనగా ఒక చూపుచూసి బయటకు వచ్చేశాడు.

విసురుగా వెళ్ళిపోతున్న కొడుకునిచూసి మతిపోయినదానిలా చూస్తుండిపోయింది శకుంతల.

ఇన్నాళ్ళూ – ఆవిడ కొడుకునే మానసికంగా సమర్థిస్తూ వచ్చింది. కానీ, ఈ రోజు ఎందుకో వెంకట్రామయ్యే కరక్ట్ అనిపించాడు ఆవిడకి. రెండు సంవత్సరాల క్రితం – శాలిని కోసం – చావుదెబ్బలుతిన్న శరత్ – ఈరోజు తన నిర్ణయం ఎలా మార్చుకోగలిగాడు. అందం, చదువు, సంస్కారం విషయాలకివస్తే సుజాతకన్నా – శాలినే ఎక్కువకదా – అటువంటప్పుడు శాలినిని నిరాకరించి – పైగా తన 'భార్య'గా పదిమందిలో ముద్రపడిన అమ్మాయిని కాదనుకుని సుజాతని ఎలాచేసుకుంటాడు? తన కొడుకు కూడా అవకాశవాదిలా ప్రవర్తించే మామూలు మగాడేనా? అలా అనుకోగానే శకుంతల కొడుకుమీద పెట్టుకున్న ఆశల మేడలు కూలిపోయాయి.

వెంకట్రామయ్య ఇంకా కొడుకుని తిడుతూనే వున్నాడు.

★ ★ ★

"లగ్నపత్రిక రాయించుకోవటానికి సాయంత్రం వాళ్ళు వస్తున్నారు. నువ్వు నీలంపట్టుచీర కట్టుకో. చక్కగా బావుంటావు" అంటూ ఏవేం నగలుపెట్టుకోవాలో కూతురికి మెత్తగా చెబుతోంది సరస్వతమ్మ.

రుక్మిణీనాథరావు గుమ్మాలకు మామిడితోరణాలు కట్టడానికి హడావుడి పడుతున్నాడు.

"అమ్మా – నాకు శరత్ని చేసుకోవటం ఇష్టంలేదు"

ఇద్దరూ చేష్టలుడిగి నిలబడిపోయి చూశారు కూతురు వంక. అసలు కూతురేనా అలా మాట్లాడింది లేక కూతురి రూపంలోవున్న దయ్యమో, భూతమో అన్నట్టు చూశారు.

"మీకు పెళ్లికాకపోయినా నిశ్చితార్థం జరిగిననరోజునే మీరిద్దరూ భార్యాభర్తలయ్యారు. ఇప్పుడు కాదంటే ఎలా?" కీచుగా అరిచాడు రుక్మిణీనాథరావు.

"అయినా దీనికి ఆ యూనివర్సిటీ చదువులు ఎందుకు అంటే – మీరెవరూ నామాట పట్టించుకున్నారుకాదు –" కచ్చగా అంది సరస్వతమ్మ.

శాలినికి నవ్వొచ్చింది. ఆరోజు తనకీ, శరత్కి ఏ సంబంధం లేదంటే వీళ్ళు నమ్మలేదు. ఈరోజు మామధ్య పెళ్ళిబంధం ఒద్దంటే ఒప్పుకోవడంలేదు –

"వసంత్ అని - యూనివర్సిటీలో నా సీనియర్. ప్రస్తుతం అసిస్టెంటు సైకాలజిస్ట్గా

పనిచేస్తున్నాడు. మేమిద్దరం రిజిష్టరు మ్యారేజ్ చేసుకోవాలని నిర్ణయించుకున్నాం''

రుక్మిణీనాథరావు తోక తొక్కిన త్రాచులా లేచి కూతుర్ని కొట్టడానికి చెయ్యెత్తాడు. శాలిని మధ్యలోనే తండ్రి చేతిని బలంగా ఆపి - నిరసనగా — ''మీ పరిధి నుంచి బయటకు వచ్చి ఎప్పటికీ మమ్మల్ని అర్థంచేసుకోరు. ఆరోజు నేను ఏ తప్పూ చెయ్యకపోయినా, నన్ను హింసించారు. మళ్ళీ మీలో మీరే సర్దుకుని, మాకు 'పెళ్ళి' నిర్ణయం చేశారు. ఈరోజు మళ్ళీ నేను ఏ తప్పూ చెయ్యకుండా సరైన నిర్ణయం తీసుకున్నప్పుడు - మళ్ళీ మీరు తప్పుగా ప్రవర్తిస్తున్నారు'' అంది.

''ఛీ... దాంతో మాటలు అనవసరం. అది ఆడదైతేకదా - మొన్నటివరకు శరత్‌తో తిరిగింది. ఇప్పుడు - మరొకడు, ఆ యూనివర్శిటీలో తగిలాడు - వాడ్ని మరిగింది—''

''అమ్మా'' అంది శాలిని కోపంగా.

ఆమెకు అసహ్యం వేసింది తల్లి ధోరణి. సిగ్గుపడింది తల్లి భాషకి. ఇటువంటి సంస్కారం వున్నవాళ్ళా తన తల్లిదండ్రులు

అని క్షణం నివ్వెరపోయింది.

వెనుదిరిగి తన గదిలో వున్న సూట్‌కేస్ తీసుకుంది— "మీరు నన్ను - 'నా కూతురు కాదు' అనకముందే, నేనే నిర్ణయించుకున్నా - మీరు నా తల్లిదండ్రులుగా వుండాల్సిన అర్హత లేదు —" అని తలుపులు తెరుచుకుని బయటకు వెళ్ళిపోయింది.

రుక్మిణీనాథరావు, సరస్వతమ్మ వెర్రిమొహాలు వేసుకుని చూస్తూ నిల్చుండిపోయారు.

నడుస్తూ శాలిని ఆలోచిస్తోంది. తన తల్లిదండ్రులు ఇలా ప్రవర్తిస్తారని, తను ముందే వూహించగలిగింది. ఎలా? పూర్వపు అనుభవాలవల్ల. వాళ్ళ సంస్కారపు స్థాయి ఎంతో కరెక్టుగా అంచనా వెయ్యగలిగే మానసికస్థితి తనకు వుండటంవల్ల. ఇక ఈ 'ఊరు' మళ్ళీ తను వచ్చే అవకాశం లేదు.

ఈ నేలని తాకగానే 'పాపాయిగా' 'కెవ్వు'న కేకవేసి ప్రాణం పోసుకుంది. నడక నేర్చుకుంది. పరుగులు పెట్టింది. కలలు కంది. వూహలు పేర్చుకుంది.

ఒక్కసారి ఆర్తిగా కనుచీకటి పడుతున్న - చుట్టూవున్న వాతావరణాన్ని చూసుకుంది.

వీలైతే ఆ 'ఊర్ని' అలా తన చేతులమధ్య ఆప్యాయంగా పట్టుకుని, గుండెలకు అదుముకుని కావలించుకోవాలనిపించింది. ఈ ఊరే తనని ప్రేమించింది. ద్వేషించింది. మెచ్చుకుంది. నిందలు వేసింది. అందలం ఎక్కించింది. కిందపడవేసింది. ఎన్నో అనుభవాలు - అనుభూతులు మిగులుస్తూ, తనకి జ్ఞానభిక్ష పెట్టింది. అప్రయత్నంగా ఆమె కళ్ళు చెమర్చాయి.

★ ★ ★

విసురుగా నడుస్తున్నాడు శరత్ - ఎటువెళ్లాలో ఇంకా నిర్ణయించుకోలేదు అతను. ఆ సందుమలుపు తిరగగానే, సూట్‌కేసు పట్టుకుని నడుస్తున్న శాలిని కనిపించగానే ఆగిపోయాడు. ఆలోచన్లు మారాయి. శాలినిని తప్పించుకొని వెనక్కి వెళ్ళిపోవాలనుకున్నాడు. ఈలోగా శాలిని, ముందుకు అడుగు వెయ్యబోతూ - ఎందుకో పక్కకి తిరిగి చూసింది. తనవైపే అయోమయంగా చూస్తున్న శరత్—

అంతదూరం నుంచే ఆమె శరత్ కళ్ళల్లో కదులుతున్న భావం గ్రహించి ఆగింది. శరత్‌తో మాట్లాడి వెళ్లడమే మంచిది అనుకుంది.

ఆమె నడక ఆగగానే, శరత్ శాలిని వుద్దేశ్యం అర్థమయ్యి, నడిచి ఆమెని కల్సుకున్నాడు. శరత్ తనని కల్సుకోగానే - ఇద్దరూ కల్సి మౌనంగా నడవడం ప్రారంభించారు.

శాలిని మౌనం నుంచి ముందు బయటపడి— "శరత్—" అంది.

అప్పటికి తన ఆలోచన్ల నుంచి కదిలి, ఆమె చేతిలో బరువైన సూట్‌కేసు వుండటం గమనించి - వంగి ఆమె చేతినుంచి సూట్‌కేసు అందుకున్నాడు. శాలిని అతని కదలికల్లో ఇంకా తనపట్ల వున్న ఆతురత - ఆర్ద్రత గమనించి, చలించింది.

"శరత్ - నీకు ఒక విషయం చెప్పాలి—"

ఆ మాటలకి పక్కకి తిరిగి శాలిని మొహం చూశాడు. ఆమె తనకు పరిచయం వున్న శాలినిగా కాకుండా క్రొత్తగా కనిపించింది.

"చెప్పు" అన్నాడు అతను, తన విషయం ఎలా చెప్పాలా అని ఆలోచించుకుంటూ—

"శరత్... నాకు నువ్వంటే ఇప్పటికీ ఇష్టం. ఎప్పటికీ కూడా" ప్రేమగా అని ఆగింది.

శరత్ గుండె ఆ మాటలకి లయ తప్పింది. శాలినికి తను చెప్పదలుచుకున్న విషయం ఎలా చెప్పడం, ఆమెకి ఇంకా తనమీద అటువంటి అనురాగం, ఆప్యాయత ఉన్నప్పుడు అనుకున్నాడు.

"కానీ శరత్ - 'ప్రేమ అంటే ఇద్దరు - ఒకరివైపు ఒకరు మోహంగా చూసుకోవడంకాదు. ఇద్దరు కల్సి - జీవితాన్ని ఒక దృష్టితో పరికించడం' అందుకనే మనిద్దరి జీవనవిధానాలు పరస్పర విరుద్ధంగా మారినప్పుడు, మనమధ్య అభిప్రాయభేదాలు వచ్చాయి. కానీ శరత్ - జీవితంలో నేను నిన్ను ఎప్పటికీ మర్చిపోలేను- మర్చిపోను. నా చదువు మళ్ళీ కంటిన్యూ కావడానికి నువ్వే కారణం—" అని ఆగి మృదువుగా నవ్వి— "ఒకప్పుడు నా కలల రాకుమారుడిలా నువ్ వచ్చినందుకు - నీకు జన్మంతా కృతజ్ఞతలు. కానీ కృతజ్ఞత

'ప్రేమ' కాదుకదా శరత్—''

శరత్ అప్పటికి ఊపిరి పీల్చుకున్నాడు తేలిగ్గా. చిర్నవ్వు నవ్వి— ''నిజమే శాలీ - నేనూ నీకు చెప్పాలనుకుంది అదే! నాలోని సామాన్యమైన మగవాడికి, నీలోని తెలివైన ఆడదానికి 'లింక్' కుదరదు'' అన్నాడు.

శాలిని ఇంత తేలిగ్గా విషయం తామిద్దరి మధ్యే పరిష్కారం అవుతుందనుకోలేదు. ఆమె వసంత్ గురించి చెప్పింది.

వెంటనే శరత్ శాలిని చేతిని ఆప్యాయంగా అందుకుని నొక్కి- ''కంగ్రాచ్యులేషన్స్... మీ పెళ్ళికి నేను తప్పకుండా వస్తాను'' అని సుజాత గురించి చెప్పాడు.

శాలిని నవ్వి- అభినందనలు అందించి నేను, వసంత్ కల్సివస్తాం మీ పెళ్ళికి. ఈ వూరితో- నాకు సంబంధం తెగిపోయింది అనుకున్నా- కానీ ఇప్పుడు నువ్వున్నావు''

అతను ఆగాడు. దగ్గరలో కనిపిస్తున్న చెరువు వైపు చూపిస్తూ ''అవిగో ఆ తామరలు కూడా ఉన్నాయి'' అన్నాడు.

మసక వెలుతురులో కూడా సౌమ్యంగా మనోహరంగా ఉన్న నిండైన తామరలని చూస్తూ శాలిని, తమ మొదటి పరిచయం గుర్తొచ్చి, తనలోతను స్పందించి- అతనివైపు ఆప్యాయంగా చూసి చిర్నవ్వు నవ్వింది.

★ ★ ★

ఫోను రింగయ్యింది.

చూస్తున్న ఫైలు నుంచి చూపు మరల్చకుండా రిసీవర్ అందుకుంది.

''హల్లో మిసెస్ శాలినీ ప్లీజ్''

''ఎస్... స్పీకింగ్''

''నేను రేఖని మాట్లాడుతున్నా''

శాలినికి ఒక్కనిముషం అవతల వ్యక్తి ఎవరో అర్థం కాలేదు ''ఏ రేఖ?'' అంది కాజువల్‌గా.

''అమ్మా! నీజీవితంలో ఎన్నిరేఖలున్నారు?'' అన్న జవాబు వినగానే గొంతుగుర్తుపట్టి, హుషారువచ్చి ''రేఖా... ఎక్కడ్నుంచి?'' అంది.

''ముందు ఇది చెప్పు. ఇంకా ఎన్ని రేఖలు తెల్సునీకు-'' అవతల్నుంచి టీజింగ్‌గా అంటున్న రేఖని చిరుకోపంతో- ''ఛీ నోర్మూయ్. గబుక్కున నువ్వు అని తెలీక అలా అన్నాను కానీ-''

''కానీ లేదు అర్థణాలేదు, చెప్పాల్సిందే ఎన్ని రేఖలు...''

''తల్లీ... క్షమించు''

''అలారా దారికి''

''సరేలే... ఎక్కడ్నుంచి''

''మా అత్తయ్య వాళ్ళింటికి వచ్చా- అక్కడ్నుంచీ''

''ఊళ్ళోకి దిగి ఎన్ని గంటలయ్యింది?''

''సుమారు పద్దెనిమిది గంటలు''

''అంటే... ఇప్పటివరకూ నేను గుర్తురాలేదు అంటే''

''అంటేగింటే ఏమీలేదు గానీ ఎప్పుడు కల్సుకుందాం-''

''ఎలాగూ టైము నాలుగవుతోంది. ఆఫీసు పనిపూర్తి చేసుకుని ఆరులోగా వస్తాను''

''తప్పకుండా''

''అంటే నీవుద్దేశం''

''ఏంలేదులే... చెప్పినమాట నిలబెట్టుకుంటావని నమ్మలేక''

కాసేపు ఆగి- ''ఎక్కడ ఎడ్రసు చెప్పు'' రేఖ చెప్పిన ఎడ్రసు పక్కన నోట్‌బుక్‌లో నోట్‌చేసుకుని నీ అనుమానం వట్టిది అని నిరూపిస్తాగా'' అంది.

''అదీ చూద్దాం... ఓ.కే. బై''

''బై, సీయూ''

''నన్ను ఇంతకీ గుర్తుపట్టగలవా అని''

''ఏం అంత మారిపోయావా?''

''నేను కాదు నువ్వు''

''అంత తిరకాసుగా మాట్లాడతావేం?''

''ఏమో! ఏరేఖ అన్నదానివి''

''నీకు పెళ్ళయ్యాక వాగుడు పెరిగింది రేఖా''

''సంతోషం! నా పెళ్ళికి రాకపోయినా నాకు పెళ్ళయ్యింది అన్న విషయం గుర్తున్నందుకు''

శాలిని నవ్వి- ''సరే ఉంటా బై''.

''బై''



రేఖ గుర్తొచ్చి, శాలిని మరోసారి తనలో తను ఆత్మీయంగా నవ్వుకుంది.



సాయంత్రం ఆరుగంటలకు వెళ్ళేసరికి రేఖ నవ్వుతూ ఎదురొచ్చింది. రేఖని చూడగానే శాలిని నవ్వుతూ- "లావయ్యావేయ్" అంది.

రేఖ శాలినిని కావలించుకుని బుగ్గమీద ముద్దుపెట్టుకుని- "కానీ నువ్ మాత్రం అలానే ఉన్నావ్. కొంపదీసి నీదగ్గర సంజీవిలాంటి మూలిక ఏదైనా ఉందా? లేక అమృతం తాగావా?"

శాలిని నవ్వింది-

శాలిని నవ్వులో ఒక ప్రత్యేకత, ఒక స్వచ్ఛత, మంచితనం కన్పిస్తాయి. రేఖ శాలినివైపు ముచ్చటగా చూస్తూ- "నీ నవ్వు కూడా మారలేదు" అంది.

శాలిని మరోసారి నవ్వి- "కాసేపటికి నీ ముక్కు మారలేదు. చెవులు మారలేదు. కళ్ళు మారలేదు. జుత్తు మారలేదు అని మొదలుపెడతావేమో" అంది టీజింగ్‌గా.

రేఖ కొంచెం సీరియస్సయ్యి- "మనిషి మారావేమో అని" అంది.

శాలినికి అర్థమయ్యింది. రేఖ మనసులో ఏదో ఉంచుకుని అలా మాట్లాడుతోంది అని.

"బీచ్‌కి పోదాం... అక్కడ మాట్లాడుకుందాం-"

"అమ్మో! అంతకన్నానా? పద పోదాం" అని ఆగి- "మీ శ్రీవారికి చెప్పే వచ్చావా".

"ఫోను చేశాలే. మనం రాత్రి తొమ్మిదికి వెళ్ళినా అభ్యంతరంలేదు. భోజనంతోసహా రెడీగా ఉంటాయి"

రేఖ నవ్వి- లోపలకు వెళ్ళి మళ్ళీ అత్తయ్యతో చెప్పి వచ్చింది.

ఇద్దరూ బయటకు వచ్చారు. బయట కైనెటిక్ హోండా చూసి-

-"ఓఁ భలే క్యూట్‌గా ఉందోయ్" అంది.

శాలిని నవ్వి హోండా స్టార్ట్ చేసింది. రేఖ వెనకాల కూర్చుంటూ-

"ఈరోజుతో నాకు ఈ భూమ్మీద నూకలు చెలినట్టేనా" అంది.

శాలిని మరోసారి నవ్వి "నువ్వు ఒక విషయం గమనించావా రేఖా! పెళ్ళయ్యాక నిజంగానే నీకు వాచాలత పెరిగింది"

రేఖ నవ్వి "నిజమే... ఏంచెయ్యను చెప్పు. మా ఆయన డిప్యూటీ ఎకౌంట్స్ ఆఫీసర్ ఆఫీసులోనూ, ఇంట్లోనూ కూడా కంప్యూటర్ లెక్కలు షీట్ సరిచూసుకోవడమే సరిపోతుంది. ఇక ఆయన వాటా మాటలు కూడా నేనే మాట్లాడతాను పాపం! ఆయన చక్కగా చిరునవ్వులు, తలకాయ వూపడాలూ, "ఆఁ", "వూఁ" అనడంతో సరిపెట్టేసుకుంటారు అదే విషయం" అంది.

శాలిని నవ్వి "పెళ్ళి అనేది స్త్రీ పురుషులిద్దర్నీ మారుస్తుంది. ఎలా అనేది బహుశా పార్టనర్ని బట్టి వుంటుందనుకుంటాను"

రేఖ మరేం మాట్లాడలేదు. ఇద్దరూ బీచ్‌లో జనాన్ని సముద్రాన్ని చూస్తూ ఒకచోట కూర్చున్నారు. "వూఁ చెప్పు విశేషాలు" అంది రేఖ అటూఇటూచూస్తూ.

"చెప్పడానికి చాలా వున్నాయి రేఖా, కానీ ఇందాక ఏవిటో అన్నావు, మనిషి మారావేమో అని"

"ఆ మాటలు ప్రత్యేకంగా గుర్తు పెట్టుకుని అడుగుతున్నావు అంటే నువ్ చాలా షార్ప్ శాలీ"

"ఆ మాటల్ని బట్టి నీకు నామీద ఏదో చిన్న అనుమానం, చిన్న కోపం, చిన్న ద్వేషం ఉన్నాయని నాకు అన్పించింది."

రేఖ కాసేపు ఆలోచించి నెమ్మదిగా— "నిజమే" అంది

"ఎందుకు?"

"నీకు తెలీదా?"

"నాకు తెల్సిందే నువ్ అనుకుంటున్నావని ఏముంది- నువ్వే చెప్పు"

కాసేపు ఆలోచించి— "ఆరోజులే బావుండేవి కదూ శాలీ" అంది.

శాలిని చిన్నగా నిట్టూరి— "లేదు రేఖా— ఆ రోజులు నాకు చాలా చేదుని మిగిల్చాయి తప్ప ఆనందాన్ని కాదు. చాలామంది చదువుకునే రోజులు ఎంతో హేపీగా, జాలీగా వుండేవి అంటారు. కానీ ఎందుకో నాకు అలా అనిపించదు. ఏదో గండందాటి వచ్చినట్టు, ఇప్పుడే కొంచెం స్వేచ్ఛగా, సుఖంగా ఉన్నట్టు అన్పిస్తుంది" అని వికారంగా మొహంపెట్టి గబగబ బ్యాగ్‌లో ఉన్న నిమ్మతొన తీసి నోట్లో వేసుకుంది.

అది రేఖ గమనించి— "ఏవిటి విశేషమా?" అంది.

శాలిని మనోహరంగా నవ్వి— "నాలుగో నెల" అంది.

"అమ్మో! మరింతసేపు చెప్పవేం? కంగ్రాచ్యులేషన్స్ —

జీవితంలో అన్నీ అనుకున్నట్లు సాధించుకున్నావ్" అంది.

"ఏంసాధించానంటావ్?"

"చదువు కావాలనుకున్నావ్. పి.హెచ్.డి చేసి డాక్టరేట్ తెచ్చుకున్నావు. అర్థం చేసుకునే - సహృదయుడ్ని - ఎడ్యుకేటెడ్ - యూనివర్సిటీ అసిస్టెంట్ ప్రొఫెసర్‌కి ఇల్లాలివయ్యావు. ఇప్పుడు మరో కల వాస్తవం కాబోతోంది-"

"అదిసరే... ముందునేను అడిగినదానికి నువ్వు జవాబు చెప్పలేదు"

కాసేపు సముద్రాన్ని చూసి దృష్టి మరల్చి - శాలిని కళ్ళల్లోకి చూస్తూ- "నీకు గతం గుర్తుందిగా" అంది.

శాలిని మవునంగా తలవూపింది. "అప్పుడు శరత్ - నీకోసం తపనపడి - మళ్లీ నిన్ను కాలేజీలో జాయిన్ చెయ్యాలని తాపత్రయపడి దెబ్బలు తిన్నాడు. వెంకట్రామయ్యగారు మీ అమ్మానాన్నలను ఒప్పించి - నీకు నచ్చినచోట ఎమ్.ఏ చదవడానికి వీలు కల్పించారు. నిన్ను వాళ్ళు తమ కోడలిగా వూరంత చెప్పుకున్నారు. కానీ నువ్ చేసిందేమిటీ?-"

"ఏరుదాటి తెప తగలేశాను అంటావు"

శాలిని హర్ట్ అయ్యిందని గ్రహించి రేఖ ఆమె చేతుల్ని ఆప్యాయంగా స్పర్శించి— "నా ఉద్దేశ్యం అదికాదు శాలీ—"

"నాకు తెల్సు రేఖా— కానీ నువ్ చెప్పింది కరక్టే. నా చదువు కొనసాగడానికి కారణం శరత్, వెంకట్రామయ్యలు. అందుకు నాకు వాళ్ళంటే ఇప్పటికీ కృతజ్ఞత, అభిమానం, ఆపేక్ష ఉన్నాయి. ముఖ్యంగా వెంకట్రామయ్య గారు అంటే— మా అమ్మ, నాన్నకన్నా ఎక్కువ నాకు. కానీ శరత్‌తో జీవితం పంచుకోవడం అనేది కుదిరేపని కాదని ఆ తర్వాత నాకు అర్థంఅయ్యింది"

"మరి మీరిద్దరూ ప్రేమించుకున్నారూ" ఆశ్చర్యంగాఅంది.

"ఒక్కసారి ఆలోచించురేఖా. నిజంగా మేమిద్దరం ప్రేమించుకున్నామా? ప్రేమ అంటే ఒకరిపట్ల మరొకరికి ఆకర్షణ ఉండటంకాదు. ఇద్దరూ తమనితాము, జీవితాన్ని అర్థం చేసుకుంటూ ఒకవైపు చూడటం. శరత్‌కి నామీదఉన్నది ఆకర్షణ, ఇన్‌ఫాట్యుయేషన్. ఒక అందమైన అబ్బాయి మోజుపడి ఒక అందమైన అమ్మాయిని కావాలనుకున్నాడు. ఆ కావాలనుకోవడం ఎటువంటిదో, శరత్‌కే ఆ రోజుల్లో తెలీదు. బహుశా మా తల్లిదండ్రులు అనవసరమైన హంగామా చేయకుండాఉంటే- సమాజం మాపట్ల కాస్త సహృదయత చూపించినా శరత్ కూడా నీలా ఒక మంచి స్నేహితుడు మాత్రం అయ్యివుండేవాడు. నీలా సరదాగా మాఇంటికివచ్చి నాతో నాలుగు కబుర్లుచెప్పి- సాయంత్రాలు వచ్చి పిచ్చాపాటీ మాట్లాడి వెళ్ళిఉండేవాడు. అంతేగానీ అతనికి నామీద ఇన్‌ఫాట్యుయేషన్ డెవలప్‌అయి ఉండేదికాదు. కానీ శరత్‌ని కొట్టించడంతో- అంతవరకు మామూలుగాఉన్న నేనుకూడా- 'నావల్ల అతను ప్రాణానికి తెగించాడు, అనుకోగానే అతనిపట్ల దయ, ఆర్ద్రత పెరిగాయి. అది 'ప్రేమ' అని తర్వాత పెళ్లి చేసుకోవాలని మాకు తెలీదు. కానీ మా తల్లిదండ్రులు వాళ్లకేదో తెల్సినట్టుగా మా వివాహం నిశ్చయించారు.

ఆ రోజుల్లో వివాహాన్ని నేను సీరియస్‌గా తీసుకోలేదు. కానీ నా ఆలోచనలు, జీవితంపట్ల నా దృక్పథం మెచ్యూర్ అయ్యేకొలదీ- మా ఆలోచనల్లోవున్న అంతరం నేను గమనించా- ఒకవేళ మేం వివాహం చేసుకుంటే, ఇద్దరి జీవితాలు నరకం అవుతాయి అన్పించింది. ఈరోజు మా అమ్మానాన్నలు మా పెళ్లి నిర్ణయించారుకదా అని తలవంచితే- ఇక జీవితాన్ని నడిసముద్రంలోకి విసురుకున్నట్టే అన్పించింది. నా జీవితం మీద నాకు గ్రిప్‌పోతుందనితెల్సి- నేను ఒక నిర్ణయానికివచ్చా. విచిత్రం ఏమిటో తెల్సా- నేను ఆరోజున ఎటువంటి నిర్ణయానికి వచ్చానో- ఇంచుమించు అదేటైముకు శరత్‌కూడా ఆ నిర్ణయానికే వచ్చాడు''

"అంటే" ఆశ్చర్యంగా అడిగింది "నేను వసంత్‌ని చేసుకోవాలని నిర్ణయించుకునేప్పటికే- శరత్ ఆల్‌రెడీ సుజాతని చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు. నన్ను పెళ్ళికి కూడా పిలిచాడు. సరిగ్గా అదే టైములో నా థీసిస్ సబిమిట్ చేయాల్సివచ్చి రాలేకపోయాను''

రేఖ నిట్టూర్చి- "సారీ! నాకివ్వన్నీ తెలీవు. అనవసరంగా నిన్నుబాధపెట్టాను" అంది.

" లేదు నువ్వలా ఫీలవ్వకు. కానీ జీవితంలో సరైన సమయంలో సరైన నిర్ణయాలు తీసుకోకపోతే, జీవితాంతం బాధపడతాం అనే పాలసీనాది''

"మర్చిపోయా చెప్పడం- మొన్న మన ఊరువెళ్ళా. వెంకట్రామయ్యగారు పక్షవాతం వచ్చి మంచంపట్టారు''

శాలిని కంగారుగా- "ఎప్పట్నించీ నాకు తెలీదే" అంది.

"నెల రోజులు అయింది''

"అయ్యో అసలు తెలియలేదే? అవున్లే మనకి ఎవరు చెబుతారు. రెండు మూడు రోజులు లీవుపెట్టి వెళ్ళిచూసిరావాలి''

"నువ్వు వెళతావా?''

"ఏం...అలాఅడుగుతున్నావు?''

"కానీ-"సందేహంగా ఆగిపోయింది."నాకు తెల్సు. నీఅనుమానం. వెంకట్రామయ్యగారు నాకు అమ్మానాన్నకన్నా ఎక్కువ. ఆయన ఒక మాట పరుషంగా అన్నా- నేను బాధపడను. అలా మాట్లాడే హక్కు ఆయనది, పడే బాధ్యత నాకు వున్నాయి''

"మీ అమ్మనాన్న వసంత్‌తో నీ పెళ్ళి ఒప్పుకోలేదు అని తెల్సుకానీ తర్వాత-''

"తర్వాత కూడా నాలుగైదు ఉత్తరాలు రాశాను. కానీ జవాబురాలేదు. ఎందుకులే వాళ్ళకి అంత ఇష్టం లేనపుడు బాధపెట్టడం అని నేను కూడా రాయలేదు''

రేఖ సాలోచనగా- "నీ జీవితం మాత్రం నాకు భలే విచిత్రంగా వుంటుంది శాలీ" అంది.

శాలిని నవ్వి వూరుకుంది.

★ ★ ★

ఆమ్లెట్ సాండ్ విచెస్ వసంత్ ముందు ప్లేటులో పెడుతూ, కెచప్ వేస్తూ- వసంత్ మొహంలోకి పరిశీలనగా చూసింది. అదే ప్రశాంతత, గంభీరత, నిర్మలత్వం- నిజంగా ఒక మగవాడిలో అంత స్థిరత సాధ్యమా? అని ఆశ్చర్యపరిచేటంత ముచ్చటగా ఆప్యాయంగా, ఆపేక్షగా అతని మొహం మరోసారి చూసుకుంది. వసంత్ పేపరు చూస్తూ తింటున్నాడు.

"వసూ" అంది నెమ్మదిగా.

ఆ స్వరంలో వున్న తేడాకి వసంత్ తలెత్తి చూశాడు భార్య కళ్ళల్లోకి.

"నాకు మావూరు వెళ్ళాలని వుంది''

కళ్ళల్లో ఒక రకమైన దిగులు, స్వరంలో అతి నెమ్మది గమనించి- ఆశ్చర్యం కలిగింది. దాదాపు ఈ మూడున్నర సంవత్సరాలలో ఎప్పుడూ ఆమె వూరు సంగతి ఎత్తలేదు. చివరికి శరత్ పెళ్ళికి కూడా కుదరదు వెళ్ళడం అని గ్రీటింగ్స్ మాత్రం పంపింది.

"అలాగే! ఎందుకంత సడన్‌గా వెళ్ళాలనిపించింది" మృదువుగా అడిగాడు.

"వెంకట్రామయ్యగారికి పక్షవాతం వచ్చి మంచం పట్టారట-''

"అరె... రె... ఎప్పుడు తెల్సింది''

"నిన్ననే ... రేఖ చెప్పింది. రాత్రంతా ఆలో





ంచాను. వెళితేనే బావుంటుందనిపించింది. అదీగాక మనసులో ఆయన్ని చూడాలని గట్టిగా అనిపిస్తోంది"

"అలాగే. వెళదాం"

"మీరు వస్తారా?" ఆశ్చర్యంగా అంది.

"అవును ... నిన్నొక్కదాన్నీ ఎలా పంపిస్తా"

"సారీ"

"ఫరవాలేదు ... అక్కడ ఏం జరిగినా, ఎటువంటి అవమానాలు, అమర్యాదలు ఎదురయినా పట్టించుకోను. నీకోసం ఆ మాత్రం భరించలేనా? నిన్ను ఒంటరిగా మాత్రం వెళ్ళనివ్వను"

శాలినికి ఆ మాటల్లోని తనపట్లవున్న ప్రేమని అనుభవిస్తూ- ఆస్వాదిస్తూ వసంత్‌ని ఆనందంతో కావలించుకుని- "ఐయామ్ లక్కీ. రియల్లీ లక్కీ" అంది. వసంత్ నవ్వి ఒక బ్రెడ్ స్లైస్‌ని ఆమె నోట్లోపెట్టాడు.

★ ★ ★

వసంత్, శాలిని వారంరోజులు లీవుపెట్టి బయల్దేరారు. బస్టాండు నుంచి లాడ్జీకి వచ్చి స్నానం అదీ చేసి, ఫ్రెష్ అయ్యి, కిందకు దిగి- హోటల్‌లో టిఫిన్ చేసి రిక్షాలో బయల్దేరారు.

శాలిని బిగపెట్టుకుని కూర్చుని వుండటం గమనించి వసంత్ చిర్నవ్వుతో- "రిలాక్స్... ఎందుకంత టెన్షన్... రిలాక్స్" అన్నాడు.

శాలిని వసంత్ వైపుచూసి చిర్నవ్వు నవ్వి వూరుకుంది.

రిక్షా వెంకట్రామయ్యగారి ఇంటిముందు ఆగింది. బయట ఒక బాబు, పాప ఆడుకుంటున్నారు. వాళ్ళని చూడగానే శరత్ పిల్లలు అనుకుంది. రిక్షా ఆగిన శబ్దానికి శరత్ లోపల్నుంచి ఎవరా అని తొంగిచూశాడు.

శాలినిని చూసి ఆశ్చర్యపోయి, తేరుకుని- "శాలినీ ఎప్పుడొచ్చావు?" అంటూ బయటకు వచ్చాడు.

శాలినికి శరత్‌ని అలా చూడగానే టెన్షన్ రిలీఫయినట్టు అన్పించి, నవ్వేస్తూ— "గుర్తుపట్టావా? ఏమో ఎవర్నువ్వు? అంటావేమో అనుకున్నా"

"ఛ... అలా ఎందుకంటాను" అన్నాడు శరత్ మొహమాటంగా.

వసంత్ చిర్నవ్వుతో వాళ్ళిద్దరి సంభాషణని వింటున్నాడు.

శాలిని వసంత్‌వైపు తిరిగి "ఇతనే శరత్" అంది.

వసంత్ చిర్నవ్వుతో - కుడిచెయ్యి ముందుకు చాపి - "గ్లాడ్‌టు మీట్‌యు. ఐయామ్ వసంత్. మీ శాలిని భర్తని" అన్నాడు.

శరత్ షేక్‌హ్యాండ్ ఇచ్చి — "రండి లోపలికి" అని ఆహ్వానించాడు.

ఇద్దరూ శరత్‌ని అనుసరించారు.

లోపలికి వస్తూ— "నాన్నగారికి ఎలా వుంది?" అంది శాలిని ఆతృతగా.

"అలాగే వున్నారు. కుడిచెయ్యి, కాలు పక్షవాతం వచ్చి పడిపోయాయి. మంచంమీద నుంచి లేవడంలేదు. మరోమనిషి సాయం కావాలి" అని — "నీకెలా తెల్సు" అన్నాడు ఆశ్చర్యంగా.

"రేఖ చెప్పింది- మామయ్యని చూడటానికే వచ్చాను"

"రా - ఇలా..." అని లోపలకు తీసుకువెళ్ళాడు.

వెంకట్రామయ్య మంచంమీద బలహీనంగా పడుకుని వున్నాడు. ఆయన్నలా చూసేసరికి శాలినిలో దుఃఖం వుప్పొంగింది. మంచం దగ్గరగా వెళ్ళి - దుఃఖాన్ని ఆపుకోవడానికి ప్రయత్నిస్తోంది. అప్పటికే కళ్లనిండుగా కన్నీళ్ళు.

వెంకట్రామయ్య ఈ అలికిడికి మూసుకున్న కళ్ళని నెమ్మదిగా తెరచి, అలసటగా "ఎవరూ?" అన్నాడు.

"నేను శాలినిని మామయ్యా" అంది మంచంమీద పక్కగా కూర్చుంటూ.

"ఏమ్మా? బావున్నావా? ఎన్నిసంవత్సరాలయ్యింది నిన్ను చూసి" అన్నాడు మెత్తగా వెంకట్రామయ్య.

ఆ ఆప్యాయతకు ఆమెకు దుఃఖం కట్టలు తెంచుకుంది. ఆయన ఎడంచేయి పట్టుకుని దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కిళ్ళు పడింది.



"వూరుకో... వూరుకోమ్మా" వెంకట్రామయ్య ఓదారుస్తున్నాడు.

ఆ ఓదార్పులోని ఆప్యాయతకు శాలినిలో ఆర్ద్రత, వేదన మరింత ఎక్కువయ్యి వుప్పెన గాలికి వూగిపోతున్న అరటిచెట్టులా - దుఃఖాన్ని తట్టుకోలేకపోతోంది. ఆమెకి గతమంతా గుర్తుకొస్తోంది. తనపట్ల ఆయన చూపిన మమత, ఆప్యాయత, ఆపేక్ష ఎందుకో - అంత హుషారుగా, గంభీరంగా, హుందాగా వుండే ఆరడగుల మనిషి అలా దిగులుగా, నీరసపడి, మంచంమీద పడి వుండటం ఆమె చూడలేకపోతోంది.

ఎవరో వచ్చారని గ్రహించి శకుంతల, సుజతలు ఆ గదిలోకి వచ్చారు. శకుంతల చూడగానే 'శాలిని' అని గ్రహించింది.

శరత్, వసంత్ మౌనంగా నిల్చుని వున్నారు.

శరత్‌కి ఆశ్చర్యంగా వుంది. శాలినికి తన తండ్రి అంటే అంత మమత, ఆప్యాయతా వున్నాయని అనుకోలేదు. అలాగే తన తండ్రికి శాలిని అంటే అంత ఇష్టం అని గ్రహించలేదు. వాళ్ళిద్దర్నీ ఇలా చూశాక - వాళ్లిద్దరూ ఒకళ్ళంటే ఒకళ్ళు ఎలా అభిమానించుకున్నారో, గౌరవించుకున్నారో తెలుస్తోంది.

ఆమె శాలిని అని అర్థమయ్యింది. శాలినిని కుతూహలంగా చూస్తోంది.

"మీకు నా మీద కోపం లేదు కదా మామయ్యా—"

"ఎందుకమ్మా కోపం. నీలాంటి మాణిక్యాన్ని ఈ పల్లెటూర్లో వుంచాలనుకోవడం నాదే పొరపాటు. ఇప్పుడు ఏం చేస్తున్నావమ్మా?—"

"ఒక ఫారిన్ ప్రచురణ సంస్థకు ఇండియన్ ఎడిటర్‌గా చేస్తున్నా. జీతం ఐదువేల పైన".

"బావుందమ్మా—" అని వెంకట్రామయ్య సంతోషించాడు.

చూపుమరలుస్తూ వసంత్‌ని చూస్తున్న వెంకట్రామయ్యని చూసి—"వీరు, వసంత్. మద్రాసు యూనివర్సిటీలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు" అంది.

వసంత్ మొహం చూడగానే వెంకట్రామయ్యకు వసంత్ నచ్చాడు. మన్నన మర్యాద తెల్సిన కుర్రాడు అన్పించింది ఆయనకు.

"బావుందమ్మా. మీ అమ్మానాన్నల మూర్ఖత్వంకానీ, నేనే నీ తండ్రినైతే నీ దగ్గరకి వచ్చి వుండేవాడ్ని—"

శాలిని ఆ మాటలకి కదిలిపోయి— "ఇప్పుడయితే మాత్రం రాకూడదా మామయ్యా. మీరు మా అమ్మానాన్నలకన్నా నాకు ఎక్కువ—"

"ఈ ముసలాడికి చాకిరీ చెయ్యలేవమ్మా. లేకపోతే వచ్చేవాడినే—"

శాలిని కళ్ళనుండి చెంపలమీదుగా కన్నీరు జాలువారింది. ఆ మాటలకి ఎందుకో మనసులో చాలా దిగులేసింది.

"నువ్వేదో ధైర్యస్థురాలివనుకున్నా. ఇంత మెత్తనిదానివైతే ఎలా తల్లీ—" అన్నాడు.

అప్పటికి శకుంతల కంఠం పెగుల్చుకుని "బావున్నావా శాలినీ" అంది.

శాలిని తలెత్తి— "బావున్నాను అత్తయ్యా" అంది కళ్ళు తుడుచుకుంటూ నెమ్మదిగా.

అలాగే నిల్చున్న వసంత్‌ని చూసి వెంకట్రామయ్య— "ఒరే అబ్బాయిని అట్లాగే నిల్చోపెట్టావు. ఇక్కడ కుర్చీ వెయ్యి—" అన్నాడు.

వెంకట్రామయ్య శారీరకంగా కదలలేకపోయినా, ఇంకా కంఠంలోని ధ్వనిస్తున్న ధీమా, మనస్థైర్యం చూసి శాలిని కొంచెం రిలాక్సయింది.

సుజాత లోపలకు వెళ్ళి కాఫీ తెచ్చి ఇద్దరికీ ఇచ్చింది.

వెంకట్రామయ్య— "తీసుకోమ్మా—" అన్నాడు. మరి కాసేపటికి "వాళ్ళు అక్కడ ఎలా వుంటున్నారు? ఏమిటి?" అని అన్నీ కుతూహలంగా అడిగి తెల్సుకున్నాడు.

శరత్ మరో పావుగంటకు వచ్చి— "అలా షాప్‌కు వెళ్తున్నా—" అన్నాడు.

వసంత్ లేచి— "నేనూ వస్తా" అని శాలిని వైపు చూశాడు.

శాలిని తల వూపింది.

వెంకట్రామయ్య— "వెళ్లిరా బాబూ. మన శాలిని పుట్టిన వూరు. నువ్వు చూడాల్సిందే. వూరంతా చూపించరా శరత్—" అన్నాడు.

శరత్ నవ్వుతూ— "మన వూరు పెద్ద సిటీ. చూపించాల్సినవి మరి చాలా వుంటాయి" అన్నాడు.

వసంత్ చిరునవ్వు నవ్వి - శరత్ కూడా బయటకు వెళ్ళాడు. అందరూ గదిలోంచి వెళ్ళిపోగానే - వెంకట్రామయ్య నెమ్మదిగా అన్నాడు— "నువ్వు కనీసం నాతో మాటమాత్రం చెప్పకుండా వెళ్ళిపోయినందుకు ముందు కోపం వచ్చింది. తర్వాత బాధ కలిగిందమ్మా—"

"చెప్పాలనుకున్నా మామయ్యా. కానీ మీరు దాన్ని ఎలా తీసుకుంటారో తెలీదు. అమ్మానాన్నలని ధైర్యంగా ఎదిరించాను కానీ, మీ విషయంలో పిరికిదాన్ని మామయ్యా. మీకు ఆ విషయం చెబితే బాధ పడతారని - మీ బాధని చూడలేక - ఆ బాధకి నేనే కారణం అని గిల్టీగా ఫీలయ్యి - ఇదంతా వూహించుకుని - వాస్తవాన్ని ఎదుర్కోలేక వెళ్ళిపోయాను మామయ్యా. కానీ ఎప్పుడూ మీరు గుర్తుకు వస్తూనే వుంటారు. నేను మిమ్మల్ని మర్చిపోలేదు. డాక్టరేట్

తీసుకుంటున్నప్పుడు, ఈ సంస్థలొ ఇంత పెద్ద ఉద్యోగం వచ్చినప్పుడు - మొదటి జీతం అందుకుంటున్నప్పుడు - వసంత్ థియరీని నేను బుక్‌గా రాస్తే అది పబ్లిష్ అయ్యి రిలీజ యినప్పుడు - మీరే జ్ఞాపకం వచ్చారు మామ య్యా—''

"చాలమ్మా. అది చాలు" అని ఆగి, 'పిల్లలా' అన్నాడు.

"లేదు మామయ్యా. నాలుగో నెల" అంది నెమ్మదిగా.

సంతోషంగా— "మరేం. చెప్పావు కావు ఇప్పటివరకూ—" అని లోపలున్న శకుంత లని పిలిచాడు.

శకుంతల రాగానే మెరుస్తున్న కళ్ళతో— "అందరి నోళ్ళూ తీపి చెయ్యి. మన శాలిని నాకో మనవడ్ని ఇవ్వబోతోంది" అన్నాడు.

శకుంతల నవ్వుతూ— "అలానా" అని లోపలకు వెళ్ళింది.

శాలిని నవ్వుతూ— "మీ కంఠంలో ధీమా, అథారిటీ తగ్గలేదు" అంది.

"నువ్వలా అంటున్నావు కానీ - మనవళ్లు - మంచంమీద పడివున్నా - ముసలాడు కేకలు పెట్టి అరుస్తూ చంపుతున్నాడు అనుకుంటూ వుంటారు—" అని నవ్వాడు. ఆ నవ్వులో విషాదం ధ్వనించింది.

కాసేపు నిశ్శబ్దం. తర్వాత - జీరబోయిన గొంతుతో— "నా కొడుకులా కాకుండా నీ కొడుకుని ప్రయోజకుడ్ని చెయ్యి తల్లీ. నువ్వు చేస్తావులే—" అన్నాడు.

శాలిని బాధగా— "ఏమిటి మామయ్యా" అంది.

"ఈ చివరి రోజుల్లో వాడు నాకు పెద్ద దిగులైపోయాడు. వయసు పెరిగింది. భార్య, ఇద్దరు పిల్లలు. కానీ లోకం సంగతి ఇంకా తెలీని పసివాడుగానే మిగిలిపోయాడు. నేను పోయాక ఈ సంసారం ఏమవుతుందో' నిట్టూ ర్చాడు.

శాలిని ఆయన చేతిని ఒళ్ళో పెట్టుకుని స్పర్శిస్తూ— "మీరేం దిగులు పడకండి మామయ్యా. నేను, వసంత్ వున్నాం" అంది.

"నాకు తెల్సమ్మా...నీది మంచి మనసు"

"దయచేసి అలా అనకండి మావయ్యా. మీరు నాపట్ల చూపిన మంచితనం ముందు నేనెంత?"

వెంకట్రామయ్య చిర్నవ్వు నవ్వి- "అందుకే నిన్ను నా కోడల్ని చేసుకోవాలనుకున్నా- ఆ మూర్ఖుడికి నీ విలువ తెలీలేదు"

శాలిని మరేం మాట్లాడలేదు.

మరికాసేపటికి శకుంతల పాయసం తీసు కువచ్చింది.

శాలిని తనే స్వయంగా స్పూనుతో వెంకట్రా మయ్యకు తినిపించింది.

"మీ అత్తగారు, మావగారు మీతోనే వుంటా రమ్మా"

"లేదు మావయ్యా. మావగారు వాళ్లు స్వంత ఇంట్లో మద్రాసులోనే వుంటారు. మా ఆడబడు చుకు ఈమధ్యనే పెళ్ళయ్యింది. అదీ ప్రేమ వివాహమే. ఆ అబ్బాయి బెంగాలీ. తను కలకత్తాలో వుంటాడు. అపుడపుడు మావయ్యా అత్తయ్యా వచ్చి నాలుగైదు రోజులు మాదగ్గరే వుంటారు. మేం కూడా శని ఆదివారాలు అక్కడ వుంటాం"

"అదృష్టవంతురాలివి. నువ్వు సంతోషంగా వున్నావు. నాకూ అదే కావాల్సింది" అన్నాడు సంతృప్తిగా.

కాసేపు ఆగి- "అమ్మా, నాన్నలని చూడటా నికి వెళ్లారుగా"

కొంచెంసేపు ఆలోచించి- "సాయంత్రం నేను, వసంత్ వెళదామనుకుంటున్నాం"

"మంచిది అలా చెయ్యి. వెళ్ళి చూడటం నీబాధ్యత. వాళ్ళు ఏమన్నా పట్టించుకోకు"

ఆయన చూపిస్తున్న ఆదరానికి శాలిని హృ దయం ఆయనపట్ల ఆప్యాయతతో నిండిపో యింది.

★ ★ ★

సాయంత్రం-

శాలిని, వసంత్ వెళ్ళేసరికి రుక్మిణీనాథరావు అరుగుమీద కూర్చుని ఎవరితోనో మాట్లాడుతు న్నారు.

గేటు తీసుకుని లోపలకు వస్తున్న ఆ ఇద్దర్నీ

చూసి, ముందు గ్రహించకపోయినా, కొద్ది దగ్గ రకురాగానే అర్థమయ్యింది. కూతురు శాలిని- బహుశా పక్కన వున్న వ్యక్తి అల్లుడు అని.

వెంటనే రుక్మిణీనాథరావుకి ఏం చెయ్యాలో తోచలేదు.

శాలిని తండ్రిని చూస్తూ- "బావున్నారా?" అంది.

వూ అని- అలాగే నిల్చున్న ఇద్దర్నీ అలాగే చూస్తూవుండిపోయాడు.

శాలినికి అర్థమయ్యింది. ఆయన లోపలకు రమ్మనమని అనడని. తనే లోపలకు వెళ్ళింది. వెనకాల వసంత్ వెళ్లాడు.

రుక్మిణీనాథరావుతో మాట్లాడుతున్న వ్యక్తి- "ఎవరూ బంధువులా?-" అన్నాడు.

రుక్మిణీనాథరావు- "ఆఁ బంధువులే-" అన్నాడు.

తండ్రి ఏంచెబుతాడా అని ఆత్రుతగా విన్న శాలిని చిన్నగా నిట్టూర్చింది.

కన్నకూతురు బంధువు అని విరక్తిగా మన సులో నవ్వుకుంది. వచ్చిన వ్యక్తి- "మళ్ళీ వస్తాలెండి-" అని వెళ్ళిపోయాడు.

రుక్మిణీనాథరావు లోపలకు వచ్చాడు. శాలిని అలాగే నిల్చుని- తను పుట్టి పెరిగిన ఇంట్లోనే కొత్తగా నిల్చోవల్సి వచ్చినందుకు విచిత్రంగా ఫీల్అవుతోంది.

ఇలా జరుగుతుందని ముందే వూహించింది. కానీ నిజంగా అలా జరిగేనరికి ఆశ్చర్యంగా వుంది.

సరస్వతమ్మ లోపట్నుంచి వస్తూ- "ఎవరూ" అని- శాలినిని చూస్తూనే స్థాణువైపోయింది.

రుక్మిణీనాథరావు వ్యంగ్యంగా- "నీ కూతురు వచ్చింది. మనం బ్రతికున్నామా చచ్చిపో యామా అని చూడటానికి" అన్నాడు.

సరస్వతమ్మ ఏం మాట్లాడలేదు. శాలినికి బాధకలిగింది- "వచ్చి మిమ్మల్ని బాధపెట్టి నందుకు క్షమించండి- వెళతాం" అంది వెన క్కి తిరుగుతూ.

"ఎందుకొచ్చినట్లు-" అన్నాడు రుక్మిణీనాథ రావు ఇంకా వ్యంగ్యంగానే.

"ఒకసారి చూడాలనిపించింది. వచ్చాం ఇక వెళతాం" అంది.

రుక్మిణీనాథరావు ఏం మాట్లాడలేదు. సరస్వ తమ్మ అలాగే నిలబడిపోయింది.

ఇద్దరూ వెనుతిరిగి వచ్చేశారు.

మౌనంగా వున్న శాలినిని చూసి వసంత్‌కి- ఆమె లోలోపల ఎంతో కుమిలిపోతోందని అర్థ మయ్యింది. శాలిని చెయ్యి ఆప్యాయంగా నొక్కి- "బాధపడకు. ఇదంతా సహజంగా తీసు కో" అన్నాడు.

శాలిని అన్యమనస్కంగా తలవూపింది.

వెంకట్రామయ్య రాత్రికి అక్కడే వుండమ న్నా- మళ్ళీ ఉదయం వస్తాం అని ఇద్దరూ వచ్చి రూముకు వచ్చారు. అప్పటికి సమయం ఎనిమిది.

లోపలికి రాగానే- అంతవరకు ఖర్చీఫ్‌లో భద్రంగా దాచిన చిన్న తామరపువ్వుని బయ టకు తీశాడు వసంత్.

శాలిని ఆశ్చర్యంగా, వింతగా చూసింది.

వసంత్ దగ్గరకు వచ్చి- పువ్వుని అందించా డు. శాలిని చిర్నవ్వుతో అందుకుంటూ- "సా యంత్రం నుంచీ అడుగుతుంటే చెప్పలేదు. ఇదా" అంది.

"నన్సెన్సుగా ఉండాలని"

"ఎక్కడిది?"

"నీ చెరువులోదే"

"ఎలా తెల్సుమీకు?"

"గతంలో నువ్వు చెప్పింది మర్చిపోలేదు. ఈ రోజు శరత్‌ని అడిగాను చూపించమని"

కాసేపు ఆగి- "ఎవరు కోశారు దీన్ని?" అంది.

వసంత్ నవ్వి- "నాకు తెల్సు ఎందుకు అలా అడుగుతున్నావో- శరత్ కాదు నేనే కోశాను"

శాలిని విచిత్రపడి- "కానీ మీకు-"

"నాకు ఈతరాదు నిజమే. ఈ చిన్ని తా మర నాకోసమే ఒడ్డుకు దగ్గరగా చెయ్యి చాస్తే అందే అంత దగ్గరగా పూచింది"

ఆప్యాయంగా ఒకసారి దాన్ని చెంపలకు ఆన్చుకుని, స్పర్శించి, దగ్గరగా వచ్చి, మునివే ళ్ళ మీద ఎగిరి , వసంత్ తలని రెండు

అరచేతులతో ఆప్యాయంగా అదిమి, వంచి- నుదుటిమీద ముద్దు అద్దింది.

వసంత్ శాలినిని దగ్గరగా తీసుకున్నాడు. అలా మవునంగా, నిశ్శబ్దంలో నిశ్శబ్దమై ఇద్దరూ కాసేపు నిల్చుండిపోయారు.

కాసేపటికి- "మీవూరు నాకు నచ్చింది శాలీ" అన్నాడు.

ఆమె అతడి నుంచి విడివడి వసంత్ కళ్ళల్లోకి చూస్తూ- "ఏంనచ్చింది?"

"అంతా. మీవూరు రోడ్లు, ఇళ్లు, కాలేజీ, చెరువు, తామరలు- అన్నీ"

నిట్టూర్చి- "అమ్మా, నాన్న ఇంకా ఇంతకాలమయినా అలా ఫీల్ అవుతున్నారంటే నన్ను ఎంతగా ద్వేషించి వుంటారో"

"అదిగో. నువ్వలా డిప్రెస్ కాకూడదు. నాకు తెల్సు. నువ్వు ఏదో ఇలాంటి సంఘటన ఎదుర్కొని మనసుపాడు చేసుకుంటావని అందుకే నేను కూడా వచ్చాను. కానీ ఇలా చూడు- మనిషి ఎలాగోలా జీవించాలనుకుంటే జీవించడం చాలా తేలిక. కానీ ఇలాగే జీవించాలని నిర్ణయించుకుని అలాగే జీవించడం కష్టం. నువ్వొక నిర్ణయం తీసుకున్నాక, కొంత మంది వ్యక్తులకి దూరమవుతావు. అంతమాత్రాన నీ 'నిర్ణయం' తప్పనే వుద్దేశం మాత్రం ఏర్పరుచుకోకు".

అతను తన కోసం, తనకి ప్రేమని వంచి యివ్వడానికి, ధైర్యాన్ని నూరిపోస్తూ- జీవితాంతం తన ప్రక్కనే వుంటాడనే ఊహ ఆమెకు కొంత ప్రశాంతతని ఇచ్చింది.

మరో అరగంట ఆ విషయం, ఈ విషయం మాట్లాడకున్నాక, శాలిని కొంత తేరుకుంది.

"రూంబోయ్‌ని పిలిచి, డిన్నర్‌కి ఆర్డరు ఇవ్వనా?" అన్నాడు.

"మీ ఇష్టం-"

వసంత్ లేచాడు.

సరిగ్గా అదే సమయంలో బజర్ మ్రోగింది. అతను వెళ్ళి తలుపు తీశాడు.

ఎదురుగా సరస్వతమ్మ-

వెంటనే తేరుకుని "రండి లోపలికి" అన్నాడు మర్యాదగా.

అటు తిరిగి ఏదో పుస్తకం చూస్తున్న శాలిని ఎవరా అని ఇటు చూసి,

తల్లిని చూడగానే ఆనందాశ్చర్యాలతో

"అమ్మా" అంది.

సరస్వతమ్మ తడితేరిన కళ్ళని చీరకొంగుతో అద్దుకుంది.

శాలిని దగ్గరగా వచ్చి- "నువ్వు ఒక్కదానివే వచ్చావామ్మా ఇంత రాత్రి" అంది.

ఎప్పుడూ బయటకు కదలని తల్లి- తొమ్మిది ప్రాంతంలో, హోటల్‌కు వస్తుందని- శాలిని వూహించలేకపోయింది. సరస్వతమ్మ గద్గదిగమైన కంఠాన్ని సరిచేసుకుంటూ అంది.

మరింత ఆశ్చర్యపోయి- "నాన్నగారా?" అంది.

"సాయంత్రం జరిగిన విషయం మరిచిపోమ్మా- ఏదో వుద్రేకంతో. కోపంతో ఇంటికి వచ్చిన నిన్ను నానా మాటలు అన్నారు. అవేం మనసులో పెట్టుకోకు"

ఎప్పుడూ మొహం మాడ్చుకుంటూ, కరినంగా మాట్లాడే తల్లే శాలినికి తెల్సు. ఆ తల్లి ఇంతమెత్తగా, ఆప్యాయంగా మాట్లాడుతుంటే శాలినికి కలలా వుంది.

"ముసలివాళ్ళమయిపోయాం. ఊరు పొమ్మంటోంది కాడు రమ్మంటోంది అన్నట్టు వున్నాం. ఏవో, ఎప్పటివో విషయాలు మనసుల్లో పెట్టుకుని- ఇంటికి వచ్చిన కూతుర్ని అల్లుడ్నీ బయటకు పొమ్మనందుకు క్షమించు"

శాలిని హృదయం ఆ మాటలకి విలవిల్లాడిపోయింది.

"అవేం మాటలమ్మా-" అంటూ తల్లిని కావలించుకుంది. ఆమె కళ్ళల్లో కూడా నిండుగా నీళ్ళు.

వయసు, కాలం మనుమల్ని ఎంత మారుస్తాయి అనడానికి తన తల్లిదండ్రులే మంచి ఉదాహరణ అనిపించింది.

"మిమ్మల్ని ఇంటికి తీసుకువెళ్ళడానికి వచ్చాం. రామ్మా- పోదాం" అంది.

శాలిని సందేహంతో- "కానీ" అంది.

"నీకు ఇంకా కోపం పోలేదా- మేం బ్రతికి వుండగా, నువ్వు హోటళ్ళలో వుండాల్సిన




ఖర్మ ఏమిటి తల్లీ. అయిపోయిందేదో అయిపోయింది. ఇంటికి పోదాం రామ్మా-'' అని అప్పటివరకు మవునంగా వున్న వసంత్ వైపు తిరిగి- ''ఏంబాబూ. మా మీద మీక్కూడా కోపం వుండి వుండొచ్చు. కానీ ఇప్పుడు మాత్రం మమ్మల్ని కాదనకండి-'' అంది.

వసంత్- ''కోపం ఎందుకండి. అదేం లేదు. తప్పకుండా వస్తాం-'' అని- ''శాలినీ సూట్‌కేసు సర్దెయి. హొటల్ రూం ఖాళీ చేసేద్దాం-'' అన్నాడు.

''అలాగేనండి'' అని శాలిని గబగబ సూట్‌కేసు సర్దింది.

రూంబోయ్ సూట్‌కేసు, ఎయిర్ బ్యాగ్ తెచ్చి- క్రింద కౌంటర్ దగ్గర పెట్టాడు.

వీళ్ళు రావడం చూడగానే- రుక్మిణీనాథరావు రెండు రిక్షాలను పిలిచాడు.

వసంత్ బిల్లు పే చేసి వచ్చాడు. శాలిని, సరస్వతమ్మ ఒక రిక్షా, వసంత్, రుక్మిణీనాథరావు ఒక రిక్షా ఎక్కారు.

మీరు వెళ్ళిపోయాక మీ నాన్నగార్ని నాలుగు ముక్కలు అడిగి మరీ దులిపాను- 'ఏదో కోపంతో, బాధలో అలా అనేశాను కానీ నాకు మాత్రం అదంటే ప్రేమ లేదా-' అన్నారు ఈలోగా శకుంతలగారు వచ్చిచెప్పారు. నీకు నాలుగోనెల అని. హొటల్‌లో రూం తీసుకున్నావని. ఆ విషయం వినగానే గుండె నీరయిపోయింది. నాలుగో నెలతో, కూతురు పుట్టింటికి వస్తే, నాలుగు మాటలు అని తరిమేశాం అని ఏడ్చాను. మీ నాన్నగారు అంతా విని- ''పద హొటల్‌కు వెళ్ళి పిల్చుకు వద్దాం'' అన్నారు.

శాలినికి ఇంకా ఆశ్చర్యంగా వుంది. ఎంతైనా రక్తసంబంధం అనిపించింది.

రుక్మిణీనాథరావు వసంత్‌తో కబుర్లు మొదలుపెట్టాడు. కాసేపటికి వసంత్ ఉన్నత వుద్యోగం, స్ఫురద్రూపం మంచి మర్యాదలతో మాట్లాడే విధానం ఆయనకి ఎంతో నచ్చాయి. తన కూతురు చేసింది తప్పు అన్న భావన ఆ క్షణంలో మనసునించి తుడిచిపెట్టుకుపోయింది.

ఇంటికి రాగానే వసంత్‌కి ఏం ఇష్టమో కనుక్కుని మరీ సరస్వతమ్మ కూరలు- వేపుళ్ళు వండింది.

రుక్మిణీనాథరావు- కూతురు ఏ సబ్జక్ట్ మీద పి.హెచ్.డి చేసింది. ఎప్పుడు డాక్టరేట్ తీసుకుంది వివరంగా కనుక్కుని ఆనందించాడు. ఆయనకి ఒక విషయం ఆలోచించుకున్నా సరిగ్గా అర్థం కాలేదు. అప్పుడు శాలిని 'నాన్నా ఎమ్.ఏ చదువుతాను' అంటే విరుచుకుపడ్డాడు. ఇప్పుడు డాక్టరేట్ తెచ్చుకుందని తెల్సి సంబరపడుతున్నాడు. తన ఆలోచనాధోరణిలో ఎక్కడ లోపం వుందో తెలీక ఒక క్షణం తికమకపడ్డాడు. భోజనాలుచేస్తూ మాటల మధ్యలో- ''ఎంతమ్మా మరో మూడు సంవత్సరాలకి రిటైర్ అయ్యిపోతాను. తర్వాత జీవితం మహా వుంటే ఐదారు సంవత్సరాలు. కృష్ణా రామా అనుకుంటూ ఒంటరిగా ఇక్కడే కాలక్షేపంచేస్తే అయిపోతుంది'' అన్నాడు.

వసంత్ ఆయన మాటలు పూర్తి కాకుండానే- ''అదేమిటి మావయ్యగారూ- ఒంటరిగా ఎందుకు? మద్రాసు వచ్చి మా దగ్గరే వుండండి. అక్కడ కూడా మీకు కావాల్సిన సత్కాలక్షేపం వుంటుంది-'' అన్నాడు.

''ఆ మాట అన్నావు. అది చాలు బాబూ-'' అన్నాడు రుక్మిణీనాథరావు ఆనందంతో, సంతృప్తిగా.

శాలినికి హృదయం ఉప్పొంగినట్లయ్యింది. ఇటువంటి వాతావరణం కోసం తను ఎన్నో కలలు కంది. ఈరోజు అవన్నీ నిజమయ్యాయి.

సరస్వతమ్మ, కూతురుకి అల్లుడికి కొసరి, కొసరి వడ్డిస్తూ బంధువులు- వాళ్ళ గొడవలు- విషయాలనుంచి ఆ మాట ఈ మాట ఎంతో ఇష్టంగా చెబుతోంది.

వసంత్ అత్తగారి మాటలు ఎంతో కుతూహలంగా వింటున్నాడు. శాలినికి వసంత్ కుతూహలం చూస్తే ముచ్చట వేసింది.

తనకోసం అతను ఎంతో ఈజీగా వాళ్ళతో ఎడ్జస్ట్ అయిపోయాడు అనుకుంది.

మరో నాలుగురోజులు వాళ్ళతో ఆనందంగా గడిపి మద్రాసు బయల్దేరారు.

బయల్దేరుతూ- శాలిని సుజాతను ప్రక్కకు తీసుకువెళ్ళింది. నాలుగురోజుల్లో వాళ్ళిద్దరూ



మంచి స్నేహితులయ్యారు.

“సుజా ఇలా చెబుతున్నానని మరోలా అను కో. మన ఇంట్లో ఎ[illegible] ఏ [illegible] వచ్చినా నాకు రాయి. సిగ్గు పడకు. ఈ ఇంటికి శరత్ ఒక కొడుకైతే, వసంత్ మరో కొడుకు. మావయ్యా- అత్తయ్యల బాధ్యత శరత్ మీద ఎంత వుందో, నామీద కూడా అంతే వుంది-” అంది.

ఆ మాటలకి సుజాత కళ్ళు చెమర్చాయి. “శాలినీ. నువ్వింత చెప్పనవసరం లేదు. నువ్వు మా కుటుంబంలో ఒకదానివి. ఆ విషయం నేను సుఖం వచ్చినప్పుడూ మర్చిపోను. దుఃఖంలోనూ మర్చిపోలేను” అంది.

శాలిని సుజాత చెయ్యి ఆప్యాయంగా నొక్కి వదిలేసింది.

మరోరెండు సంవత్సరాలు భవిష్యత్తులో పుట్టి వర్తమానంలో పెరిగి భూతకాలంలో కల్సిపోయాయి. అందరి జీవితాల్లో కాలంతోపాటు వచ్చే మార్పే శరత్ జీవితంలో కూడా వచ్చింది.

శరత్ తండ్రి వెంకట్రామయ్య గుండెపోటుతో చనిపోయాడు. చనిపోయేటప్పుడు కూడా ఆయనకి కొడుకు మీదకోపమే. వెంకట్రామయ్య పోయాక సరిగ్గా చూసుకునేవాళ్ళులేక ఫాన్సీషాప్‌లో విపరీతంగా నష్టాలు రావడంతో ఆ షాప్‌ని అమ్మేశాడు శరత్. ఊళ్ళో మరో

రెండు మూడు వీడియో అండ్ ఆడియో షాపులు పెట్టడంతో డిమాండు తగ్గి కాంపిటీషన్ పెరిగి లాభాలు బాగా తగ్గిపోయాయి సైట్ అండ్ సౌండ్‌కి. ఇదంతా జాగ్రత్తగా గమనించిన గోపాల్ ఈ బిజినెస్ లాభంలేదు అని నిర్ణయించుకుని షాప్ అమ్మేసి, నీవాటా ఇదిగో అని ఇరవైవేలు శరత్‌చేతిలో పెట్టి తను బట్టలషాప్ పెట్టుకున్నాడు. ఈసారి గోపాల్ బావగారు అనేవరసైనా చూడకుండా శరత్‌కి వాటా ఇవ్వలేదు.

శరత్, సుజాతలకు మరో అమ్మాయిపుట్టింది. సొంత ఇంట్లోవుంటున్నా తల్లి, భార్య, ముగ్గురు పిల్లల్ని పోషించాలి- అనేసరికి అతడికి కొండని నెత్తికి ఎత్తుకున్నట్టు అన్పించింది. తల్లిమౌనం, భార్య సాధింపులు, పిల్లల డిమాండ్స్, బావమరిది తనని వదిలేయడం- అతనికి ప్రపంచమంతా అయోమయం, దుఃఖమయంగా కన్పించాయి. అందరూ తనని మోసం చేశారు, వంచించారు- అనేది అతని వాదన కానీ సుజాత మీ అసమర్థత వల్లనే ఇలా జరిగింది, అని శరత్‌ని ఈసడించేది.

గతవారం రోజుల్నించీ పరిస్థితులు మరింతగా దిగజారాయి. అప్పులు, అశాంతి, అవసరాలు, చికాకులు అన్నీ కల్సి అతణ్ణి క్షోభపెడుతున్నాయి. ఈ పద్మవ్యూహం నుండి ఎలా తప్పించుకోవాలో అతనికి అర్థంకావడంలేదు. వీలున్న చోటల్లా అప్పులు చేశాడు. చాలామందిని వుద్యోగం అడిగాడు- ఆ... చూద్దాంలే అన్నవాళ్ళే అందరూ. అసలు వుద్యోగానికి అప్లికేషన్ పెట్టడం అంటేనే అతనికి తెలీదు. ఒక్కసారి స్వర్గం నుంచి నరకంలోకి దిగజారినట్టయ్యింది. ఛీ, ఎందుకీ జీవితం- చచ్చిపోతే అనుకున్నాడు. కానీ చావడం అంటే ఎలా? ఏమిటి? ఆ తర్వాత- ఇలా తనలో తను ఆలోచించుకుంటూ వుండిపోయేవాడు గంటలు తరబడి.

సరిగ్గా ఆసమయంలో శాలిని నుంచి టెలిగ్రాం వచ్చింది. 'శరత్- అర్జంట్- స్టార్ట్ ఇమిడియెట్లీ' శాలిని. అతనికి చాలాసేపు అర్థంకాలేదు. అందులో వున్నవిషయం ఏవిటో. కానీ భార్య 'వెళ్లండి... ఎందుకు రమ్మంటోందో ఏమో', అని సతాయించేసరికి భార్య చేతికి మిగిలివున్న ఒక గాజు తాకట్టుపెట్టి మూడు వందలు చేత్తోపట్టుకుని బయల్దేరాడు.



బజర్ శబ్దానికి, శాలిని కిచెన్‌రూంనుంచి వెళ్ళి తలుపు తీసింది.

ఎదురుగా శరత్-

అతణ్ణి అలా చూసేసరికి షాక్ తగిలినట్టు దిమ్మెరపోయింది. చిక్కిపోయి నీరసంగా భుజాలు వంగిపోయి- కృంగిపోయి-

ఆకళ్లల్లో మెరుపుఏది? ఆ పెదవులపై చిలిపి చిర్నవ్వు ఏది? ఆ నుదిటిపై కాంతి ఏది? ఆ చెంపల నిగనిగలు ఏవి? యవ్వనపు పొంగుతో రింగురింగులై ఒత్తుగావుండే నల్లటి జుత్తు ఏది?

శరత్ ఆమెని పెద్దగా పరిశీలించలేదు. అందుకే శాలిని తనని ఆశ్చర్యంగా చూస్తోందని గమనించకుండా నిరాసక్తంగా- "ఏవిటి... ఎందుకు రమ్మని టెలిగ్రాం ఇచ్చావు-" అన్నాడు.

ఆ గొంతులో వినిపించిన నీరసతకు శాలిని మరింత ఆశ్చర్యపోయింది.

"రా- లోపలికి" అంది

లోపలికి వచ్చి సోఫాలో కూర్చున్నాడు. శాలిని 'వసూ' అని పిల్చింది. ఎవర్నోఅమ్మాయిని పిలుస్తోంది అనుకున్నాడు. వసంత్ లోపల్నుంచి వచ్చాడు- "హల్లో... బావున్నారా? ఎప్పుడు వచ్చారు?" అన్నాడు వసంత్ పలకరింపుగా. ఇప్పుడే-' శరత్ నిరాసక్తంగా. వసంత్ శరత్‌ధోరణికి ఆశ్చర్యపడినా "రండి- మొహం కడుక్కుని, స్నానం అదీ కానిస్తే టిఫిన్ చేసెయ్యొచ్చు-" అన్నాడు.

శరత్‌లేచాడు. మరో అరగంటకి స్నానం చేసి బట్టలు మార్చుకుని వచ్చాడు. మనిషి మాత్రం యాక్టివ్‌గా కాలేదు. అదే మూడ్‌లో వున్నాడు.

ఇద్దరూ డైనింగ్‌టేబిల్ దగ్గర కూర్చున్నారు. శాలిని వేడివేడిగా దోసెలు వేసి అల్లంచట్నీతో తెచ్చిపెట్టింది. బెడ్‌రూంలోంచి బయటకు వచ్చిన రెండు సంవత్సరాలబాబు ముద్దుగా "హల్లో అంకుల్" అన్నాడు. వెంటనే శరత్‌కి ఏం అనాలో తెలీక- శాలిని వైపు తిరిగి "నీ కొడుకా" అన్నాడు. ఆ మాటలో ధ్వనించిన మొరటుతనాన్ని గ్రహిస్తూ- అవును పేరు సంతోష్ అంది.

వసంత్ యూనివర్సిటీకి వెళ్లడానికి తయారవుతున్నాడు.

"పేపరు చూస్తూండు. లంచ్‌ప్రిపేర్‌చేసి వచ్చేస్తా" అంది శాలిని కిచెన్‌రూంలోకి వెళ్తూ-.

'ఆ- పేపరులో ఏముంటాయిలే-' అన్నాడు. ఆమె మరొకసారి అతణ్ణి పరిశీలించి లోపలికి వెళ్ళిపోయింది. వసంత్ యూనివర్సిటీకి వెళ్తున్నానని చెప్పి వెళ్ళిపోయాడు.

శాలిని మరో గంటతర్వాత వచ్చేసరికి శరత్- అదే పొజిషన్‌లో, అలాగే కూర్చుని వున్నాడు. ఆమెకు అర్థమయింది- అతను నెమ్మదిగా ప్రపంచం నుండి తనలోకి తను ముడుచుకుపోతున్నాడని.

"నేను ఈరోజు లీవుపెడుతున్నా" అని ఫోన్‌చేసి తను ఆఫీసుకి రావడంలేదని చెప్పింది.

"శరత్-"

"ఊ..."

"ఇప్పుడు ఏం చేస్తున్నావ్"

"ఏం చేయడంలేదు"

"ఎందుకని?"

"ఎవరూ నాకు వుద్యోగం ఇవ్వడంలేదు. నేను బిజినెస్‌కి పనికిరాను" "ఎందుకో ఎప్పుడైనా ఆలోచించావా?"

"నేను అతి మంచిమనిషిని. నిజాయితీ ఉన్నవాణ్ణి కనుక-అందుకే ఈ దుర్మార్గపు సమాజంలో నేను ఇమడలేకపోతున్నా" అతని స్వరంలో ధ్వనించిన అహాన్ని ఆత్మశూన్యతని ఆమె గమనించింది.

"కాదు"

"మరేంటి?"

"నువ్వు అసమర్థుడివి"

అతనిలో చిన్న కదలిక-"కాదు" ఆవేశంగా అన్నాడు.

ఆమాత్రం రియాక్షన్ రాగానే 'ఫరవాలేదు' అనుకుంది.

"నిజం...నువ్వు అసమర్థుడివి. అందుకే నీకు ఎవరూ ఉద్యోగం ఇవ్వరు. నువ్వు స్వంతంగా బిజినెస్ పెట్టుకోలేవు"

"నాన్సెన్సు-నాకు ఉద్యోగం ఇచ్చి చూడు. నేను నిలబెట్టుకుంటానో లేదో"

"ఏఉద్యోగం చెయ్యగలవు. ఆరోజున చెప్పాను గుర్తుందా? కనీసం బి.ఏ పూర్తిచెయ్యమని-చేశావా?"

"ఆ(...ఈ డిగ్రీలు కూడుపెడ్తాయా?" అతని వాదనకి చాచిపెట్టి ఒకటి కొట్టాలన్పించేంత అసహనం కలిగింది శాలినిలో.

"అవును...డిగ్రీలు కూడుపెట్టవు. కష్టపడి పనిచెయ్యాలి అనే భావం కూడు పెడ్తుంది-నీకు అసమర్థతకి సాయం సోమరితనం కూడా ఉంది"

అతని మొహం ఎర్రబడింది.

"ఓహో! ఇంత గొప్ప విషయాలు కనిపెట్టి నాకు చెప్పడానికా నన్ను ఇంతదూరం పిల్చావు. ఈ మాత్రానికి నేను సుజాత గాజు తాకట్టు పెట్టాల్సి వచ్చింది-తెల్సా నీకు!"

"సిగ్గులేదూ! నువ్వు మరో ఊరు వెళ్ళాలంటే భార్య గాజో లేక మంగళసూత్రమో తాకట్టుపెడితే కానీ గతిలేదన్నమాట"

"శాలినీ"

"అరవకు-ఓ(...నీకేదో సమర్థత ఉందన్నావుగా-ఏదీ! ఇదిగో-ఈ హిందూలో ఈరోజు వాంటెడ్ కాలమ్స్ చూసి-అందులో ఏ ఉద్యోగం నీకు సరిపోతుందో టిక్‌పెట్టి, అప్లికేషన్‌రాయి" అని లోపలికి వెళ్ళి తెల్లకాగితాలు, పెన్ అందించింది.

శాలిని అలా మాట్లాడుతుందని శరత్ ఊహించలేదు. హిందూ బ్లాంక్‌గా చూస్తూ ఉండిపోయాడు.

"నిన్నే...చదువు"

వరసగా జాగ్రత్తగా కష్టపడి పదంపదం కూడబలుక్కుంటూ చదివాడు. ఎకౌంటెంట్స్, టైమ్‌కీపర్స్, సేల్స్‌మెన్, మెడికల్ రెప్స్, ఇంజినీర్స్-ఇలా వరసగా...ఎక్కడా టిక్‌పెట్టడానికి సాహసించలేకపోయాడు. మొహం అంతా చమటపట్టింది. తలెత్తి చూశాడు. బ్లాంక్‌గా, అయోమయంగాఉన్న అతని మొహం చూడగానే ఆమెకి జాలివేసింది.

నెమ్మదిగా మొదలెట్టింది - "శరత్-నేను నీ శ్రేయోభిలాషిని. నీ మంచికోసం చెబుతున్నా విను. బతుకు నుంచి పిరికివాడిలా, అసమర్థుడిలా పారిపోకు. నేను నీకు హెల్ప్‌చేస్తాను. నాసాయం అందుకుని నిలబడు. అంతేగానీ-ఈ వయసులో నీ ముసలితల్లిని క్షోభపెట్టకు. నిన్ను ప్రేమించి వచ్చిన భార్యకు అన్యాయం చెయ్యకు. ఇంకా ఊహ తెలియని నీ చిన్నారులను మోసంచెయ్యకు. ఇలా పనికి మాలినవాడిలా ఎంతకాలం బతుకుతావు. అసలు నీ బతుక్కో అర్థంవుందా?"

అతని హృదయం బద్దలయి, తన అసహాయతకి, తనమీద తనకే జాలికలిగి-మొహాన్ని చేతులతో కప్పుకుని ఏడ్చాడు.

అతణ్ణి అలా ఏడవనిచ్చి-లేచి దగ్గరకు వెళ్ళి-అతని చేతుల మధ్యనుంచి-శరత్ మొహాన్ని తన చేతులతో ఎత్తి-సూటిగా అతని కళ్ళల్లోకి చూస్తూ "నామీద నమ్మకం ఉందా శరత్" అంది.

"........."

"ఒకప్పుడు నువ్వు నాకలల రాజకుమారుడివి-గుర్తుందా?"

తలవూపాడు. అతనికి ఆరోజులన్నీ గుర్తువచ్చాయి.

"నేను-నిన్ను పదిమందీ ఒక గొప్పవ్యక్తిగా-గౌరవించాలని కోరుకుంటున్నా-నిన్నలా తీర్చిదిద్దడానికి ప్రయత్నించబోతున్నా. కానీ నీ కో-ఆపరేషన్ లేకపోతే-అది సాధ్యంకాదు-ఏం చెప్పు-"

అతను ఆమె కళ్ళలోకి చూస్తూ తలవూపాడు. ఆ ఇంట్లోకి వచ్చి నాలుగు గంటలవుతున్నా-ఆమెని లోతుగా చూడలేదు. కానీ ఆక్షణంలో గుర్తించాడు-ఆమెలోని సౌందర్యం మరింతగా రూపుదిద్దుకుంది. మొహం ఆత్మవిశ్వాసంతో కాంతివంతంగా ఉంది. స్వరం గంభీరతతో నిండుగా ఉంది. కళ్ళు దయతో ఆర్ద్రంగావున్నాయి.

"సరే...నేను రెండు వేలు ఇస్తాను. సుజాతకు డి.డి పంపిరా-"

"ఎందుకు?"

"నువ్వు కనీసం రెండు నెలలపైన-బహుశా మాగ్జిమమ్ ఆరునెలలు వరకు ఇక్కడ ఉండాల్సి ఉంటుంది. ఈలోగా వాళ్ళ అవసరాలకి ఈ డబ్బు పంపు-తర్వాత మరికొంచెం పంపుదాం-"

మౌనంగా ఉండిపోయాడు.

"ఏం...నేను నీకు ఊరికే దానం చేస్తున్నా అనుకోకు. అప్పుగా ఇస్తున్నా"

అతను తలెత్తి 'అదికాదు' అన్నాడు.

"మరి"

"నాకు డి.డి. చెయ్యడం రాదు"

శాలిని ఖంగుతిన్నట్టు అతనికేసి అయోమయంగా చూసింది. ఇప్పుడు అతని నిజమైన పరిస్థితి శాలినికి తెల్సింది.

"సరే పద-ఇద్దరం కల్సి డి.డి చేసివద్దాం" అని

ఆమె డ్రస్ ఛేంజ్ చేసుకుని-బాబుని పనమ్మాయికి అప్పచెప్పి-బయటకు వచ్చి వరండాలో పార్క్‌చేసిన కెనెటిక్ హొండా తీసింది.

"అదేమిటి"అన్నాడు ఆశ్చర్యంగా.

"నేను దీనిమీదే ఆఫీసుకు వెళ్తాను. ఈ సమయంలో సిటీబస్సులు చాలా రష్‌గా ఉంటాయి. ఆటోలు దొరకవు. దొరికినా వాళ్ళతో న్యూసెన్స్"

"కానీ...నాకు దాన్ని డ్రైవ్ చెయ్యడం రాదు"

శాలిని నవ్వి-"నాకు వచ్చు" అంది-"నీకు వస్తే ఎలా? ఇప్పుడు..."




''నేను డ్రైవ్ చేస్తాను. నువ్వు వెనకాల కూర్చో-''

''నేనా?'' తెల్లబోతూ అడిగాడు. ''నీకు మగ అహంకారం, పనికిమాలిన ప్రిస్టేజి ఉన్నాయి శరత్. అవి అంత మంచిగుణాలు కావు. మనకి ఇక్కడ పని అత్యవసరం-సమర్థవంతంగా మనం ఆపనిని పూర్తిచెయ్యడం ముఖ్యం. మగ ఆడ ప్రసక్తి రానివ్వకు. 'ఆడది' అనే చులకన భావం అసలు నీ ఆలోచనల్లోకి రానివ్వకు...కమాన్-'' అంది.

ఇక తప్పక వెనకాల కూర్చున్నాడు. మనసులో మాత్రం కుచించుకుపోతూ 'ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? ఎంత నవ్వుకుంటారు' ఇవే ఆలోచనలు. కానీ సిటీరోడ్స్‌మీద ఒకరిద్దరు మగాళ్ళని ఇలా చూశాక కొంచెం ఊపిరిపీల్చుకున్నాడు.

బాంకులో డి.డి ఎలాకట్టాలి అని ఎక్స్‌ప్లెయిన్ చేస్తూ అతనిచేత అన్నీ చేయించింది.

ఆపనయ్యాక, ఆమె ఒక ఎ.సి రెస్టారెంటు దగ్గర హోండాని ఆపింది.

లోపలికివెళ్ళాక, ఒక మూల టేబుల్ ముందు కూర్చున్నారు.

టీ ఆర్డరు ఇచ్చింది.

''శరత్! బీచ్‌లో- మనం ఒకసారి మాట్లాడుకున్నాం. నీకు గుర్తున్నాయా ఆ విషయాలు?''

శరత్ తలవూపాడు.

''ఆరోజే— నేను నీలో ఇప్పుడు ప్రముఖంగా అందరికీ కన్పిస్తున్న నీ అసమర్థత, పిరికితనం, సోమరితనం— చూశాను. అంత వరకు— నేను సీరియస్‌గా నిన్ను స్టడీచెయ్యనందువలన నిన్ను ఇష్టపడ్డాను. కానీ ఆరోజున నువ్వంటే చాలా అసహనం కలిగింది. అప్పుడే నేను నిర్ణయించుకున్నా మనిద్దరికీ సరిపోదు అని. అలాగే నువ్వు— ఆ రోజు— నాలో గట్టిపడుతున్న వ్యక్తిత్వాన్ని, సంపూర్ణమనస్తత్వాన్ని భరించలేక— నువ్వంటే సరిగ్గా తెలీని సుజాతని ప్రేమించి— పెళ్ళిచేసుకున్నావు?

''నేనేకాదు. సుజాతకూడా నన్ను ప్రేమించింది''

''అది 'యవ్వనప్రేమ' శరత్. నీ నిజస్వరూపం తెలీక సుజాత నిన్ను ప్రేమించింది. ఇప్పుడు 'అలా' ప్రేమించిగలుగుతోందా?''

అతనికి సుజాత ఛీత్కారాలు, చీదరింపులు గుర్తొచ్చాయి.

''లేదు శాలినీ...సుజాత చాలా మారిపోయింది''.

''కాదు...సుజాత మారలేదు. నువ్వు సుజాతకి ఇప్పటికి అర్థమయ్యావు. నీ తండ్రి డబ్బువెనకాల, నీ బావమరిది గోపాల్ సమర్థత వెనకాల— నువ్వు కులాసాగా కాలంగడిపావు. వాళ్ళిద్దరూ లేకపోయేసరికి 'నువ్వు ఏవిటో' సుజాతకి అర్థమయ్యింది. ఇదే 'తెలియడం' అప్పుడే జరిగితే— సుజాత నిన్ను ప్రేమించేదికాదు. పెళ్ళిచేసుకునేది కాదు''.

శరత్ దిమ్మెరపోయినట్టు చూస్తూ— ''అంటే గోపాల్ నాకు అన్యాయంచెయ్యలేదంటావా?''

''లేదు...అతను లాజికల్‌గా ఆలోచించాడు. నువ్వొక అనవసరమై బరువులా తయారయ్యావు. అతను సమర్థవంతంగా వ్యాపారంచేస్తుంటే— నువ్వు 'షో'గా తిరుగుతూ లాభాల్లో వాటాగా మాత్రం వుంటున్నావు. నీలాంటి వ్యక్తిని గోపాల్ కాదు. మరెవరూ, చివరికి నేను కూడా భరించలేను''

''లేదు...అబద్ధం. నేను 'షో'గా తిరగలేదు. నేనుకూడా పనిచేశాను''

''మరి పనిచేస్తే— మీ నాన్న పోయాక ఫాన్సీ షాపులో అంతనష్టాలు ఎందుకువచ్చాయి? గోపాల్ మీ ఆడియో, వీడియో షాప్ క్లోజ్ చేస్తాను అంటే— 'నేను చేసుకుంటా' అని ఎందుకు అడగలేదు నువ్వు''

అతను మౌనంగా వుండిపోయాడు. ''శరత్! కేవలం నిన్ను— నీలోని తప్పుల్ని వేలెత్తిచూపుతున్నా అనుకోకు. ఇది కరక్ట్ టైమ్. నీలో లోపాల్ని నువ్వు సమర్థించుకోకుండా గ్రహించుకోగలితేనే, విమర్శించుకోగలిగితేనే— నువ్వు తలెత్తుకు నిలబడే వ్యక్తిగా తయారవ్వగలవ్''

శాలిని బిల్ పేచేసింది.

ఇద్దరూ ఇంటికి వచ్చారు.

''శరత్— నేనొక ప్రపోజల్ చేస్తున్నా. ఇదే

నీకు ఆఖరిఅవకాశం కావచ్చు. దాన్ని వుపయోగించుకున్నావా? నిన్ను అందరూ గౌరవించే వ్యక్తిగా నిలబడగలవు. లేదా— చాలా నీచమైన పరిస్థితుల్లో ఇరుక్కుని అందరిచేత ఎగతాళిచేయించుకుంటావు"

శరత్ ప్రశ్నార్థకంగా చూశాడు.

"మోడర్న్ టెక్ సంస్థ— టి.వి.లు, ఫ్రిజ్‌లు, ఫాన్స్, రేడియోలు, టు-ఇన్-వన్స్ తయారుచేస్తున్న కొత్త సంస్థ. ఇప్పుడిప్పుడే అది బాగా డెవలప్ అవుతోంది. జపాన్‌లోవున్న ఒక ప్రముఖసంస్థ కొలాబరేషన్‌తో ఈ వస్తువులు ఇక్కడ ఫాక్టరీలో తయారుచేస్తున్నారు. ఆ సంస్థ ఎమ్.డి నాకు మంచి ఫ్రెండ్. నీకు మా డిస్ట్రిక్ట్ డీలర్‌షిప్ ఇప్పిస్తా. నీ తరఫున గ్యారంటీ ఉండటమేకాదు. రెండు మూడు లక్షలు దాకా డిపాజిట్‌కూడా నేనే కడతాను. బాంకు లోన్ ఏర్పాటుచేస్తా, నువ్వు మేజర్ సిటీలలో షోరూమ్స్ ఏర్పాటుచేసుకో. అది సక్సెస్‌ఫుల్ అయితే నీ ఇన్‌కమ్ నెలకి ఏభైవేలపైన వుంటుంది తెల్సా?"

శరత్ వెర్రిగా చూస్తూ— ?! "ఏభైవేలా" అన్నాడు.

"అవును...కానీ ముందు నువ్వు చాలా కష్టపడాల్సివస్తుంది. నేను చెప్పినట్టు నువ్వు తయారయితే, నిన్ను నువ్వు ఎడ్యుకేట్ చేసుకోగలిగితే— నువ్వు ఈజీగా సక్సెస్‌కాగలవు. నీమీద నాకు నమ్మకం వుంది అందుకే నీవైపు నేను గ్యారంటీ ఇవ్వడమేకాకుండా డిపాజిట్‌కూడా కడుతున్నా— ఆడబ్బు నువ్వు నాకు— ఒక సంవత్సరంలో తీర్చెయ్యగలవు. అలానే బాంక్ లోన్స్ కూడా"

"కానీ—"

"చెప్పు...ఎస్ ఆర్ నో—"

"............"

"జస్ట్ ఎస్ ఆర్ నో"

అతను వణికిపోతున్నాడు. అంతపెద్ద బిజినెస్ ఎప్పుడూ కలలోకూడా ఊహించలేదు. కానీ తను సక్సెస్ అయితే— తనని ఛీత్కరించిన ఈ మనుషులే తనని నెత్తిమీద పెట్టుకుని పూజిస్తారు.

లేచి నిలబడి ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని కళ్ళలో నీళ్ళు తిరుగుతుంటే అర్ద్రంగా— "శాలినీ...ఎందుకు నాకు ఇంత హెల్ప్‌చెయ్యాలనుకుంటున్నావు" అన్నాడు.

శాలిని నవ్వింది? "శరత్! నువ్వు నాకు చేసిన సహాయం మర్చిపోలేదు. ఆరోజు నేను చదువుపూర్తిచెయ్యడానికి— నాకోసం 'రక్తం' చిందించావు. అది నేను జన్మజన్మలూ గుర్తుంచుకుంటా—"

"నేను సాధిస్తా శాలినీ— నువ్వు నామీద పెట్టుకున్న నమ్మకానికి అయినా నేను సాధిస్తా"

"గుడ్—"

అంతకుముందువరకు అతని మొహాన్ని ఆవరించివున్న ప్రేతకళ అంతరించి జీవకళ వచ్చింది.

సాయంత్రం వసంత్— ఈ విషయం అంతావిని— "గుడ్! ప్రొసీడ్ బెస్టాఫ్‌లక్" అన్నాడు.

శరత్‌కి ఆశ్చర్యం కలిగింది. తన భార్య అలా ఎవడికో గ్యారంటీ ఇస్తూ మూడులక్షలు ఇస్తానంటూ, బ్యాంకు లోన్లు ఎరేంజ్‌చేస్తానంటుంటే— 'గుడ్ ప్రొసీడ్! బెస్టాఫ్‌లక్—' అంటున్నాడంటే— అతను మంచివాడేకాదు గొప్పవాడుకూడా. అందుకే శాలిని ఆరోజు తనని నిరాకరించి అతడ్ని చేసుకుంది అనుకున్నాడు.

ఉదయం శరత్ టీతాగుతోంటే — "శరత్ – బిజినెస్‌లో షైన్ అవ్వాలంటే – నువ్వు కొన్ని ముఖ్యంగా తెల్సుకుని, నేర్చుకుని వుండాలి. ఫస్ట్ నీ లాంగ్వేజ్ బాగా ఇంప్రూవ్ చేసుకోవాలి. ముఖ్యంగా ఇంగ్లీమ స్పీకింగ్, రైటింగ్ వచ్చివుండాలి. అందుకే నిన్ను ఇంగ్లీమ లెర్నింగ్ క్లాసుల్లో జాయిన్ చేస్తున్నా. ఉదయం 9 నుంచి 11 వరకు ఆ క్లాసెస్. సాయంత్రం సేల్స్‌మేన్ కోర్సు 6 నుంచి 8 గంటలవరకు. తర్వాత నువ్వు వదిలేసిన డిగ్రీ పూర్తిచెయ్యాలి. ఇక్కడ మూర్తి ట్యుటోరియల్స్‌లో మధ్యాహ్నం నీకు 3 నుంచి 5 వరకు కోచింగ్ ఇవ్వడానికి ఒక ట్యూటర్ని ఏర్పాటుచేశాను. ముందు ఈ మూడూ సక్సెస్‌ఫుల్‌గా ఫినిష్ చేస్తే నీ విజయానికి తొలిమెట్టు ఎక్కిన




ట్టీ''

శరత్ తెల్లమొహం వేస్తూ – ''ఇవ్వ న్నీనా?!'' అన్నాడు.

శాలిని నవ్వింది ''నేను అంత తెలివితక్కు వదాన్నికాదు. నీకు యుద్ధ మెళకువలు నేర్ప కుండా యుద్ధరంగంలోకి ఎలా పంపిస్తానను కున్నావు. దానివలన నీకన్నా ఎక్కువ నష్టపో యేది నేనే. నువ్వు అపజయాలే ఎరుగుదువు కాబట్టి సర్దుకుపోగలవు. నేను విజయాలే తెల్సుకున్నవ్యక్తిని కాబట్టి అపజయం రుచిని భరించలేను. అందుకనే ముందే చెప్పాను. నువ్వు బాగా కష్టపడాలి అని''

''సరే''

ఆ రోజు ఉదయం క్లాసెస్‌లో జాయిన్‌చేసి ఇంటికి రావడానికి ఏ నెంబరు సిటీబస్సులు ఎక్కేది చెప్పి వచ్చేసింది.

రాత్రి ఎనిమిదిన్నరకు వచ్చి – ''నావల్లకా దు'' అన్నాడు డీలాపడిపోతూ.

''నీవల్ల అవుతుంది''

''లేదు నేను ఇంత కష్టపడలేను- దేనికోసం అయినాసరే...

''శరత్! ఇకనుంచీ – ఎప్పుడూ నావల్లకా దు, నేను చెయ్యలేను అనేమాటలు నాదగ్గర అనకు. అవి ఎంత నీచమైన దిగజారుడు మాటలో నీకెప్పుడైనా అర్థమయ్యాయా?'' అని లేచివెళ్ళిపోయింది.

అతను దిమ్మెరపోయినట్టు అలాగే కూర్చుండిపోయాడు.

''లేచి స్నానం చేసిరా – కాసేపు అలా తిరిగి వద్దాం'' అంది.

అతను స్నానంచేసి లాల్చీ పైజామా వేసు కుని వచ్చాడు.

ఇద్దరూ బయటకు వచ్చారు. వసంత్ ఏవో రీసెర్చ్ వ్యాసం రాసుకుంటున్నాడు.

ఇద్దరూ బయటకువచ్చి కొంతదూరం నడి చాక ''శాలినీ... ఇలా నాకూడావస్తే వసంత్ ఏమీ అనుకోడా?''

''ఎందుకు అనుకోవడం''

''ఆహాఁ... అదికాదు....''

''అతనికి నామీద నమ్మకం వుంది. ను వ్విలా మాట్లాడుతున్నావంటే, సుజాత ఇలా మరొకవ్యక్తితో వెళితే ఒప్పుకోవన్నమాట -''

శరత్ కాసేపు ఆలోచించి- ''అవును'' అన్నా డు.

''అది చాలా సిల్లీ థింకింగ్. కేవలం నిన్ను పెళ్ళిచేసుకునంత మాత్రాన ఆమెకి స్వంత ఆలోచనలు లేకుండా నీకు బానిసలా పడి వుండాలా?''

''కానీ....''

''సరే... అదలావుంచు. నేను ఇలా నీకూడా వస్తున్నందువలన నువ్వేం అనుకుంటు న్నావు-''

''..........''

''కొంపదీసి నీమీద మోహపడి వస్తున్నా అనుకోవడం లేదుకదా-''

''ఛ....ఛ....'' అన్నాడు కంగారుపడుతూ-

''మరి''

''ఏమో... ఎందుకో నచ్చదు-''

''ఈ ఇనిహిబిషన్స్‌తోనే నీ సగజీవితాన్ని నాశనం చేసుకున్నావు. సిల్లీగా కాకుండా లాజి కల్ థింకింగ్- కార్యకారణ సంబంధాలని దృష్టిలోపెట్టుకుని ఆలోచించడం నేర్చుకో-''

''..........''

''సరే... ఇప్పుడు నేను చెప్పే విషయాలు శ్రద్ధగా విను.నువ్వు లైఫ్‌లో ఎందుకు ఫెయిల్ అయ్యావో తెల్సా. జీవితంలో నీకేం కావాలి, నువ్వేం అవ్వాలనుకుంటున్నావు అనే విష యంలో కన్‌ఫ్యూజన్ వుండటం వలన. ఇప్పు డు నీకు తెల్సా నీకేం కావాలో -''

కాసేపు ఆలోచించి- ఏదో చెప్పబోయి మౌనంగా వుండిపోయాడు.

''నీకు నన్ను చూస్తే ఏమనిపిస్తోంది?-''

వెంటనే చెప్పాడు- ''మొదట ఆశ్చర్యం కలిగినా తర్వాత కొంచెంజెలసీ, మరికొంచెం ఎడ్మిరేషన్ కలిగాయి. నువ్వు ఎలా వుండేదా నివో నీకు జ్ఞాపకం వుందా? మీ అమ్మానాన్నా నిన్నుకొట్టి, గదిలో బంధిస్తే, ఏడుస్తూ కూర్చున్న అమ్మాయివి. కానీ ఇప్పుడు నువ్వు నెలకి దాదాపు పదివేలు సంపాదిస్తున్న పెద్ద పాజిష



న్లో, నీభర్త గొప్పవాడిగా, నీకొడుకు ముద్దుగా- ఎవరికైనా సరే నిన్ను చూస్తే నువ్వంటే గౌరవ భావం, మంచి అభిప్రాయం కలుగుతాయి-''

''నీగురించి-''

''నేను ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు నీకు తెల్సు-''

''ఎందుకు అంత డిఫరెన్స్ వచ్చిందో మన ఎదుగుదలల మధ్య - ఆలోచించావా?-''

''..........''

''నీకు ప్రపంచం, మనుషులు, వాళ్ళ ఆలోచనలు, మనోభావాల పట్ల సమగ్రమైన అవగాహన లేదు. దానివలనే నీకు పిరికితనం, సోమరితనం, అసమర్థత అలవాటయిపోయాయి. ఇప్పుడు ఇక నిన్ను నువ్వు మానసికంగా తీర్చిదిద్దుకోవాల్సిన సమయం వచ్చింది'' అని ''ప్రతిరోజూ నీకు చార్లీచాప్లిన్, లింకన్ ప్రముఖులైన వ్యక్తుల గురించీ, మనదేశంలోని సెల్ఫ్‌మేడ్‌మెన్ గురించి వాళ్ళ జీవితంలో అతి ముఖ్యమైన ఘట్టాల్లో వాళ్ళు ప్రవర్తించిన విధానం గురించి నీకు చెబుతా'' అంది.

శరత్‌కి ఆమె పట్టుదల, చొరవచూసి విపరీతమైన ఆశ్చర్యం కలిగింది.

★ ★ ★

రాత్రి ఒంటిగంట దాటుతోంది. వసంత్‌కి ఎందుకో విచిత్రంగా మెలుకువ వచ్చి లేచాడు. శాలిని కిటికీ దగ్గర కుర్చీలో కూర్చుని, బయట ఆకాశంలో నిండుచంద్రున్ని, తేలుతున్న మబ్బుల్ని దీక్షగా చూస్తోంది. చిరుగాలికి పారిజాతాలు జలజల రాలుతున్నాయి. శాలిని ముంగురులు అలవోకగా కదుల్తూ ఆమె నుదుటిని ముద్దాడుతున్నాయి.

నీలం చీరలో ఒదులుగా వదిలేసిన జుత్తుతో కిటికీనుంచి నిండుగా లోపలకు పరుచుకుంటున్న వెన్నెలలో, ఆమె ఒక అద్భుత దృశ్యంలా కనిపించి- ఆరాధనగా ఆమెని అలా చూస్తూండిపోయాడు. కాసేపటికి— అసలు నిద్రపోకుండా ఇంకా కూర్చుని వుందేం అనే ఆలోచన వచ్చింది. ఆ ఆలోచన రాగానే టైమ్ చూశాడు. ఒంటిగంట ఇరవైనిమిషాలు. మళ్లీ శాలినిని జాగ్రత్తగా, దగ్గరగా పరిశీలించాడు. ఆ చూపుల్లో, మొహంలో ఏదో దీనత్వం- ఆలోచన- భయం కన్పించాయి. ఆమెనలా చూడగానే వసంత్ మనసు ఆర్ద్రమయింది. లేచి దగ్గరగా వెళ్లాడు. అలికిడికి ఆమె తలతిప్పి అతని కళ్లల్లోకి చూసింది. కళ్లతో మాట్లాడే సామర్థ్యం శాలినికి వున్నట్లు మరే మనిషికైనా సాధ్యమా అని వసంత్ అప్పుడప్పుడు వండర్ అవుతూ వుంటాడు. అలాగే ఈసారి కూడా ఆమె కళ్ళు చెబుతున్న భాషని వింటూ, ఆమె దగ్గరగా వచ్చి- కుర్చీముందు మోకాళ్లమీద కూర్చుని ఆమె ఒళ్లో చేతులు పెట్టుకున్నాడు.

శాలిని వసంత్‌ని ప్రేమగా జుత్తు నిమురుతూ ఆలోచనల్లో వుండిపోయింది.

నిశ్శబ్దాన్ని మెత్తగా కదిలిస్తూ- ''ఏం

శాలీ...'' అన్నాడు.

శాలిని నెమ్మదిగా ''వూ...'' అంది.

''ఎందుకు?''

''ఏమో''

''నువ్వు కూడా—''

చిర్నవ్వుని పైకిరానిచ్చీ రానివ్వకుండా అది మిపెడుతూ- ''నేనైతే మాత్రం'' అంది మెత్తగా.

''నువ్వు చాలా ధైర్యవంతురాలివనుకున్నా-''

''ధైర్యవంతులు కూడా భయపడే సందర్భాలు రావా?''

''ఇప్పుడు వచ్చిందా?''

''ఊఁ...''

''ఏవిటి?''

''శరత్''

వసంత్ అర్ధమయినట్టు కాసేపు ఆగి- ''ఏం— అతను సక్సెస్‌కాడని ఫీల్ అవుతున్నావా?''

''ఏమో... భయంగా వుంది''

''దానికి భయం ఎందుకు?''

''మీకు తెలీదు'' ఆమె చెమ్మగిల్లిన కన్నులు చూడగానే అతని హృదయం తల్లడిల్లింది.

వసంత్ మౌనంగా వుండిపోయాడు. ఆమె మాట్లాడుతూ- ''మీకు తెలీదు-'' అని మరోసారి ఆగి- ''శరత్, వెంకట్రామయ్యా అంటే నాకు అంతులేని ఆపేక్ష అభిమానం వున్నాయి. ఎందుకో మీకు తెల్సు. శరత్ జీవితంలో ఫెయిల్ అయితే నేను భరించలేను. అర్థం చేసుకోగలవుకదూ వసూ-''

''నాకు తెలీదా శాలీ. కానీ నీది భయం మాత్రమే-''

''ఏమో... శరత్‌కి చేతిలో తుపాకుల్ని ఎదుర్కొనకలిగే శక్తి వున్నట్టు కన్పించడంలేదు. ప్రతి చిన్న విషయానికి బెదిరిపోతున్నాడు. ఆత్మవిశ్వాసం, పట్టుదల తక్కువ''

''వాటిని ఇచ్చే నువ్వుఉండగా భయం ఎందుకు?''

చిర్నవ్వుతో- ''ఇస్తాం వసూ- కానీ తీసుకోగలిగే శక్తి అవతలివ్యక్తికి వుండాలిగా''

''లేదు శాలీ... అతను నిలబడతాడు, నాకు నమ్మకం వుంది''

''ఏమో వసూ... కానీ శరత్ సపోజ్... సపోజ్ ఓడిపోతే అత్తయ్య, సుజాత, పిల్లలు ఏమయిపోతారు?'' ఆమె గొంతు వణికింది.

''నాకు తెల్సు శాలీ... నువ్వు లేవూ వాళ్ళకి-''

''కానీ నేను వుండటం ఏమాత్రం. కొడుకు, భర్త, తండ్రి- సమున్నతంగా ఎదిగి వాళ్లపక్కన వుండటంలో తేడాలేదూ-''

''నిజమే- కానీ శాలీ... శరత్‌కి ఆల్టర్‌నేటివ్ ఎవరూ లేరా?''

''ఎవరున్నారు?''

''సుజాత'' నెమ్మదిగా అన్నాడు.

''సుజాతా... ఎలా?''

''ఒకవేళ శరత్ ఆర్థికంగా, మానసికంగా ఆ కుటుంబాన్ని కాపాడలేకపోతే సుజాతని నిలబెట్టు. సుజాతకి బరువుని మోసే బాధ్యత అప్పగించు-''

''ఎలా వసూ... ఆమె—''

''ఆమె స్త్రీ. ముగ్గురు పిల్లల తల్లి అంటావు''

''కాదా''

''అవును. కానీ జీవితం చేజారిపోతోంది అని తెల్సినప్పుడు 'స్త్రీలు' ఎదురుతిరిగి పోరాడినట్టు పురుషులు పోరాడలేరు''

శాలిని నిట్టూర్చి- ''నిజమే... కానీ ఏం చేద్దాం?''

''శరత్ ఫాన్సీస్టోర్సు కొని సుజాతకి అప్పగించు. ఆమె తప్పకుండా నిలబడుతుంది. ఒకవేళ అది చూసైనా శరత్ జీవితాన్ని వదిలెయ్యకుండా లొంగదీసుకోవాలనే వేటగాడి స్పిరిట్ వస్తూందేమో-''

''వసూ-'' అని చిన్నగా వంగి- అతడి నుదుటిమీద ముద్దుపెట్టుకుంటూ- ''నిజంగా నువ్వు గ్రేట్ వసూ-'' అంది.

వసంత్ నవ్వి- ''మరి నువ్వు ఇలా బెంబేలు పడిపోతే- నాకెంత దిగులుగా వుంటుందో తెల్సా-''




"ఛీ... నువ్వు దిగులుపడి నీ రీసెర్చి పాడు చెయ్యకూడదు-" అంది చిన్నగా కోప్పడుతున్న గొంతుతో.

"మరి ఇకనుంచీ నువ్వు దిగులుపడవని మాటివ్వు. లేకపోతే నేను నీకోసం ఆలోచించా ల్సి వస్తుంది-"

"ఒద్దు ఒద్దు... నా కోసం ఏం ఆలోచించకు. నేను దిగులుపడను"

"ప్రామిస్"

ఆమె లేచింది.

వసంత్ - ఆమెకు అభిముఖంగా లేచిని ల్చున్నాడు. ఆమె అతడి కళ్లలోకి చూస్తూ-"ప్రా మిస్" అని లేచి చల్లటి చేతులని అతడి చుట్టూవేసి కావలించుకుంది.

వసంత్ చిర్నవ్వుతో ఆమెను దగ్గరగా తీసు కున్నాడు.

ఆ కౌగిలి అతనికి ఆకాశమంత సంతృప్తి, వెన్నెలంత చల్లదనం, సముద్రమంత ఉద్రే కత కలిగించింది.

ఆమె పసిపాపలా కళ్ళుమూసుకుని మెత్తగా అతని భుజంమీద తలవాల్చి ఆలోచ నలు ఉద్రేకాలు రాని స్థితికి వెళ్లిపోతోంది.

ఆమెనలా చూసి అతను ముచ్చటపడి హృదయంలో మరింత పొదుపుకొని మంచం వరకు తీసుకొచ్చి పడుకోబెట్టాడు.

పడుకుంటూ శాలిని కనులు విప్పి థ్యాంక్యూ వసూ" అంది.

వసంత్ వంగి ఆమెపెదాలమీద గుడ్‌నైట్ ముద్దును అద్ది దుప్పటి కప్పాడు.

★ ★ ★

అంత వెనుకాడిన తరువాత కూడా పది పదిహేనురోజుల్లోనే శరత్ క్లాసులకు, అక్కడి పాఠాలకు ఎడ్జస్ట్ అయ్యాడు. అతని ఆలోచనా ధోరణిలో క్రమంగా మార్పురావడం ప్రా రంభించింది. శాలిని చెప్పే విషయాలే కా కుండా ఆమె జీవనసరళి కూడా అతణ్ణి ప్రభా వితం చేయసాగింది.

తనని ఆమెతో పోల్చిచూసుకుంటున్నాడి ప్పుడు. తనుకూడా ఆమెలా ఎదగాలి అనుకు నేవాడు. ఎంతో సహనంగా ఇంటిపనులు, సమ ర్ధవంతంగా ఆఫీసుపనులు చూసుకుంటూ ఇంటిని, భర్తని, బాబుని శ్రద్ధగా, ప్రేమగా చూసుకుంటూ ఇటు ఇంట్లో అటు సమాజంలో ఆమె ఎదిగినతీరుకి, పొజిషన్‌కి అతను ఆశ్చ ర్యపోతూవుంటేవాడు.

రెండు నెలల్లో అతనిలో చెప్పదగ్గమార్పు వచ్చింది. రెండుక్లాసెస్‌లో సెవంటీపర్సెంట్‌తో పాస్ అయ్యాడు. మరోనెలలో ఫైనల్ ఎగ్జామ్స్ రాశాడు. అతనిలో ఇప్పుడు విపరీతమైన పట్టు దల పెరిగింది. జీవితంలో ఎలాగైనా సక్సెస్ కావాలని.

అతను ఎగ్జామ్స్‌రాయడం పూర్తికాగానే ఒక రెడీమేడ్ షాప్‌లో రెండు సూట్స్-రెండు పాంట్స్ షర్ట్స్-ఖరీదైన షూస్, టై తీసుకుంది శాలిని.

శరత్ ఆశ్చర్యంగా- "ఇంతఖరీదు పెట్టి ఈ డ్రస్సుఎందుకు?" అన్నాడు.

"కేవలం నువ్వు మానసికంగా మారితేచాల దు. నీలోని మార్పు బయటివాళ్లు గుర్తించేలా నీ ప్రవర్తన, మాటతీరు, కదలికలు కూడా వుండాలి."

ఇంటికిరాగానే-"అవతలి మనిషి మాటల ద్వారా- ఆ వ్యక్తిని అంచనా వెయ్యడం ఆర్ట్...కానీ అసలు ఒక వ్యక్తి మాట్లాడకుండా అతని కదలికల్నిబట్టి-అతని మెంటల్‌పొజి షన్ తెల్సుకోవడం నిజమైన కళ. అది నీకు చెబుతా-మొహంలో ఎటువంటి మార్పులు వస్తే- ఆ వ్యక్తి ఆలోచనా ధోరణి ఇది- అలానే నడకతీరు, చేతులు కదిలించే విధానం కూర్చునే పద్ధతి- బొమ్మలు వేసి మరీ వివ రించింది- వరసగా పదిహేను రోజులు-

కేవలం శాలిని తెలివైనదనుకున్నా గానీ తెలివిని మించిన జ్ఞానం విజ్ఞానం ఆమెలో వున్నాయని అతనికి అర్ధమయింది.

కోర్సు అయ్యాక-ఫైనల్‌గా శరత్‌తో- "ఈ రోజు మోడర్న్‌టెక్ ఎమ్.డి, నా స్నేహితుడు రత్నసాగర్‌తో డిన్నర్ చెయ్యబోతున్నాం. అక్కడ నిన్ను పరిచయం చేస్తాను-" అంది.

ఆరోజు రాత్రి తొమ్మిదిన్నరకు ఫైవ్‌స్టార్‌హోట ల్‌లో స్విమ్మింగ్‌పూల్ పక్కన-ప్రశాంతమైన

వాతావరణంలో శరత్, వసంత్, శాలిని-రత్నసాగర్ డిన్నర్ తీసుకుంటున్నారు. రత్నసాగర్ శరత్‌తో పరిచయం తర్వాత అతడితో ఎక్కువ ఏమీ మాట్లాడలేదు. తన బిజినెస్ ఎఫైర్స్, పర్సనల్ ప్రాబ్లమ్స్ వసంత్, శాలినిలతో చర్చించాడు. ఆ సంభాషణనుబట్టి శాలిని-రత్నసాగర్ మంచిస్నేహితులు అని గ్రహించాడు శరత్-

శరత్‌ని మరసటిరోజు తనని కంపెనీలో కల్సుకోమని టైమ్ చెప్పాడు రత్నసాగర్. శరత్ వెళ్లగానే ఓ మూడునెలలు ఫ్యాక్టరీలో వుండి మొత్తం అన్నివిషయాలు పరిశీలించమని సలహా ఇచ్చాడు. కంపెనీ ఆఫీసర్స్ క్వార్టర్స్‌లో వుండటం మంచిదని శరత్ శాలిని ఇంటి నుంచి అక్కడికి మారాడు.

ఈ మూడు నెలల్లో అతను అన్నివిషయాలు అవగాహన చేసుకున్నాడు. తన బిజినెస్ ప్లాన్‌ని గ్రాఫ్ గీసి రత్నసాగర్‌కి చూపించాడు. ఆ ఫిగర్స్, శరత్ పట్టుదల రత్నసాగర్‌ని ఇంప్రెస్ చేసింది. "మీరు కేవలం డిగ్రీహోల్డర్ అయినా మీకు ఈ డీల్ ఫైనల్ చెయ్యడానికి కారణం మీపట్టుదల, దీక్ష, కృషి" అన్నాడు. అప్పుడు అతనికి అర్థం అయింది. డిగ్రీలు కూడుపెట్టవు, కానీ డిగ్రీలు అవసరం- అన్న శాలిని మాట.

ఈ సిటీ వచ్చిన ఆరునెలల్లో అతను కొత్త శరత్ అయ్యాడు. ఆ రోజు సాయంత్రం ట్రైన్‌కు వెళ్తూ శాలిని, వసంత్‌ల దగ్గరకు వచ్చాడు.

అతని కళ్లలో విశ్వాసం, చిరునవ్వులో పట్టుదల, మొహంలో కన్పిస్తున్న తెలివితేటలకు పద్ధతుల్లో వెల్లడవుతున్న సాఫిస్టికేషన్‌కు శాలిని ముచ్చటపడింది.

శరత్ వెళ్లిపోతూ వచ్చి వసంత్‌కు కరచాలనం చేస్తూ అన్నాడు- "నాకు నూతనజీవితాన్ని ఇచ్చారు. మీకు నా కృతజ్ఞతలు ఎలా చెప్పుకోవాలో అర్థంకావడంలేదు-"

వసంత్ నవ్వి- "నో-నో... నేనే మీకు కృతజ్ఞతలు చెప్పుకోవాలి. మీ భార్య సుజాత శాలినికి మీ పరిస్థితి అంతా వివరిస్తూ వుత్తరం రాసినప్పుడు శాలిని మిమ్మల్ని ఒక సక్సెస్‌ఫుల్‌మేన్‌గా తీర్చిదిద్దుతానని ఛాలెంజ్ చేసినప్పుడు నేను 'సరే' అన్నాను. కానీ నామనసులో ఎంత భయం, బెంగ వుండేవో తెల్సా? మీరు ఏమాత్రం ఫెయిల్ అయినా శాలిని విపరీతంగా అప్‌సెట్ అయివుండేది. తను మీ విషయంలో అంత లోతుగా ఆలోచిస్తోంది-ఒకవేళ మీరు సక్సెస్‌కాకపోతే తాను ఎంత అప్‌సెట్ అవుతుందో అని ఆలోచిస్తూ, లోలోపల ఆందోళనపడుతూ వుండేవాణ్ణి. థాంక్యూ-తనకు మీ విజయం ద్వారా విజయగర్వం కలిగించినందుకు, తనమీద తనకి ఆత్మవిశ్వాసం మరింత ఎక్కువవ్వడానికి కారణమైన మీకు చాలా థాంక్స్" -అన్నాడు.

శరత్ ఆ మాటలకు కదిలిపోయాడు. మనసునిండా కృతజ్ఞత, గౌరవం, ఆరాధన, అభిమానం, ఆపేక్షలతో ఆర్ద్రతగా స్పందించి మెల్లగా వంగి శాలిని పాదాల్ని స్పర్శించాడు.

శాలిని గాభరాగా లేచినిల్చుని-"ఏమిటిది శరత్?"

శరత్ కళ్లల్లో తడి- "శాలినీ... ఒకప్పుడు నువ్వు నాకు ప్రియురాలివి అయితే అయ్యుండొచ్చు. నాకు శారీరకరూపం ఇచ్చింది నా తల్లి కావచ్చు. కానీ ఈ రూపానికి ఒక గమ్యం ఏర్పరచిన నువ్వు నా తల్లివి, తండ్రివి, గురువువి, దైవానివి- ఎలాంటి నేను, ఇలా అయ్యాను అంటే కారణం నువ్వుకాదూ! నువ్వు లేకపోతే ఈ శరత్ లేనేలేడు"

శాలిని తేలిగ్గా నవ్వేస్తూ- "డోన్ట్‌బి సెంటిమెంటల్ ఫూల్-పద... ట్రైన్‌కి టైమయింది" అంది

అతను నవ్వి కదిలాడు.



**అంకితం**

తరాల అంతరాల్ని, అవాంతరాల్ని దాటి నన్ను అర్థం చేసుకునే మా తాతయ్య శ్రీ మంతెన సత్యనారాయణ, అమ్మమ్మ శ్రీమతి సూర్యనారాయణమ్మలకు ఆపేక్షతో

-- జయ


యన్.సి.యల్. వారి
నాగార్జున సిమెంట్ అని
అంత పొడుగునా చెప్పనక్కర్లేదయ్యా...
నెంబర్ వన్ సిమెంట్ కావాలని
అడిగితే చాలు... ఇచ్చేస్తా....
233637
ఎన్.సి.యల్. ఇండస్ట్రీస్ లిమిటెడ్
రాఘవరత్న టవర్స్, చిరాగ్ అలీ లేన్
హైదరాబాద్ – 500 001
MAM/141

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

## అక్టోబర్ 'చతుర' నవల: భ్రాంతి

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................



# చతుర కతలు

## బహుమతి

“హలో”

“హలో...”

“ఐ వాంట్ టు స్పీక్ విత్ మిస్ రాధ...”

“యస్. స్పీకింగ్”





“హాయ్ డార్లింగ్...”

“హాయ్! నువ్వా?”

“ఏమిటి నిన్న సాయంత్రం పార్క్‌కి వస్తానని రాలేదేం? ఎంతసేపు వెయిట్‌చేశానో తెల్సా నీకోసం?”

“సారీ! వీలుపడలేదు”

“ఇవ్వాళైనా దేవిగారు కరుణిస్తారా?”

“చూద్దాం”

“చూద్దామంటే కాదు! తప్పనిసరిగా రావాలి...”

“ఐ విల్ ట్రై...”

“ట్రై... అంటే కుదరదు! సాయంత్రం ఐదుగంటలకి...”

“...”

“ఖచ్చితంగా ఐదుగంటలకి నువ్వొస్తున్నావ్... అంతే!”

“ఎక్కడికి?”

“ఎక్కడికేమిటి? ఇందిరాపార్క్‌కి. గున్నమామిడిచెట్టు కింద బెంచీమీద కూర్చుని వెయిట్ చేస్తుంటా... నీకోసం...”

“ఆఁ!... ఎందుకులెద్దూ ”

“అదేంకుదరదు... ఈరోజు నీ బర్త్‌డే కదా! బొకే ప్రజంట్‌చేయాలని నిన్ననే కొత్తది తీసుకొన్నా. అబ్బా... ఎంత బాగుందని?”

“అలాగా?”

“మరి ఈ భక్తుడి ప్రేమకానుక స్వీకరించడానికి వస్తున్నావుగా సాయంత్రం?”

“అలాగే! ఇంతకీ బొకేలోని పువ్వులు ఏ కలర్?”

“ఆరెంజ్... నీకిష్టమని ఆ కలర్ సెలక్ట్ చేశా! మరి వస్తావుగా”

“ష్యూర్...”

“సాయంత్రం 5 గంటలకల్లా...”

“ఓకే... ఓకే”

ఫోన్ డిస్కనెక్ట్ అయ్యింది.

"యాహూ" ఆనందంగా అరిచాడు ఆనందరావు. రాధకోసం కొన్న బొకేని సుతారంగా ముద్దుపెట్టుకొని తృప్తిగా తనలోతనే నవ్వుకున్నాడు.

★ ★ ★

సాయంత్రం 5 గంటలు... ఇందిరాపార్క్.

బొకే ఒళ్ళో పెట్టుకొని గున్నమామిడిచెట్టు కింద బెంచీమీద కూర్చున్నాడు ఆనందరావు. పదినిమిషాలు గడిచింది.

భారంగా క్షణాలు లెక్కపెడ్తున్న ఆనందరావు ముందు హఠాత్తుగా ముగ్గురు వ్యక్తులు ప్రత్యక్షమయ్యారు.

వారిలో ఒకామె నడివయస్సు దాటిన స్త్రీ. మిగిలిన ఇద్దరూ పాతికేళ్ల లోపు కుర్రాళ్ళు.

ముగ్గురి దృష్టీ ఆనందరావు ఒళ్ళో ఉన్న బొకేమీద కేంద్రీకృతమై ఉంది.

దాని అందం వాళ్లని ఆకర్షించింది కాబోలు అనుకున్నాడు ఆనందరావు.

"మరి మన సెలక్షన్ అంటే మజాకానా" అని మనసులోనే అనుకుంటూ గర్వంగా వారి వంక చూశాడతను.

అంతే! ఉరుములేని పిడుగుల్లా ఆ యువకులిద్దరూ ఆనందరావు మీదపడ్డి ఎడాపెడా ఐదు నిమిషాలపాటు ఉతికి పారేశారు.

"ఇక ఆపండ్రా... వెధవ చస్తాడేమో?" అంది నడివయస్సు స్త్రీ.

బట్టలు చిరిగి, జుట్టు చెదిరి, ఒళ్లంతా దుమ్ముకొట్టుకొని పడున్న ఆనందరావు ఆ పరిస్థితిలో కూడా ఆ కంఠస్వరాన్ని పోల్చుకున్నాడు.

అంటే! ఉదయం తను ఫోన్‌లో మాట్లాడింది ఈమెతోనన్నమాట!

"మా అమ్మ గొంతూ, నా గొంతూ ఒకేలా ఉంటాయి. ఫోన్లో మాట్లాడితే మా అమ్మా, కూతుళ్లలో ఎవరు మాట్లాడుతున్నామో మా డాడీయే పోల్చుకోలేరు తెల్సా..." అంటూ ఎప్పుడో రాధ చెప్పిన విషయం ఆ క్షణంలో చటుక్కున గుర్తొచ్చి నాలుక్కర్చుకున్నాడు ఆనందరావు.

— ప్రతాప చంద్ర

---

## ధర్మరక్షణ

"ధర్మాన్ని నీవు రక్షిస్తే అది నిన్ను రక్షిస్తుంది." రైల్లో పుస్తకం తెరవగానే జగన్నాథానికి కనిపించిన వాక్యమది.

ఆ వాక్యాన్ని తదేకంగా చూస్తున్నాడతను. పక్క నుండి "హు!" అనే శబ్దం వినిపించటంతో ఆ వైపుకు చూశాడు. ఎవరో యువకుడు ఆ పుస్తకం వైపు తిరస్కారభావంతో చూస్తున్నాడు.

"ఏమిటి బాబూ! అలా అన్నావు" అన్నాడు జగన్నాథం.

"ఇంకేమనమంటారు? లేకపోతే ఏమిటండీ ఈ అర్థం లేని సూక్తులు" అన్నాడా యువకుడు.

"దీనికి అర్థం లేదని ఎందుకనుకుంటున్నావు?" అన్నాడు జగన్నాథం.

"ఉందని మీరు నిరూపించగలరా?" ఆ యువకుడి ప్రశ్న.

"సందేహం అవసరం లేదు" జగన్నాథం సమాధానం.

వెంటనే ఆ యువకుడు "అయితే ఆలస్యమెందుకు? ఇపుడే నిరూపించండి" అన్నాడు.

"పందెం ఎంత" అన్నాడు జగన్నాథం.

"వంద రూపాయలు" ధీమాగా అన్నాడా యువకుడు.

జగన్నాథం ఆలోచనలో పడ్డాడు. యువకుడు కొంత సేపు జగన్నాథం వైపు చూసి "పోనీ మీరు నమ్మిన సూక్తిని నిరూపించుకునే అవకాశం నేనే ఇస్తాను. నిరూపించుకోగలరా?" అన్నాడు.

జగన్నాథం "ఏమిటది?" అన్నాడు ఆత్రుతగా.

"అదిగో, ఆ అమ్మాయిని చూడండి. పాపం, ఇందాకట్నుంచీ ఈ జనరల్ కంపార్ట్‌మెంట్‌లో ఈ ఇరుకులో నిలబడలేక తెగ అవస్థపడిపోతోంది. మరి, అలాంటి కష్టంలో ఉన్న స్త్రీని రక్షించడం ధర్మరక్షణ కాదంటారా?" అర్థాంతరంగా ఆపేశాడా యువకుడు.



జగన్నాథం ఆలోచించసాగాడు. "వీడెవడో కాని తనని చాలా ఇరుకున పడేశాడు. ఈ యువకుడు చెప్పినట్లు ఆ అమ్మాయికి సీటు ఇద్దామంటే తనకేమో అసలు కాళ్ళు పీకుతున్నాయి. అలాకాక తనులేవనంటే తను అంత వరకు చెప్పిన నీతులన్నీ అబద్ధమైపోతాయి. ఏమైనా పరిస్థితి ఇంత దూరం వచ్చిన తరువాత తను వెనుకాడితే నవ్వుల పాలవుతాను." ఇలా అనుకున్న మరుక్షణం జగన్నాథం ఆ యువకుడితో "సరే, అలాగే కానీ!" అంటూనే లేచి ఆ అమ్మాయికి సీటిచ్చాడు.

ఆ అమ్మాయి థాంక్స్ చెబుతూ వచ్చి ఆ యువకుడి పక్కన కూర్చుంది. నిల్చున్న జగన్నాథానికి గర్వంగా ఉంది గానీ పాపం క్రమంగా కాళ్ళు పీకుతున్నాయి. "వెధవ వంతాలకు పోయి అనవసరంగా సీటు పోగొట్టుకున్నాను", అనుకున్నాడు మనసులో. అయినా అతని మనసులో తనని ధర్మం ఎప్పుడు, ఏ విధంగా, ఏ రూపంలో రక్షిస్తుందా? అనే ఆలోచన మెదులుతూనే ఉంది.

ఇంతలో జగన్నాథం దిగాల్సిన ఊరు ఇక కొద్ది దూరంలోకి వచ్చేసింది. ఆ యువతీ యువకులు కబుర్లలోకి దిగినట్లున్నారు. అసలీ ప్రపంచంలోనే లేరు.

ఆ సమయంలో హఠాత్తుగా జగన్నాథం సీటులో కూర్చున్న అమ్మాయి మీద పైనుండి ఏదో కారసాగింది. ఆ అమ్మాయి ఉలిక్కిపడి లేచి నిలబడి పైకి చూసింది.

పైన బెర్తు మీద పడుకున్న ఓ అయిదారేళ్ల పిల్లవాడు పాపం, నిద్రలో తన వీక్‌నెస్‌ను బయటపెట్టుకున్నట్లున్నాడు.

ఈ దృశ్యం చూసిన జగన్నాథం సంతోషంగా యువకుడి దగ్గరగా పోయి అతని చెవిలో "అదీ ధర్మరక్షణ ఫలితం" అన్నాడు. యువకుడు నీరసంగా తలపంకించి వంద నోటు అతని చేతిలో పెట్టాడు.

ముసలాడిని మాటల్లో పెట్టి తన భార్యకు సీటు సంపాదించానన్న ఆనందం క్షణమైనా నిలవక, రైలు దిగిపోతున్న జగన్నాథాన్ని ఏడుపు మొహంతో చూస్తుండిపోయాడు ఆ యువకుడు.

— పి.వి.ఎల్.ఎన్. ప్రసాద్

## షూటింగ్

"మీ కోరిక తీరబోతోంది నాన్నా!" అంటూ ఆనందంగా లోపలికి ప్రవేశించాడు రఘు.

"ఏమిట్రా...?"

"మీకు సినిమాలో నటించే ఛాన్స్ వచ్చింది నాన్నా."

"నిజమేనట్రా..." ఆనందంతో ఉక్కిరిబిక్కిరిఅవుతూ ప్రశ్నించాడు రామనాథం.

"అవును నాన్నా నా ఫ్రెండ్ ఒకడు ఓ పెద్ద



డైరెక్టర్ దగ్గర అసిస్టెంట్‌గా పనిచేసి మంచి అనుభవం సంపాదించాడు. సొంతంగా పెట్టుబడిపెట్టి సినిమా తీస్తున్నాడు. అందరినీ కొత్త వాళ్లనే పరిచయం చేస్తున్నాడు. నేను వాడికి ప్రాణంతో సమానం కనుక వాడిపిక్చర్‌లో నాకు హీరోగానూ, మీకు హీరో తండ్రిగానూ పాత్రలిచ్చాడు.

"అయితే మనవి యదార్థమైన పాత్రలే అన్నమాట..."

"ఆ! అలా అయితే సహజంగా ఉంటుందని అంటున్నాడు."

"ఇంతకీ స్టోరీ ఏమిట్రా?"

"ఆ స్టోరీ ఏమిటో నాకే తెలీదు. ఓ రెండురోజుల తరువాత హీరో, హీరోయిన్‌కి పెళ్లిజరిగే సీన్ షూటింగ్ ఉంటుందట"

"మొదట్లోనే హీరో,హీరోయిన్ల పెళ్లేమిట్రా...?"

"నాకేం తెలుసు. నేనేం ఆ సినిమాకి స్టోరీ రైటర్నా? డైరెక్టర్నా...? అతగాడు ఎలాచెబితే అలా నడుచుకోవాలి. ఇదుగో నువ్వు ఈ కాగితంలోని డైలాగులు కంఠతాపెట్టాలి"

"ఏమిటి? చాలా తక్కువ డైలాగులున్నాయి..." అన్నాడు రామనాథం కాగితాన్ని అందుకుంటూ

"పెళ్లి సీనులో మాటలెందుకు నాన్నా? ఇంకా నయం, నువ్వు పెళ్లి కొడుకు తండ్రివి కాబట్టి ఆమాత్రం డైలాగులయినా ఉన్నాయి. నాకూ, సరోజకయితే డైలాగులే లేవు తెలుసా...?"

"సరోజెవర్రా?"

"అదే నాన్నా హీరోయిన్... మన సినిమాకి హీరోయిన్..."

★ ★ ★

ఆ రోజు షూటింగ్ మొదటిరోజు. పెళ్లి పందిరి అందంగా అలంకరించారు. పెళ్లికొడుకూ పందిరిలో వచ్చి కూచున్నారు. పురోహితుడు కూడా మంత్రాలు గట్టిగా చదివాడు.

పెళ్లి బ్రహ్మాండంగా జరిగింది.

అందరూ చాలాబాగా యాక్ట్ చేశారు. సీన్ ఒకే షాట్‌తో ఓ.కె. అయింది.

ఆ తరువాత మరో పెళ్లి ఉందంటూ ఎక్కడివాళ్లక్కడ జారుకున్నారు.

"అందరూ వెళ్లిపోయారేంట్రా... ఈరోజు ఇక షూటింగ్ లేదా?" అన్నాడు రామనాథం.

"నన్ను క్షమించు నాన్నా! మీ ఆశీర్వాదంకోసం ఈ నాటకమంతా ఆడవలసి వచ్చింది..." అన్నాడు రఘు నెమ్మదిగా.

"ఆశీర్వాదమేంట్రా... అందులోనూ ఇది సినిమా షూటింగ్ కదా! నాటకమెలాగయిందిరా?"

"మళ్లీ క్షమించండి నాన్నా. బి.సి.కి చెందిన ఈ సరోజ నాహృదయేశ్వరి. ఈమెను పెళ్లిచేసుకుంటానంటే మీరు ఒప్పుకోరు పైగా పులిలా గాండ్రిస్తారు కదా! అందుకని ఈ ఐడియా ఉపయోగించి మీ ఆశీర్వాదాన్ని కొట్టేశాం..."

నెత్తిమీద అకస్మాత్తుగా పెళ్లిపందిరి కూలిపోయినట్లు "బాబోయ్" అంటూ నేలకొరిగిపోయాడు కోటీశ్వరుడు రామనాథం.

— టి. వెంకటేష్

# రేపటి కోడలు

"రేపు వెళ్ళి కలర్ టి.వి తెచ్చేయమనుకుంటున్నాను. నేనేమో టూర్లకని ఎటో వెళ్ళిపోతాను. నీకు, అమ్మకి బోర్ కొట్టకుండా ఉంటుంది. అప్పుడప్పుడు వి.సి.ఆర్ కూడా అద్దెకి తెచ్చు [illegible] రాకముందే చూసెయ్యొచ్చు" అన్నాడు శేషగిరి-కూతురు చిట్టితల్లితో.

ముఖకవళికలు మార్చేసింది చిట్టితల్లి. "మన ఆరోగ్యాలు ఇలా బాగుండటం మీకిష్టం లేదా ఏంటి డాడీ. తెలుగు ప్రోగ్రాములు ఎంత చెత్తగా ఉంటున్నాయో మనం పేపర్లలో చదువుతూనే ఉన్నాం. దారేపోయేదాన్ని తెచ్చి నెత్తిన రాసుకోవడమెందుకు డాడీ! టి.వి కొనే ప్రయత్నం విరమించుకుంటే మంచిదని పిస్తోంది" అంది చిట్టితల్లి.

చిట్టితల్లి మాటకాదనడు శేషగిరి. టి.వి కొనాలనే ఆలోచనే మరి రానివ్వలేదు.

★ ★ ★

"ఎంతకాలం కింద కూర్చుని భోజనం చేస్తాం తల్లీ! డైనింగ్‌టేబుల్ వేయిద్దాం. లేకపోతే రెడీమేడ్ తీసుకుందామా?" కూతుర్నడిగాడు శేషగిరి.

"మనింట్లో ఎవరికీ భారీ కాయాలు కావుగా! అందరం కూర్చోగలం, లేవగలం. కూర్చోలేని వాళ్ళకీ, కూర్చున్నాక లేవలేనివాళ్ళకీ డైనింగ్ టేబుల్‌గానీ- మనకెందుకు డాడీ. మీరూ ఆలోచించండి" అంది చిట్టితల్లి.

-ఇక ఆలోచించడం ఏముంది? కూతురు మాటే నెగ్గింది.

★ ★ ★

"చిన్న అద్దంలో ఏం చూస్తావు చెప్పండి. ఓ డ్రెస్సింగ్ టేబుల్ కొంటాను. బాగుంటుంది" అన్నాడు శేషగిరి కూతురుతో.

"అనవసరమైన ఖర్చెందుకు డాడీ? అమ్మ ఎలాగూ వాడదు. నాఒక్క దానికోసమూ ఇంత ఖర్చు ఎందుకు చెప్పు నాకిష్టం లేదు డాడీ" అంది చిట్టితల్లి.

అలా ఎందుకంటోందో అర్థం కాలేదు శేషగిరికి.



"నీళ్ళుతోడే మోటారు కొంటానంటే ఒద్దంది. సీలింగ్‌ఫాన్ కొంటానంటే వద్దంది. ఈమధ్య ఏదీ కొనొద్దనే అంటోంది. ఎందుకబ్బా...." ఆలోచించాడు శేషగిరి. అంతుపట్టలేదతనికి.

★ ★ ★

చిట్టితల్లికి పెళ్ళయింది. అత్తవారింటికి వెళ్ళింది.

కొంతకాలానికి శేషగిరి కూతుర్ని చూడ్డానికి వెళ్ళాడు.

కలర్ టి.వి, డైనింగ్‌టేబులూ, డ్రెస్సింగ్ టేబుల్, సీలింగ్‌ఫాన్, వాటర్ ఫిల్టర్, రిఫ్రిజిరేటర్ అన్నీ కొత్తవి కనిపించాయి శేషగిరికి.

అల్లుణ్ణి అడిగాడు "ఏమిటి సంగతి?" అని. "కొనేవరకూ మీ అమ్మాయి ఊరుకుంటేనా?" అన్నాడు అల్లుడు.

"అదేమిటి చిట్టితల్లీ! మరి అప్పట్లో నేను కొంటానంటే ససేమిరా వద్దన్నావు. ఇపుడు అల్లుడు చేత అన్నీ కొనిపించేశావేమిటి?" కూతుర్నడిగేడు శేషగిరి.

"ఎలాగూ పెళ్ళయ్యాక అత్తారింటికి వచ్చేస్తాను కదా అని....." నీళ్ళు నమిలింది చిట్టితల్లి.

— గోపరాజు రాధాకృష్ణ

# ఏరిన ముత్యాలు

★ సౌందర్యం భగవంతుని దస్తూరి.

— ఎమర్సన్

★ కవిత్వం దుఃఖానికి తోబుట్టువు. బాధపడి కన్నీరు కార్చగల ప్రతివ్యక్తీ కవితా హృదయం కలవాడే. ప్రతి కన్నీటిబొట్టూ ఒక పద్యం. ప్రతి హృదయం ఓ కావ్యం

— ఆంద్రే

★ ప్రపంచంతో పనిలేకుండా తన పనులన్నీ జరుగుతాయని భావించేవాడు తనని తాను మోసగించుకుంటున్నాడు. కాని తను లేకుండా ప్రపంచంలో ఏ పనీ జరగదని భ్రమించేవాడు ఇంకా పెద్దమోసంలో ఉన్నాడన్నమాట.

— రోశే

★ జీవితం ఒక కథలాంటిది. అది ఎంత పెద్దకథ అని మనం ఆలోచించకూడదు. అది ఎంత మంచిదనే చూడాలి.

— సెనెకా

★ చెడు చేయడానికి రోజుకు నూరుసార్లు అవకాశమొస్తుంది. కాని మంచిచేయడానికి మాత్రం చాలా తక్కువసార్లు అవకాశమొస్తుంది.

— వాల్టేర్

★ ఎప్పుడూ తానే మాట్లాడుతుంటే మిగతా వాళ్లందరూ చచ్చినట్లు వినాలని కోరుకునేవ్యక్తి తొందరలోనే ఏకాకి అవుతాడు.

— డెల్‌కార్నీ

★ ముఖస్తుతులతో పరస్పరం ప్రశంసించుకొని అభినందించుకునేవారు, ఎవరికివారు ఎదుటవ్యక్తిని మోసగించగలుగుతున్నామనే అనుకుంటారు. చివరకు ఎవరూ మోసపోరు.

— కోల్టన్

★ గృహానికి యజమాని అలంకారంగా ఉండాలి కానీ అది అతనికి అలంకారం కారాదు.

— సిసిరో

★ 'కష్టాలు' అనే పిట్టలు నీ తలమీద ఎగరకుండా వారించలేవు. కానీ అవి నీ తలమీద గూడు కట్టుకోకుండా మాత్రం చూసుకోగలవు.

— చైనా సామెత

★ పిల్లలు ఎక్కువైన కొలది బాధ్యతలు పెరుగుతాయి. కాని అసలే పిల్లలు లేకపోతే జీవితం సారహీనమవుతుంది.

— బోవీ

★ ఇరవై ఏళ్ల వయసులో 'నా ఇష్టం' అనేది రాజ్యం చేస్తుంది. ముప్పయిలో వివేకం చోటుచేసుకుంటుంది. నలభై వచ్చాకగానీ ఏది న్యాయం, ఏది అన్యాయం; ఏది సత్యం, ఏది అసత్యం అనే విచక్షణ ఏర్పడదు.

— గ్రాటియస్

సేకరణ: **నల్లబెల్లి శ్రీమన్నారాయణ**

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/-
పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతి
భావంతులైన రచయితలకు నెలనెలా నవ
లల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో,
ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను
ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు
కాక కేవలం నవల మాత్రమే. అచ్చులో 100 పేజీలు వుంటుంది. "చతుర"లో
అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల
సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు
సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో
వారివారి దస్తూరీనిబట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం
నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవు
తాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే
పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటు తగు పోస్టేజీని
జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏనెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

## చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్- 500 482

# చతుర ఫీచర్



రంగురంగుల కాగితాలలో, రకరకాల ఆకారాలతో గాలిపటాల్ని చేయటం చైనీయుల ప్రత్యేకత. గబ్బిలంగాలిపటం బావుంది కదూ!



కాన్సీ షోకి షోగ్గా ముస్తాబై వచ్చిన ఈ శునకరాజాన్ని స్టాన్లీ నల్వోడీన్ స్ప్రాచెక్స్‌లో 'పెంపుడు జంతువులపట్ల తీసుకోవాల్సిన జాగ్రత్త'లు అనే వాణిజ్య కార్యక్రమంలో పరిచయం చేస్తున్నప్పటి ఫోటో.



1.7, 1.3 మీటర్ల పొడుగున్న ఈ వేణువులను జమైకాకు చెందిన 40 యేళ్ళ డౌగ్లాస్ ఆర్. ఎవర్ట్ తయారు చేశాడు. తను రూపొందించిన ఈ వేణువుల్ని మ్రోగిస్తూ టోకియోలో కచేరీ చేశాడీమధ్య.



బుడాపెస్ట్ జూలో 75వ వార్షికోత్సవాలు జరిపిన సంవత్సరంలో ఆడ ఒరాంగుటాన్ సాబాకు స్నానం చేయిస్తున్న జూ ఉద్యోగ లాస్ జ్లోటొరెక్.



స్పెయిన్‌కి చెందిన బుల్‌ఫైటర్ జువాన్ డీలాస్ రెయెస్ మెడ్రిడ్‌లో తన ప్రత్యర్థి వృషభరాజుతో పోటీపడి స్వల్పగాయాలతో బయటపడ్డాడు.



ప్రపంచంలోకెల్లా అతిపెద్దదైన నీటిలో తేలియాడే 'హోటల్ బార్గ్'ను మిట్సుయి ఇంజినీరింగ్ అండ్ షిపింగ్ కంపెనీవారు నిర్మించారు.



న్యూయార్కులోని బ్రాన్క్స్‌జూకి చైనా నుండి 'యాంగ్ యాంగ్'అనే పండాని తెచ్చి చేర్చారు. దీనిబరువు 85 కిలోలు. యాంగ్‌యాంగ్‌అంటే ఎల్లప్పటికీ ఎప్పటికీ అని అర్థం.



బాంకాక్ మెట్రోపాలిటన్ అడ్మినిస్ట్రేషన్‌వారు సెకండ్‌హాండ్ దుస్తుల్ని చాటుచెక్‌పార్కువద్ద వారాంతపురోజుల్లో అమ్మకాన్ని నిషేధించినందుకు నిరసనగా ప్రతిఘటిస్తున్న 'పంక్'లు.



పర్యాటకులను ఆకర్షించే విధంగా సిడ్నీని తీర్చిదిద్దే ప్రయత్నంలో సాంప్రదాయికంగా పెళ్ళాడిన ఈ జంటకు మళ్ళీ పెళ్ళి చేసి హనీమూన్ ఏర్పాట్లు చేస్తున్న ఆస్ట్రేలియన్ టూరిజం శాఖవారు.



'ప్రకృతికి తెరిచిన కిటికీ' వంటి ఈ దృశ్యం ముర్చిసన్ నది వంకరటింకరగా ప్రవహిస్తూ సముద్రంలో కలిసేచోట ఉంది. అక్కడికి చేరటం అపాయకరమే అయినా అద్భుతమైన దృశ్యం.

పదకొండేళ్ళ జాన్‌కెవిన్ హిల్ సమర్థవంతంగా విమానాన్ని నడపగలనని బొటనవేలు చూపిస్తూ ఛాలెంజి చేస్తున్నప్పటి చిత్రం.



ఫ్రాన్స్‌లోని గెరార్డ్ బాసియర్ 7 నెలల వ్యవధిలో ప్రపంచంలో కెల్లా అతిపెద్ద బూటును తయారుచేసి గిన్నీసు పుస్తకంలోకి ఎక్కాడు.



దేవతల్లాగే మనమూ ఆకాశంలో తేలియాడవచ్చునంటూ యాండీకీచ్ అనే రచయిత ఓ పుస్తకం రాశాడు. ఆ ప్రయత్నం విజయవంతమైతే స్వర్గాన ఉన్న బిషప్పులు భూమికి రాక తప్పదని చమత్కరిస్తూ సరదాగా తీసిన ఫొటో.



జెన్నీట్రాజర్ శిశువుల్ని షికారు తిప్పే బగ్గీలో జింకబొమ్మని, లండన్‌లోని షాపుకు తీసుకువెళ్తున్న దృశ్యం.



న్యూయార్క్‌లోని హేస్టింగ్స్‌కి చెందిన 35 ఏళ్ళ కరాటే నిపుణుడు ఆంథోనీ నెపోలా 3 రోజులపాటు గొంతువరకూ పూడ్చేంచుకుని తన శక్తిని పరీక్షించుకుంటున్నాడు.



ఆస్ట్రేలియాలోని డెర్బీలో బురదలో జరిగే ఫుట్‌బాల్ ఆటలో పాల్గొన్న క్రీడాకారిణులు... పంకిలంలోని పంకజాక్షులంటే వీరికి సరిపోతుందేమో!



సంఘంలో స్త్రీకి సముచితమైన గౌరవాదరణలు లేనందుకు నిరసనగా మహిళా హక్కుల కార్యకర్త యాన్‌సిమోంటన్ గుండుగీసుకుంటున్నవైనం.



కాండాలోని ఓ షాపు ఓనరు సదా కజుపుడికావా 300 చ.మీ. అద్దాల భవంతిని బ్రిటన్‌లో ప్రత్యేకంగా తయారు చేయించి ఆ అద్దాలమేడలో తన స్వప్నాలు పండించుకున్నప్పటి ఫొటో.

మాసాచుసెట్స్‌కి చెందిన డా. ఆక్టోబార్నెట్ రూపొందించిన మెడికల్ కంప్యూటర్ని చికాగోలో అమెరికన్ మెడికల్ అసోసియేషన్లో ప్రదర్శించారు. ఇది 2,000 వ్యాధులను నిర్ధారించగలుగుతుంది.



కెలంటాన్‌లోని బాచోక్ సమీపగ్రామంలో పుట్టిన కొద్దిసేపటికే మరణించిన ఈ రెండు తలల దూడని మాజీ సైనికుడు ఇస్మయిల్‌సెర్డా స్వంతం చేసుకుని ప్రదర్శించాడు.



బ్రిటిష్ అంటార్కిటిక్ సర్వేకు చెందిన మైకేల్ ట్రేసీ తీసిన ఫొటో పెంగ్విన్ పక్షుల ప్రేమాభిమానాల ప్రతిరూపం.



34 సం.ల రెబెకా ఆర్కులేటా యుగో సెలూన్ అనే సరికొత్త కారును 36 గంటలపాటు ముద్దుపెట్టుకుని కారును గెల్చుకున్న తీరు.



థాలిడోమైడ్‌కు బలైన లూయిస్ మెడ్యూస్ వివాహానంతరం భర్త జాన్‌మెడ్యూస్‌తో లండన్‌లోని సెయింట్ ఆండ్రూస్ చర్చి అవతల నిల్చున్న దృశ్యం.

క్యాన్సర్‌కు గురైన 15 సంవత్సరాల లీకాథరిన్ అనే బాలిక అంత్యఘడియల్లో కడపటి కోర్కెను తీరుస్తూ ఫ్లోరిడాకు తీసుకువచ్చి డాల్ఫిన్‌లున్న సరస్సులో ఈదనిచ్చారు. తర్వాత లీ చితా భస్మాన్ని సముద్రంలో కలిపారు.



మెల్బోర్న్‌కు చెందిన 'రే బ్రాంవెల్' తన 81వ ఏట సైకిల్‌పై ఆస్ట్రేలియాను చుట్టి రావాలనే గట్టి ప్రయత్నం....



లండన్‌లోని నాటింగ్ హిల్‌వద్దగల కోల్విల్లై స్కూల్ విద్యార్థులు 1,500 మంది రామాయణ వృత్తాన్ని 3 వేల ఏండ్లనాటి కథ 'ట్రయంఫ్ ఆఫ్ ఆఫ్ గుడ్ ఓవర్ ఈవిల్' ను బాటెర్ సీపార్ వద్ద ప్రదర్శించిన తీరు.

# చతురప్రపంచం

## మీనాషోరే

కరాచీలో ఒక సినిమా కార్యక్రమం వేదికమీద ఎంతోమంది నటీనటులు కూర్చొని వున్నారు. అరవయ్యేళ్ళు పైబడ్డ ఓ నటీమణి మైకు ముందుకు వచ్చి నాలుగుమాటలు చెప్పి, తన కన్నీటికథ వెళ్ళబోసుకొంది. తన ఇద్దరు కూతు ళ్ళకు పెండ్లి చెయ్యటం గగనం అయిందని, ఎవరైనా మహానుభావులు ముందుకువచ్చి ఆర్థికంగా తోడ్పడవలెనని మరీమరీ ప్రా




ర్థించింది. వెంటనే వేదికమీద ఆసీనుడైవున్న ప్రముఖనటుడు మహమ్మద్ అలీ తాను సాయ పడగలనని వాగ్దానం చేశాడు. ఆమె తృప్తిగా నిట్టూర్చింది.

64 ఏళ్ళ ఆ వృద్ధస్త్రీ ఒకప్పుడు హిందీచి త్రాల్లో ఒక్కవెలుగు వెలిగినతార- మీనాషోరే. దుర్భరదారిద్ర్యం అనుభవించి, క్రుంగి కృ శించి ఆమె గత సంవత్సరం సెప్టెంబరు 3వ తేదీన లాహోరులో మరణించింది.

మీనాషోరే అనగానే 'లారలప్ప లారలప్ప లారలప్ప లా' అనేపాట జ్ఞప్తికి వస్తుంది. ఆ పాట 1949లో భారతదేశంలో నిర్మింపబడిన 'ఏక్ థీ లడకీ' చిత్రంలోనిది. ఆ చిత్రం భారతదేశంలోనేకాదు, పాకిస్తాన్‌లో కూడా ఎంతో ప్రచారంలోకి వచ్చింది. ఒకమారు పాకిస్తాన్‌లో 'స్టార్‌నైట్' జరుగుతుంటే, ప్రేక్షకులు మీనాషో రే మైకుముందుకు రాగానే "లారలప్ప లారల ప్ప లారలప్ప లా" పాట పాడమని కోరారు. అప్పుడు మీనాషోరే కళ్ళలోంచి జలజలమని ఆనందభాష్పాలు రాలాయి. మీనాషోరే కథ తెరమీద సజావుగానే సాగింది. కాని ఆమె తెరవెనుక కథే కన్నీటిగాథగా మారింది.

మీనాషోరే అసలుపేరు ఖుర్షీద్‌జాన్. సోహ రాబ్‌మోడీ 'సికిందర్' చిత్రం నిర్మించే సమ యంలో 'ముహూర్త'మప్పుడు ఆమెను అతడు చూశాడు. ప్రతిభను గుర్తించగల సొహరాబ్

మోడీ ఖుర్షీద్‌జాన్‌కి 'సికిందర్' చిత్రంలో ఒక పాత్ర ఇచ్చి, ఆమెపేరు 'మీనా'గా మార్చాడు. పృథ్వీరాజ్‌కపూర్, వనమాలలాంటి మేటితారలున్న చిత్రంకాబట్టి 'సికిందర్' బ్రహ్మాండంగా హిట్ అయింది. మీనా కూడా గబగబా తారాపథంలో పైపైకి ఎగబాకింది. మీనా హాస్యనటిగా ప్రసిద్ధిపొందింది.

మీనా రూప్ కేషోరే తీసిన 'ఏక్ థీ లడకీ'లో బాగా రాణించింది. తర్వాతి చిత్రం 'ఏక్ దో తీన్'లో కూడా ఆమె హాస్యనటిగా పేరుతెచ్చుకొంది.

మీనా మొత్తం ఐదుసార్లు పెళ్ళిచేసుకొంది. రూప్ కేషోరే ఆమె మూడో భర్త. 1953నాటికి మీనా నంబర్‌వన్ హాస్యనటిగా హిందీచిత్రాల్లో పేరుతెచ్చుకొంది. కాని ఆమె వైవాహిక జీవితమే సాఫీగా సాగలేదు. ఆమె నాలుగో భర్త అల్‌నసీర్ ఆమెను పాకిస్తాన్‌కు బలవంతంగా తీసుకెళ్ళాడు. మీనాషోరేకు చేతినిండా సినిమాలున్నా భర్తను విధిలేక అనుసరించింది. అతనితో కూడా పొసగక ఆమె విడాకులు తీసుకొని ఐదోపెళ్ళి చేసుకొంది. తర్వాత కూడా అంతే.

మీనాషోరే నష్టజాతకురాలు. నాలుగుచేతులా సంపాదించింది. సినిమాజీవితం చాలించుకొని, గృహిణిగా ప్రశాంతజీవితం గడపాలని ఆమె కోరిక. కాని ఫలించలేదు. ఏ భర్తకాని ఆమె సినిమా జీవితంనుంచి విశ్రాంతి తీసుకోవడానికి సమ్మతించలేదు. ఆమె బలవంతపు మాఘస్నానంలా సినిమాల్లో నటించింది.

పాకిస్తాన్ వెళ్ళాక మీనాషోరేకు గడ్డురోజులు దాపురించాయి. పాకిస్తాన్‌లో సినిమారంగం కొత్తగా పుట్టుకొచ్చింది. ఆదాయం తక్కువైంది. కొత్త నటీనటులకు ప్రోత్సాహం లభించడంతో, ఆమె తెరవెనక్కు నెట్టివేయబడింది. ఆమె మంచిసినిమాలన్నీ భారతదేశంలోనే వుండిపోయ్యాయి. గత వైభవమే తప్ప వర్తమానంలో చీకటే మిగిలింది.

మీనాకు ఐదుసార్లు పెళ్ళిచేసుకొన్నా పిల్లలు కలగలేదు. తన చెల్లెలు కొడుకులను,

కూతుళ్ళను పెంచుకొంది. వాళ్ళను పోషించ లేక నానాయాతనలు పడింది.

హిందీ తారాపథంలో మిలమిలా మెరిసిన సితార మీనాషోరే, పాకిస్తాన్ వలసవెళ్ళి కష్టాల కడలిలో మునిగి మరణించింది.

## జపాన్‌లోనూ ఇల్లు ఓ సమస్యే

మన దేశంలోనేకాదు, జపాన్‌లో కూడా ఇళ్ళస్థలాల ధరలు, ఇల్లు కట్టడానికయ్యే ఖర్చు రోజురోజుకి పెరిగిపోతుండటం వల్ల అక్కడి మధ్యతరగతి ప్రజలక్కూడా ఇల్లు కట్టుకోవడంగానీ, కొనుక్కోవడంగానీ ఓ కలలా తయారైంది. ఎంతకష్టపడ్డా తమ జీవితంలో ఓ ఇల్లు ఏర్పాటు చేసుకోగలమనే ధీమా వాళ్ళల్లో కలగడంలేదు. ప్రభుత్వం స్థలాల ధరల విపరీతమైన పెరుగుదలని అరికట్టడంలో విఫలమైంది.

ఇటీవల టోక్యో నగరంలో నెరిమావార్డ్ అనబడే ప్రాంతంలో ప్రభుత్వ నిధుల సహాయంతో గృహనిర్మాణ సంస్థ వంటగది, భోజనాలగది, మరోగది వుండే రెండుగదుల ఫ్లాట్లని నిర్మించారు. వారు నిర్మించిన అరవైఆరు ఫ్లాట్లకి 18,370 మంది దరఖాస్తు పెట్టారు. అంటే 278 మందిలో ఒక్కరికి మాత్రమే ఇల్లు వచ్చే అవకాశం వుంది. ఒక్కో ఫ్లాటు ఖరీదు ముప్పై ఒక్కమిలియన్ల యెన్లు మాత్రమే.

నెల జీతాలపై బతికే వుద్యోగుల్లో చాలా మంది ఆర్థికపరమైన ఇబ్బందుల కారణంగా ఇల్లు కొనుక్కునే ఆలోచనని విరమించుకున్నారు. ఓ నగటు వుద్యోగి సంవత్సరజీతానికి ఆరునుండి ఎనిమిదిరెట్ల మొత్తం వెచ్చిస్తే గానీ ఎక్కడా ఇల్లు దొరికే అవకాశంలేదు.

సామాన్యప్రజలు తమకందుబాటుగా వుండే ధరలో స్థలం కొనుక్కోవాలంటే టోక్యో నుండి రెండు గంటల పాటు ప్రయాణం చెయ్యాల్సినంత దూరం పోవలసి వుంటుంది.

అలా ఇళ్ళస్థలాల ధరలు పెరిగిపోవడానికి ఆఫీసు భవనాల కోసం నానాటికీ పెరుగుతున్న గిరాకీయే కారణమట! విదేశీ వ్యాపారసంస్థలు తమ ఆఫీసు బ్రాంచీలని టోక్యోలో స్థా



పెంచడం, ప్రైవేటు సంస్థల ఆఫీసుల్లో కంప్యూటర్లని ప్రవేశపెట్టడం కొరకు ఎక్కువ స్థలం అవసరమవడం వల్ల స్థలాలకి గిరాకీ పెరిగింది.

అందుకే కీలకమైన గిరాకీ వున్నచోట ఇళ్ళు, స్థలాలు వున్నవాళ్ళు అధిక లాభానికి వాటినమ్మేస్తున్నారు

ఎంత కష్టపడి పనిచేసినా, డబ్బు గడించినా కనీసం ఇల్లు ఏర్పరచుకోగలమనే విశ్వాసం లోపించడం వల్ల జనంలో పనిపట్ల కూడా అనాసక్తత పెరగవచ్చని ప్రముఖులు భావిస్తున్నారు. స్థలాల ధరల్ని అదుపులోపెట్ట కపోతే దేశ ఆర్థిక వ్యవస్థ దెబ్బతినే ప్రమాద ముందని మరికొందరు అభిప్రాయపడుతున్నారు.

## మాఫియా కేంద్రం సిసిలీ

సిసిలీ భూమధ్య సాగరంలోని అన్నిటికంటే పెద్దద్వీపం. అది ఇటలీదేశంలో ఉంది. సిసిలీ ద్వీపం 26 వేల చదరపు కిలోమీటర్లు విస్త రించిఉంది. ద్వీపం అనేక అందాలతో నిండి ఉంటుంది. ఆ ద్వీపసౌందర్యాన్ని దర్శించటా నికి పర్యాటకులు అతి దూరదేశాల నుండి వస్తుంటారు.

ప్రజలు సిసిలీకి మాఫియా అనే ప్రపంచ వ్యాప్త నేరస్థుల ముఠాకు సంబంధాన్ని అంట గడతారు. ఎందుకంటే ఆ ముఠాకుచెందిన అత్యధిక సభ్యులు సిసిలీకి చెందినవారేనని ప్రతీతి. ప్రఖ్యాత అమెరికా నవల 'గాడ్‌ఫాదర్', అదేపేరుతో నిర్మించిన చలనచిత్రంలో ఆ ముఠా కార్యకలాపాలు కళ్లకు కట్టినట్లు చిత్రించబడ్డాయి.

సిసిలీ గత 3 వేల సంవత్సరాలలో విభిన్న దేశాల దాడులకు గురైంది. బయటిప్రాంతాల నుంచివచ్చిన ప్రజలు అక్కడ స్థిరపడ్డారు. అందరికంటే ముందు క్రీ.పూ 8వ శతాబ్దంలో గ్రీస్ ప్రజలు అత్యధిక సంఖ్యలో అక్కడికి చేరుకున్నారు. గ్రీస్ ప్రజలు సిసిలీని బాగా అభివృద్ధిచేశారు. గ్రీస్ రాజులు అక్కడ నిరంకుశపాలన కొనసాగించారు. అయితే ఆ



అత్యాచారపాలకులు అక్కడ భవ్యమైన నగరాలుకూడా నిర్మించారు. ఆ కాలంలో సిరాక్యూసీ నగరం యూరప్‌లో ఒక ప్రముఖ నగరంగా విలసిల్లింది. అక్కడ నివసించే 3 లక్షల ప్రజల రక్షణకోసం వృత్తాకారంలో గోడనిర్మించి దానిమధ్య యూరేయోలస్ కోట నిర్మించబడింది. సిసిలీలో ప్రాచీన గ్రీస్ శైలికి చెందిన అనేక దర్శనీయ మందిరాలున్నాయి.

రోమన్ సామ్రాజ్యం పతనమైన తరువాత సిసిలీని కొంతకాలం టునీసియా అరబ్బులు పాలించారు. యూరప్‌కు చెం[illegible] నార్మన్ సామంతులు ఆ ద్వీపాన్ని ఒక [illegible] కేంద్రంగా మార్చారు. ఆ తరువాత జర్మన్ సామంతులు, జాగిర్దార్లు, ఫ్రెంచి బందిపోట్లు, స్పెయిన్‌రాజులు ఆ ద్వీపాన్ని కొల్లగొట్టారు. స్పెయిన్ రాజుల క్రూరపాలన కాలంలో అక్కడ అనేక విప్లవాలు చెలరేగాయి. సిసిలీ వాసులు భారీసంఖ్యలో పర్వతాలలో దాక్కుని బందిపోట్లుగా మారారు. ఈనాటి మాఫియా ముఠా ఆనాటి బందిపోట్ల సంతానమేనని ఒక రచయిత అభిప్రాయం.

సిసిలీ ప్రకృతి వైపరీత్యాలను కూడా బాగా చవిచూసింది. అక్కడ అత్యంత భయంకరమైన భూకంపాలు సంభవించాయి. ఎందుకంటే యూరప్‌లోని అన్నిటికంటే పెద్దదైన మౌంట్‌ఎట్నా అనే అగ్నిపర్వతం సిసిలీలోనే ఉంది. అక్కడ అన్నిటికంటే పెద్దనగరం పాల్‌రమొ. ఆ నగరంలో గొప్ప ఆకర్షణ అక్కడి చర్చి. సిసిలీ ద్వీపంలోని మరో అందమైన నగరంపేరు ఎరిస్. ఎరిస్ శిథిల గోడలచే ఆవరింపబడిఉంది. ఆ నగరంలో పెక్కు రోమన్ మందిరాలున్నాయి. మందిరాలకు సమీపంలో 13వ శతాబ్దంనాటి నార్మన్ దుర్గంఉంది. దుర్గం ముందు టవర్ ఉంది. టవర్ తరువాత మధ్యయుగంనాటి ఒక నగరం ఉంది. నగరానికి దిగువ ఫోనేరియన్ కుడ్యాలు, స్పెయిన్ దుర్గంఉంది. ఆ ప్రదేశంలోనే అన్ని సాంస్కృతిక స్మారకాలు, శిథిలాలు భుజం భుజం కలుపుకొని నిలబడిఉన్నాయి.

సిసిలీ ద్వీపంలోని సిరాక్యూసీ నగరంలో మెక్సీమిలియన్ చక్రవర్తి నివాస భవనం ఉంది. అందులో రోమన్ మొజాయిక్ దుర్లభ కళాఖండాలను దర్శించవచ్చు. సిసిలీ సాగర తీర సౌందర్యం అద్భుతంగా ఉంటుంది. ప్రధానంగా జెలా, ఆగస్టా సాగరతీరాల సౌందర్యం వర్ణనాతీతం. చేపల పరిశ్రమ అక్కడి ముఖ్యవృత్తి. సిసిలీ పారిశ్రామికంగా అంతగా అభివృద్ధిచెందలేదు. కాని పర్యాటకులు అధిక సంఖ్యలో వస్తుంటారు.

సిసిలీ ప్రజలు సరళ స్వభావులు, స్వాభిమానులు. బలవంతులు. ఎన్నో ఎదురుదెబ్బ [illegible] ప్రాంతాలలో పేదరికం తాండవిస్తుంటుంది. యువకులు ఉత్తర ఇటలీలోని కర్మాగారాలలో పనిచెయ్యటానికి వెడతారు.

'సెంట్స్‌డే' సందర్భంగా సిసిలీప్రజలు రంగు రంగు దుస్తులు ధరించి ఊరేగింపు తీస్తారు. పెద్దపెద్ద మంటలువేసి దానిచుట్టూ నాట్యంచేస్తారు. బాణాసంచా కాలుస్తారు. క్రిస్టమస్‌నాడు వాదకులు ఇంటింటికి వెళ్లి సంగీతం వినిపిస్తారు.

## డిక్సింగ్

ఆనీఫ్రెడ్, బెనీ, బోరన్, అగ్నీతాలు తమ అలరించే గీతాలు, అద్భుతమైన ట్యూనింగ్స్, ఉద్రూతలూగించే బౌన్సీ మ్యూజిక్‌తో సంగీత ప్రపంచాన్ని కుదిపేసారు. 1976లో యూరోవిజన్ అవార్డు గెలుచుకున్న వీరి 'వాటర్‌లూ' ఆల్బమ్‌ని అందరికన్నా చాలాముందుగానే 'కొందరు' వినగలిగారు. యువత గుండె చప్పుళ్లకి మారుపేరైన మైకేల్‌జాక్సన్ 'థ్రిల్లర్' భారతదేశానికింకా చేరకముందే ఈ 'కొందరి' చెవినాపడింది. ఆ కొందరే "డిక్సర్స్".

అంతర్జాతీయ రేడియో స్టేషన్లన్నిటినీ ట్యూన్‌చేస్తూ అన్ని కార్యక్రమాలనీ ఫాలో అయ్యే అభిరుచి వున్నవాళ్లని 'డిక్సర్స్' అని పిలుస్తారు. ఈ హాబీని 'డిక్సింగ్' అంటారు. 'డిక్సింగ్'లో ప్రధానాంశం- వినడమే! బొమ్మగారు

రాసిన కుశల సమాచారలేఖనుంచి స్టాంపుని చించి నాకూ స్టాంపుల సేకరణ హాబీయే అనడం ఎంత తప్పో- రోజూ రేడియోలో వార్తలూ- వివిధభారతీ వినేవాళ్లందరూ- ''అయితే మేమూ డిక్సర్లమే'' అనుకోవడమూ అంతే పొరపాటు. 'డిక్సింగ్' చేయాలంటే ప్రత్యేకమైన కొన్ని లక్షణాలని అలవరచుకోవాలి. ప్రస్తుతం పాశ్చాత్యదేశాలన్నిటిలోనూ 'డిక్సింగ్' హాబీ వుండటం ముఖ్యంగా యువతీ యువకులకొక ఫ్యాషన్ సింబల్.

ఈ డిక్సింగ్ హాబీగా చేసుకోవాలంటే కావాల్సింది మొదట ఒక మంచి రేడియో. ఫారెన్ కరస్పాండెన్స్‌కోసం పోస్టేజీ... అడపాదడపా క్లబ్స్‌కి హాజరవడానికి (యిష్టమైతే) ట్రావెలింగ్ ఛార్జీలు! అన్నిటికన్నా ఎక్కువగా వెచ్చించాల్సింది 'సమయం'... ఎంత ఎక్కువ సమయాన్ని వెచ్చిస్తే అంత గొప్ప 'డిక్సర్' అవుతారన్న మాట...

డిక్సర్లు ముందుగా ప్రపంచంలోని ప్రముఖ రేడియోస్టేషన్ల కార్యక్రమాల వివరాలు తెలుసుకుంటారు... పగలైనా, రాత్రయినా ఆ సమయానికల్లా ఆయా స్టేషన్లు ట్యూన్‌చేసి వాటిని ఫాలో అవుతారు. అందరూ అన్ని స్టేషన్లలోని అన్ని ప్రోగ్రాములనీ ఏకకాలంలో వినడం అసా

ధ్యం కనుక డిక్సర్లు తమకి ఇష్టమైన ప్రోగ్రాంలని ఎన్నుకుని వాటినే ఫాలో అవుతారు. ఉదాహరణకి భారతదేశంలో రేడియో స్టేషన్లు తమ మొత్తం కార్యక్రమాలలో 25 శాతం వార్తలూ; 11 శాతం ఉపన్యాసాలూ; 35 శాతం శాస్త్రీయ, లలిత, సినిమా, జానపద, గాత్ర, వాద్య సంగీతాలు; 4 శాతం నాటకాలూ; 10 శాతం వివిధ వర్గాలవారి పరిచయం; 15 శాతం ప్రకటనలనీ ప్రసారం చేస్తాయి. ఇదేవిధంగా వివిధదేశాలవారి ప్రసారాలు కేటాయించబడివుంటాయి. ఆయా డిక్సర్లు తమకి ఇష్టమైన విభాగాలని ఎన్నుకుని ఒక నోట్ బుక్‌లో ఆ సమయాన్ని ఎటెండ్‌చేస్తారు. పూర్తిగా ఆ కార్యక్రమాన్ని విని వివరాలన్నీ నోట్‌చేసుకుంటారు... ఈవిధంగా కొద్దికాలం ఫాలో అవగానే ఆ విభాగంలో దేశదేశాల సమాచారమంతా వారికి సుపరిచితమైపోతుంది. అన్నిదేశాలవారి అలవాట్లూ, అభిరుచులూ, భాష, మాటతీరు, సంస్కృతి, విలువలు అన్నీ తెలుస్తాయి. డిక్సర్లకోసమే యిచ్చే ప్రత్యేక ప్రసారాలు ఎన్నో వున్నాయి.

'వాయిస్ఆఫ్ అమెరికా'లో కోట్లాది శ్రోతల్ని అభిమానులుగా చేసుకున్న 'రోస్‌వుడ్‌గేస్', అమెరికా యూనివర్సిటీనుండి ఎనౌన్సింగ్‌లో డిప్లొమా పొంది యువతరానికి ప్రతినిధిగా పిలవబడుతోన్న 'రేమిడ్ డోనాల్డ్', ఆస్ట్రేలియా రేడియోకి చెందిన 'జాన్ అన్రూనన్',

శ్రీలంకకు చెందిన 'నిరంజనే బినండోనా' లాంటి ప్రపంచ ప్రఖ్యాత ఎనౌన్సర్లు డిక్సర్లకి సన్నిహితులవుతారు. అంతేకాకుండా డిక్సింగ్ హాబీ అయినవారి పేర్లు, చిరునామాలూ అనేక రేడియోస్టేషన్లు ప్రసారం చేస్తాయి.

రోజు విడిచిరోజు సాయంత్రం 5.45 నుండి 6.15దాకా బి.బి.సి ప్రసారంచేసే 'మంకీట్రాక్', వి.ఓ.ఎ 5.00 నుండి 5.30దాకా ప్రతిరోజూ వినిపించే పాటలూ, 5.30 నుండి 5.45దాకా బి.బి.సిలో యింగ్లీషుకోర్సు, అలాగే 'బిల్ బర్డ్-హాట్ హండ్రెడ్', వాషింగ్టన్‌నుంచి 'గ్రామీ అవార్డ్స్' లైవ్‌బ్రాడ్ కాస్టింగ్ అన్నీ... ఇవన్నీ డిక్సర్లకి సుపరిచితాలే! ఇంతేకాకుండా 'జాలీ గుడ్‌షో' ప్రోగ్రాంలో డిక్సర్లు కోరిన పాటలు వేయడమేకాకుండా బహుమతులుగా టీషర్టులూ, డైరీలు వంటివి రేడియోస్టేషనే పంపిస్తుంది కూడా.

ఇలా కార్యక్రమాలు వినడంతోనే డిక్సింగ్ ఆగిపోదు. నిరంతరం ఆయా రేడియో స్టేషన్లతోనూ, ఇతర డిక్సర్లతోనూ కాంటాక్ట్స్ కలిగి వుండాలి. ప్రోగ్రాంలోని లోటుపాట్లూ, మెచ్చుకోళ్ళు, సూచనలు, ఎనౌన్సర్లపట్ల అభిప్రాయాలూ ఎప్పటికప్పుడు రిపోర్టులు పంపించాలి. బ్రాడ్ కాస్టింగ్ సరిగా లేకపోయినా, ఏవైనా స్పెషల్ ప్రోగ్రామ్స్ కావాలన్నా అన్నీ ఓపికగా రాయాలి. అలాగే డిక్సర్లక్లబ్బులో సభ్యత్వం పొందటం... సెమినార్లకీ, కాన్ఫరెన్సులకీ హాజరవడం కూడా ఇందులో భాగమే.

ప్రపంచం నలుమూలలనుంచీ డిక్సర్లకి లెటర్లు, గ్రీటింగులు వస్తూనే వుంటాయి. అంతే ప్రచ్ఛన్నంగా పెన్‌ఫ్రెండ్స్ కూడా ఏర్పడతారు.

డాక్టర్లు తమ వృత్తిలో నూతన విషయాలనీ, పాత్రికేయులు లేటెస్ట్ వార్తలనీ, వ్యాపారస్తులు ప్రపంచ మార్కెట్‌రేట్లనీ, రాజకీయవేత్తలు దేశాల స్థితిగతులనీ, ముఖ్యంగా సంగీతప్రియులు కొత్త కొత్త ఆల్బమ్స్‌నీ డిక్సింగ్‌ద్వారా మిగిలినవారికన్నా చాలాముందు తెలుసుకోగలుగుతారు.

మన దేశంలో వేవ్స్ అందకపోవడం, యఫ్.యమ్.బ్యాండ్ రిలేలు అతితక్కువగా వుండటంవంటి కారణాలవల్ల ఈ హాబీ ఎక్కువ ప్రాచుర్యం పొందకపోయినా అమెరికా, యు.కె., ఆస్ట్రేలియావంటి దేశాలలో విపరీతమైన క్రేజ్ సంపాదించింది. వినోదంతోపాటు విజ్ఞానాన్నికూడా అందించే డిక్సింగ్ వెచ్చించిన సమయానికి బదులుగా ఎన్నోరెట్ల సంతృప్తి యిస్తుందనడంలో ఏమీ సందేహంలేదు. 

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

